అంతటి ద్రోహులు, పాపాత్ములు, నీచాతి నీచులు క్షమింపరానీ వారని వర్ణింపరాని యుద్రేకమును రెచ్చగొట్టిరి. రాజంతటి వాని భార్యనే అపహరించినవారు తదితర స్త్రీలను నపహరింపకుందురా? కాన తక్షణమే ద్రావిడుల వధింపవలయునని యుద్ధమునకు పురి గొల్పిరి. అంత శ్రీరాముడు భార్యా వియోగము సహించలేక ద్రావిడులపై యుద్ధసన్నద్ధుడై, తదితర క్షత్రియులకు తెలియజేసెను. సీతనపహరించిరని ద్రావిడులపై ద్వేషమున యుద్ధ సన్నద్ధులైరి.

ఇట్టి సమయమున దక్షిణ హిందూదేశమున గల ద్రావిడులు, పూర్వ నాగరికతను గోల్పోయి, యనాగరికులవలె, వెనుక మూరెడు పొడువుగల గోచీను ధరించెడివారు. అట్టి వీరి నాయకుడు వాలి. ఇతని తమ్ముడు సుగ్రీవుడు. వీరు సింహళ నాయకుల ప్రతినిధులు. సంపూర్ణ ద్రావిడ పక్షము వహించిన్నవారు, ఆర్యుల యజ్ఞముల ధ్వంస మొన రించెడివారు.

ఈయన్న దమ్ములకు యంతః కలహము సంభవించినది. బల వంతుడైన యన్న తమ్ముని లెక్క చేయక కొంత యక్రమముగా ప్రవర్తించి నందున తమ్ముడు కొంత యన్యాయమునకు గురియై యన్నను ద్వేషించి తత్సమీపమునగల కొరొక పర్వతమున నివశించు చుండెను.

ఈ విషయము యార్యగూఢచారులెరిగి శ్రీరామునకు దెలి పిరి. అంత శ్రీరాముడు సుగ్రీవుని లోబరచు కొనుటకై కొందరా ర్యుల రహస్యముగ సుగ్రీవు నొద్దకు పంపెను.

అంత యార్యులు సుగ్రీవు నొద్దకుజని యిట్లు జెప్పిరి. "మేము శ్రీరాముని పంపున యేతెంచినారము. మీ సుఖ శ్రేయస్సులే సర్వదా కోరు శ్రీరాముడు మీకివ్విధమున జెప్పుమనియె, 'ద్రావిడ సోదరా! నీహితైషిమైన నా సఖ్యమును యాశింపుము. నీయన్నను బరిమార్చి దక్షిణ హిందూ దేశమున కంతటికి రాజును చేసెద.

ఇందులకు నీవు అంగీకరించెదవని నేను విశ్వసించు చున్నాను." అంత సుగ్రీవుడు రాజునగుదునను నాశచే యొడంబడియె.

తక్షణమే శ్రీరాముడు సుగ్రీవునొద్దకు విచ్చేసెను. అంత సుగ్రీవుడు, రాముడు, యార్యులు కొందరు వాలిని వధించుటకు పన్నాగములు పన్నుచుండిరి. వాలిని ముఖాముఖిగా జయించుట మనకు చేతగాని కార్యము అందువలన రహస్యముగా వాలిని బరిమార్చ వలెనని సుగ్రీవుడు యానతిచ్చె. అంత రాముడు సుగ్రీవుడు వాలిని భరిమార్చుటకై కాచియుండిరి. యధాప్రకారమున వాలి నదికి స్నానమునకు పోవుచుండ రాముడు చెట్టుచాటున దాగి ఒక్క వ్రేటునకు వాలిని సంహారించెను.

ఆర్య తోత్తయిన సుగ్రీవునకు పట్టాభిషేక మొనరించిరి. అంత శ్రీరాముడు సింహళముపై దండెత్తుటకు సుగ్రీవుని యభిప్రాయ మడిగె. ఇక్కార్యము మీరు తలంచునంతటి సులభకార్యము కాదని సుగ్రీవుడు జెప్పెను. సింహళమును జయించవలెనన్న తద్రహస్యము లెరుంగవలయునుకదా? అందుకు హనుమంతుని పంపెను.

సింహళరాజు రావణుడు. ఇతడు మహా పరాక్రమశాలి. సత్యసంధుడు. అహింసా వ్రతుడు. సీతివంతుడు. ఆర్యులపై కత్తి కట్టిన ద్రావిడరాజు. ఇతని తమ్ముడు విభీషణుడు. ఇతడు రాజపదవి కాశించి యశక్యమైనందున యన్నను ధిక్కరించుచూ యార్యులపై ద్వేషము వలదని వ్యతిరేక ప్రచారము జేయుచుండెను.

సింహళము గూఢచారియై వచ్చిన హనుమంతుడు యీ విషయ మెరిగి విభీషణుని కలసికొని హిందూదేశ చరిత్ర యంతయు సవిస్తరముగ విన్నవించె. అంత విభీషణుడు "రాజునగుట కిదియె యుపాయమని" హనుమంతునితో కలసి సుగ్రీవు నొద్దకు విచ్చేసెను. "చూచి రమ్మనమంటె కాల్చివచ్చినట్లు" హనుమంతుడు విభీషణుని దోడ్కొని వచ్చినందుకు నెంతయో నభినందించిరి. అంత రాముడు

సింహాళమునకు రాజును చేసెదనని ప్రతిజ్ఞ చేసెను. అంత విభీషణుడు రామునకొక నమస్కారము జేసి కృతజ్ఞత తెలిపెను.

ఆర్యులు, క్షత్రియులు, ద్రావిడులు, తండోప తండములుగా విభీషణుని నాయకత్వమున సింహాళముపై దండెత్తిరి. సుగ్రీవునకు నావికా బలముండుటచే తద్వారా సింహాళము ప్రవేసించిరి.

విభీషణుడే దండెత్తి వచ్చెనని విని వాని యనుచరులు నతని పక్షమునే నహించిరి వీరివలన సింహాళ రహస్యము లన్నియు రామునకు విదిత మయ్యెను. ముందుగా ఆయుధాగారముల ధ్వంసము జేసిరి. ఇట్లు యనేక కుతంత్రములు జేయుచుండిరి.

ద్రావిడు లధిక బలవంతు లైనప్పటికీ, యుద్ధనైపుణ్య మున్నప్పటికీ విశేషముగా పోరాడి నప్పటికి వీరి గుట్టుమట్టు తెలిసిన విభీషణాదులచే రావణుడు రహస్యమున వధింప బడుటచే ద్రావిడులు సులభమున ఓడింప బడిరి.

ఇంతలో యార్యులు లంకకు సీతను తెచ్చి నొక వుద్యానవనమున వుంచిరి. అంత రాముడు సీత యిన్ని నాళ్లు లంకలోనే యున్నదని భావించి గైకొని విభీషణునికి పట్టాభిషేక మొనరించి స్వస్థానమునకు మరలివెళ్ళెను.

అంత యార్యులు విజయ చిహ్నముగా యశ్వమేధయాగము జేయ సంసిద్ధులై యుండిరి.

ఇట్టి సమయమున సింహాళ ద్రావిడులు ఆర్య తొత్తయిన విభీషణుని నాయకత్వము నందుండుటకు యిష్టపడక రహస్యమున విభీషణుని హత్యచేసిరి. ద్రావిడులు స్వతంత్రులై "చచ్చిన వీరస్వర్గము. జయించిన రాజ్యపాలన" యనురీత్యా ఆర్యులపై కత్తిగట్టి సమయమునకు వేచియుండిరి.

ఆర్యులు విజయచిహ్నముగా యశ్వమేధయాగము జేయుచూ సోమము గ్రోలి తన్మయత్వమున వొడలెరుగక నప్రమత్తతన విలాసమున విహరించుచుండిరి.

ఇదే యవకాశముగా గైకొని సింహళ ద్రావిడులు ఆర్యులపై విరచుకు పడిరి. ద్రావిడుల సర్వనాశనము జేసి, ద్రావిడ నాయకుల వధించిన యాదుర్మార్గుడు యార్య శ్రోత్రియిన రాముని వధించుటయే తమలక్ష్యముగా నెంచి యా ద్రావిడద్రోహియైన శ్రీరాముని వధించి పలాయనమైరి. ఇంతకు మున్నె నావల ధ్వంసము జేసి రార్యులు అందు వలన సింహళమునకు వెళ్ళుటకు వీలులేక విశేష సంఖ్యాకులు పట్టు బడిరి.

ఆర్యులకు పట్టు పడనివారు, తప్పించుకొనినవారు యడవులకు వెళ్ళి యాటవికులైరి.

ద్రావిడుల నందరినిసంపూర్ణముగజయించితిమని సంతోషమున మున్గియుండ నిట్టి ప్రతిఘటన సంభవించుటచేత, తమ సమస్త కష్ట ముల బాపి రక్షించిన మహనీయుడైన రాముడు వధింప బడుటచేత, యార్యులు యప్రతిహత క్రోధోన్మత్తులైరి.

పట్టుబడిన ద్రావిడ నాయకులు యార్యులచే ఘోరాతి ఘోరమున చిత్రవధ జేయబడిరి.

శేషించిన ద్రావిడులు క్షమింప వలసినదిగా ప్రార్థించిరి. వీరు నీచాతి నీచులుగా పరిగణింపబడి క్షమించబడిరి.

పునః ద్రావిడులందు విప్లవశక్తి నశింప జేయుటకై యార్యులు కొన్ని నిబంధనల నేర్పరచిరి.

వీరికి విదేశములతో సంపర్కముండిన విజ్ఞాన వంతులయ్యెదరు గాన, సముద్రయాన మెవ్వరూ చేయకూడదని నిషేధించిరి. ఆర్యే తరులెవ్వరూ విద్య నభ్యసించ రాదనియు, యోగముల నాచరింప రాదనియు, "ఫలాన" వారు "ఫలానా" విధమున నడుచుకొనవలయు నని తీర్మానించిరి. ఆర్యస్త్రీని ద్రావిడులెవరైనా పొందిన నతని శిశ్న మును ఛేదింప వలయునట. ఆర్యులు ద్రావిడ స్త్రీలను కోరిన మనః పూర్వకముగా సమర్పింప వలయునట! ఈ విషయమును పరిశీలించిన యార్య (బ్రాహ్మణ)స్త్రీలు ద్రావిడులతో విచ్చల విడిగా వ్యభిచరించు

చున్నట్లు గాన్పించుచున్నది. ఏలన, ఆర్యులు ప్రాణాయామాది యోగము లందు నిమగ్నులగుటయే కారణము. అందు వలన ఆర్యస్త్రీల వ్యభిచారము నాపుటకై ద్రావిడులపై విరచుకుపడిరి. ఇది ద్రావిడుల దోషమా? ఆర్యస్త్రీల దోషమా? ఈవిధమున తమ కనుకూలమగునట్లు సంఘ చట్టముల నేర్పరచిరి. వారు చెప్పునదే న్యాయము. వారు చేయు కార్యములు దొడ్డవి. వేయేల, వీరు పట్టిన కుందేటికి మూడేకాళ్లనిన విశ్వసింప వలయును. విప్రుఁడు చెప్పినదే వేదము.

ఆహా! విప్లవయుతమునపొందిన నాగరికత మహర్దశ ననుభవించిన హిందూదేశము, గతియేమి కానున్నదో?

ద్రావిడు లెంతటి విప్లవము నభివృద్ధి చేసిరో! ఆర్యులంతటి విప్లవనాశకులై ప్రజలను యజ్ఞానులుగా, యసమర్థులుగా చైతన్య విహీనులుగా నిర్వీర్యులుగా నిస్తేజులుగా నొనరించిన యార్యులకు ధిక్కారము.

స్వార్థపరులై సంఘాభ్యుదయమును ఖూనీచేసిన యార్యులు క్షమింపరానివారు: దండనార్హులు.

ప్రాణాయామాది యోగముల నభ్యసించి అనేక మహత్తుల జూపుచుండిరి. నీళ్ళపై నడచుట గాలిలో యెగురుట, కొన్ని దినములు భూమిలో పాతిపెట్టినను సజీవముగా నుండుట మున్నగు మహత్తుల జూపి ప్రజలను, రాజులను, వశీకరణ మొనరించుకొనిరి. దీనితో యార్యులాడినది యాట, పాడినది పాట.

ఆర్యులు యజ్ఞములపేర జంతువుల వధించెడివారు. అట్లు వధించిన స్వర్గము లభించు ననిరి. మాంసభక్షణ చేయువారు, మద్యము గ్రోలువారు. వ్యభిచారము వీరికి సమ్మతములు.

ఇవి ద్రావిడులకు గిట్టవు. అందువలన ద్రావిడ రాజెవరైనా "యిట్లు చేయవలదని" సందేశము పంపిన నతని వధించి వేరొకనిని రాజుగా జేసెడివారు. ఇందుకు వేనుడు దృష్టాంతము. ఇవ్విధమున క్షత్రియులను తమ యదుపు యాజ్ఞలలో నుంచుకొనిరి. ఇందువలన

రాజులేనరును వారేగంతులు వేసిన, - జోక్యము కలిగించు కొనెడి వారు కారు.

సామాన్య ప్రజానీకమందును విప్లవశక్తి నశింపజేసి, తమ యాచారముల వీరికి సంక్రమింపజేసిన, తమ యాచారములు నిర్విఘ్నముగ నేరవేరునని తలంచి, పోతరాజు, పోలేరమ్మ మున్నగు సామంత దేవతల నెలకొల్పిరి. వీరికి యాగ్రహముకల్గి, అతివృష్టి, అనావృష్టి, అంటువ్యాధులు మున్నగునవి సంభవించునుగాన, వీనిని శాంతింప జేయుటకై యేటలను, బలియిచ్చిన, మన కష్టముల దూరము జేయుననిరి. అందుపై సామాన్య ప్రజానీకము మాంసభక్షకులైరి. మద్యపానమును బుచ్చుకొనుచుండిరి.

ఇప్పటికి యార్యులకు కొంత స్థిమిత మేర్పడినది. ప్రజలను యజ్ఞానుల నొనర్చి, తమ కుతంత్రములు ఫలించినందుకు, గర్వింపదొడగిరి.

ప్రజలందు రాజకీయ విప్లవము నశింప జేయుటకై, కర్మ, విధియని బోధించిరి.

గంజికిని కరువై ప్రస్తువడు దౌర్భాగ్యుడు నిరంతరము కృషి చేసినను తినటానికి తిండిలేక, కట్ట బట్టలేక, వుండ యిల్లులేక, యవస్థపడుచూ ధనవంతుల నిదేమియని ప్రశ్నించుటకు బయలుదేర కర్మ! నీకర్మ!! పూర్వజన్మకృతకర్మ!!! ఇటులే జీవించుట నీ విధియను కర్మ సందేశముతో విప్లవము నశింపజేసిన యవస్థల ననుభవించుట "విధి" యని యెన్ని కష్టములనైనా సహించెడు వాడేగాని, తన కష్ట కారణము లరసి, కష్టముల దూరముజేయ ప్రయత్నింపడు.

ఇట్టి సందేశముల ద్వారా సామాన్య ప్రజానీక విప్లవశక్తి నశింపజేసి ధనికులును తమ యధికారముల సుస్థిరము జేసుకొనిరి.

ప్రజనుండి తమకేవిధమైన హాని సంభవింపకుండునట్లు నరకమును సృష్టించిరి. ఆకాశమున నరకము కలదనియు దాని యధిపతి యముడనియు, జీవులు చేయు పాపపుణ్యముల చిత్రగుప్తుడు

ప్రాయుననియు, తద్వారా మరణించిన జీవులు పాపులై నరకమున ఘోరయాతనల యనుభవించెదరని ప్రజలకు చాటిరి. ఆర్యుల పల్లెత్తుమాట యనుట దగరనుండి చిత్రవధ చేయుటవరకూ యప్రతి హత పాపమట. యజ్ఞములందు జంతువధ చేయుట పాపము కాదుట! పవిత్రమట!! ఇట్లు పాపవిచక్షణజేసి నరకమును సృష్టించి తమ్ము సర్వదా రక్షింపుకొన దొడగిరి.

స్వర్గమును సృష్టించి ఆర్యులకు ధనము దానము జేసిన స్వర్గ సుఖము లభించు ననియు పునః ధనవంతులై జన్మింతురనియు చాటిరి. బీద ప్రజానీకము సత్యమని విశ్వసించినవారై వున్నధనమును యార్యులకు సమర్పించి యధిక నిరుపేదలై తినటానికి తిండిలేక ప్రాణముల విసర్జించు చుండిరి. ఇట్లు యార్యులు ధనసంపాదన జేయుచూ సుఖమున నుండిరి.

## నాస్తికులు

ఆర్యులిటుల నరకము పేర తమ్ము రక్షించు కొనుచూ, స్వర్గము పేర ధనసంపాదన జేయుచూ, దేవుని పేర పీనిని చలామణి జేయు చుండిరి.

ఇట్లు యార్యులు ప్రజల నన్నివిధముల నాశనము జేయుచుండ, అన్యాయమును ప్రతిఘటించు వారు లేకుందురా? సర్వకాల సర్వావస్థ లందును కలరు. కొందరు సామాన్య క్షత్రియులు ఆర్యులపై వ్యతిరేక చారము [illegible]యు నారంభించిరి. వీరి నాయకుడు చార్వాకుడు.

"ఎవడు జేసిన కర్మ ఫలము వాడిచ్చటనే యనుభవించును. తద్భిన్నమైన కర్మఫలము నాశింపని యెడల కర్మ జేయవలసిన యావ శ్యకతయే లేదు. తాన కర్మ ఫలముల నరక స్వర్గముల యనుభవిం చుట కాస్కారమే లేదు. ఇందువలన యాకాశమున స్వర్గ నరకములు

వుండవలసిన యావశ్యకతయే లేదు. కాన నరకము యార్యులు తమ్ము రక్షించుకొనుటకు, స్వర్గము ప్రజలనుండి ధనసంగ్రహణ జేయుటకు యార్యుల కల్పిత లోకములు.

ఈ జీవుడు మరణించిన తిరిగి జన్మింపడు. వృక్షము విత్తన ముల నిచ్చి నశించునట్లే, మానవులును నశించుచున్నారు. పునః జన్మింప వలసిన యావశ్యకత లేదు. మరణించిన పిదప దయ్యములు, భూతములు కారు. జీవుడు మరణించిన దేహము చైతన్యము కోల్పో వును. ఆ చైతన్యమే జీవుడుగాన దేహముతోపాటు జీవుడును నశించు చున్నాడు. కాన పునః జన్మించుటకుగాని, దయ్యములు, భూతము లగుటకుగాని, మరణించిన జీవున కస్థిత్వము లేనందున నట్టి మూ ఢాభిప్రాయములుకల్గి యుండుట యవివేకము. కాన మరణించిన జీవునకు శాంతి వగైరాలు జేయుటనవసరము. ఇతనికి ఆకలి, దప్పిక యగునని మీరిచ్చట యాహారమిడిన నతనికి ఆకలి తీరునా? ఐన అనతి దూరముననున్న వ్యక్తి కిచ్చట యాహారమిడిన నాతని యాకలి తీరునా? కాన తద్దినములు వగైరా చేయుట నిష్ప్రయోజనము. ప్రయోజనము కలదని చెప్పువారికి మాత్రమే ప్రయోజనముకలదు. కాన స్వార్థపరులు తమ జీవికకై యనేక యసత్యసిద్ధాంతముల విశ్వ శింప జేయుచున్నారు. వారిని వాటిని దరిజేర నీయకుడు.

ఈ జన్మమున ధనము దాచిన పరజన్మమున ధనవంతులై పుట్టుదురనుటకంటె హాస్యాస్పదమింకొకటి కలదా? ఇంతకు పూర్వము యివ్విధమున దానము జేయుట లేదుగాన, నేడు ధనవంతులెవ్వరూ లేకుండవలసింది. భిన్నముగా నేడిందరు ధనవంతు లుండుటకు కారణ మేమి? కాన పరజన్మమున ధనవంతులగుట ప్రకృతి విరుద్ధము. ఉన్న యాస్తినంతయు యీ జన్మమున వారికి ధారపోసి దరిద్రు లగుట నిక్కము. కాన వుభయ భ్రష్టత్వము ప్రాప్తించుట తథ్యము. దానముగ్రహించువారు మాత్రము యీ జన్మలోనే ధనవంతులగుట ప్రత్యక్షము. కాన ధనసంగ్రహణకై యనేక మాయోపాయముల





బన్నుచుండిరి. ప్రజల క్షేమముతో వారికి నిమిత్తము లేదు. దరిద్రులైనను సరియే; మరణించినను సరియే; అటువంటి స్వార్థమే పరమార్థముగా భావించు యార్యుల (బ్రాహ్మణుల) మలమును విసర్జించినట్లు విసర్జించుడు. ఆనాడు మీరందరు ధనవంతు లయ్యెదరు. తద్వారా మీరు సుఖవంతముగ జీవించగలరు.

ఇట్లు చార్వాకుడు యార్యులకు వ్యతిరేక ప్రచారము చేయు చున్నందున యార్యుల కమితి యాగ్రహము కలిగినది. తమ్ముల సత్యవాదులుగను దేశద్రోహులుగను, స్వార్థపరులుగను ప్రజలకు గుట్టుమట్టు లన్నియు తెలుపుచున్నందున ప్రజలు యార్యులపై విశ్వాస రహితులై అగౌరవముగ చూచెదరు. తమ జీవికకు భంగము కలుగును.

చార్వాకుడు పరలోకములు దేవుడు లేడని చెప్పినందున నాస్తికుడనిరి. ఇతని యనుయాయులు నాస్తికులైరి.

అధికారు లార్యులు. అనధికారులు నాస్తికులు. ఐనందున స్వల్పకాలముననే నాస్తికుల ప్రచారము నిరోధించ నాస్తికులిట్టి వారు యట్టివారు దేవుని విశ్వసింపరు, పరలోకముల విశ్వశింపరు, పునర్జన్మ నంగీకరించరు. ఆహా యిట్లు దైవదూషణ యిప్పాపాత్ముల్లను నరకమున యముడు బెట్టు బాధల వర్ణింపదరమా? దేవుడు లేడట! అతనిని ప్రార్థించుటనవసరమట! అతని పూసే పనికిరాదట! వీరి యహంకారము చూడుడు. "తల్లిపాలుద్రావి రొమ్ముగ్రుద్దినట్లు" దేవునిచే సృష్టింప బడిన ప్రకృతిని యనుభవించుచూ దేవునిచే సృష్టింపబడి దేవుని ధిక్కరించు చున్నారు. వీరు యీ ప్రపంచ ముండునంత వరకు క్రిమికీటకాదులై జన్మించుచూ మరణించు చుందురు. కాన మీరు (ప్రజలు) అట్టి పాపాత్ముల బోధలకు గురికాకై నాశముగాకుడు.

అని యివ్విధమున యార్యులు ప్రజలకు బోధించిన వారైరి.

నేటి విజ్ఞానయుగమున తత్కారణము లన్నియు జూపి ఆస్తిక సిద్ధాంత ము లసత్యములన్నను కొందరు విశ్వసించుట లేదే? ఆ యజ్ఞాన యుగమున చార్వాకుని సందేశము నెవరాలకించిరి? అందువలన పునః యార్యుల బోధతే ప్రజలు విశ్వసించిరి. ఆర్యుల కపటనాట కము యధారీతిగానె నడచుచున్నది. నాటినుండి నేటివరకూ నాస్తిక ప్రచారమును ఆస్తికులు నిరోధించుచునే యుండిరి. నాస్తికులు దేవుని పరలోకముల విశ్వసింపరుగాన పాపమునకు వెరువక సమస్త పాపకార్యములు జేయు పాపులుగను యవినీతిపరులుగను ప్రజలుకు బోధించిరి. అందువలన నేటికిని, ప్రజలు నాస్తికు లన ఏహ్యాభావము ననుండిరి. ఆస్తికులే దేవుని పేరిటజంతువధ జేసిన పుణ్యామట! దేవుని పేరిట ధనసంగ్రహణజేసిన ఫలితము పునర్జన్మమునట!! దేవునిపేరిట వ్యభిచరించిన పవిత్రమట!!! ఆహా! ఆస్తికుల అహింసాతత్వము!! ఆహా! న్యాయ, సత్య ధర్మములు!!!

అంతటితో నాస్తికులు తమ ప్రచారమును విరమించుకొనక యేలాగైనా, ఆర్యుల సత్యమన్యాయ యధర్మములనుండి ప్రజలను రక్షించుటకై నడుముకట్టిరి. ఆర్యులు యధికారులైనందున, తమ ప్రచార నిరోధము, వారి యసత్య బోధనలు గావించుచున్నారు గాన, అధికారముననే యార్యుల ధిక్కరించి తమ ప్రచారము కొనసాగ వలయునని నాస్తికులు తలంచి రాజులకు ఆర్యుల కుతంత్రము బోధించి మా ప్రచారమునకు సాహాయ్య పడవలసినదని ప్రార్థించిన నెవ్వరు సహాయపడరైరి. ఆర్యులతో విరోధము సంభవించిన తమ రాజపదవికి నీళ్ళు వదలు కొనవలయునను భీతియుండుటచే యెవ్వరును నాస్తికులకు సహాయ పడకుండిరి. అందువలన యార్యులు యధేచ్ఛమున విహరింపుచుండిరి. ప్రజలు నానాటికి తీసికట్టను రీత్యా అజ్ఞానులై యార్యుల దాస్యమునే జేయుచుండిరి. అనయార్య యసత్య సిద్ధాంతముల విశ్వసించుట,

తద్వారా యార్యులకు పూజజేయుచూ ధనమును సమర్పించుట, సంఘాభ్యుదాన్ని ఖూనీచేయుటే తమ లక్ష్యముగాగల యార్యులను గౌరవించుట, ఇట్లు ప్రజలను సర్వవిధముల నిలువు దోపిడీ చేయుచూ "గౌరవ నీయులమని ప్రజలకు బోధించి పూజింప బడుచుండిరి.

ఆర్యులు ప్రపథమమున ప్రకృతి శక్తులకు భీతిచెంది తమ రక్షణకు వానినే పూజించిరి. దరిమిలా ప్రకృతి శక్తులు క్రమబద్ధమున నుండు జనుములని తెలిసి వానిని పూజించుట విరమించు కొనిరి. ఐన యీ ప్రకృతి శక్తుల సృష్టించి క్రమబద్ధమున నడుపువాడెవడో యొకడు యాకాశమున యుండెనని పూజించిరి. ప్రకృతి శక్తుల కంటెను యతీతశక్తిగల వానిగా వూహించిరి. ఈ అతీత శక్తికే "దేవుడని" పేరిడిరి. తమ కష్టములు దూరము గావలయునన్న ప్రకృతి శక్తుల కధిపతియైన దేవుని ప్రార్థించుట ప్రారంభించిరి.

ఇట్లు ఆర్యుల యజ్ఞానావస్థ నుండి దేవుడు జన్మించినాడు.

అంత నాస్తికులు దేవుని పూర్తిగా ఖండించిరి. ఈ ప్రపంచమును దేవుడే సృష్టిచేసెనన్న, నతడుసాకారుడు కావలయును. అనగా అనంత శక్తిగల మానవుడు కావలయును. ఇట్టి సృష్టికర్త సాకారుడైనందున యీ సాకారుని సృష్టించిన సాకారు డెవరు? ఇతనిని సృష్టించిన దెవరు?

ఈ హేతు వాదముతో దేవుడే యీ జగత్తును సృష్టించెనని చెప్పు ఆస్తిక వాదుల ప్రధాన సిద్ధాంతము త్రోసి వేయ బడెంది. పునాదులు లేని భవనమయింది.

ఈనాస్తిక వాదాన్ని ఖండించుటకు ఆర్యులు తత్వశాస్త్ర పరిశోధనలు జేయవలసి వచ్చినది. ఈ జగత్తును సృష్టించిన వాడెవడు? హేతు వాదరీత్యా సాకారుడనుటకు వలను పడదు మరి నిరాకారుడందుమా? అవయవ రహితుడు యీ జగత్తును సృష్టించుటెట్లు? ఈ విషయము ఆస్తికులకు యభేద్యమైనది. ఏదోయొక కుతంత్రముచే యీ సమస్య నుండి తప్పుకోవటమే మార్గమని తలంచిరి.

"ఈ జగత్తును సాకారుడు సృష్టించలేదు. ఒక అనిర్వచనీయమైన శక్తి కలదు. ఈ శక్తినుండియే సమస్త శక్తులు ఉద్భవించినవి. ఇదియే పరబ్రహ్మ. సర్వకాల సర్వావస్థలందును, స్థిరముగ నుండునది. ఇందుండియే యీ జగత్తు సృష్టించబడినది. ఇందే లయమగును. కాన ప్రపంచము స్వప్నసమానము, మిథ్య. ఇటువంటి ప్రపంచాన్ని తెలుసుకొనే కంటె, ప్రపంచానికి కారణ భూతమైన పరబ్రహ్మనే తెలుసుకొనుట యుత్తమము. ఆ పరబ్రహ్మనుండియే యీ జగత్తు కలిగినది గాన, పరబ్రహ్మను తెలుసుకుంటే సర్వము తెలుసుకున్నట్లే. ఈ పరబ్రహ్మను తెలుసుకోవాలంటే ఘోరమైన తపస్సు చేయాలి. అట్లు తెలుసుకున్నవాడు బ్రహ్మజ్ఞాని. ఇట్టి బ్రహ్మజ్ఞానులు పునర్జన్మ రహితులై మోక్షసిద్ధి పొందుదురు.

ఆర్యుల తత్వశాస్త్రము తత్వశాస్త్ర రూపేణాగాక వేదాంత మార్గంలో నడిచింది. ఆపరమాత్మను తెలుసుకుంటె "అంతా తెలుసుకున్నట్లే" అనే భావనతో హేతువాదము నామరూపాదులు లేకుండా నశించింది. ఇకవీరు"ప్రపంచములో తెలుసుకోవాల్సింది యేమీ లేదు. పరబ్రహ్మను తెలిసికొని కోర్కెల నన్నింటినీ నశింపు జేసిన నిత్యానందము లభించుతుంది", అని ప్రజానీకమునకు బోధింప సాగిరి.

ఆర్యులు మహత్తుల జూపినందున నేమానవాతీతులుగా ప్రజలు భావించుచుండిరి. ఈ ఆధ్యాత్మిక వాదము విని వీరినే దేవుళ్లనుగా పూజింప దొడగిరి. ఇందువలన ప్రజలకు యే విధమైన లాభము లేనప్పటికి, వారియందు గౌరవము కలిగి యుండిరి. బ్రహ్మజ్ఞాని ఆగ్రహము కలిగి కన్నులు తెరచిన లోకములు భస్మమగుననియు, ఆగ్రహము కలిగి తిట్టిన నశింతురనియు మున్నగు మహత్తుల బ్రహ్మజ్ఞానుల కారోపించి, ప్రజల భయభక్తుల నాకర్షించిరి. ఇందువలన ప్రజలు నాస్తికుల నాదరింపకుండునటుల ప్రజలు వశీకరణ జేసుకొనిరి.

అంత నాస్తికులైన కణాద, కపిలులు ఆస్తిక మతాన్ని పూర్తిగా ఖండించారు.

కణాదుడు యీ విధముగా వాదిస్తున్నాడు.

"పదార్థమును విభజించగా విభజించ వీలులేని వానిని పరమాణువులందురు. ఆ పరమాణువులే యీ ప్రపంచ సృష్టికి కారణము. అణువులకు వినాశనములేదు. అవి నాలుగు రకాలుగావుండి నాలుగు గుణములు గలిగియున్నవి. ఒకేరకం ఒకేగుణంకల అణువులు వస్తూత్పత్తికి కారణభూత మౌతాయి. కణాలలోవున్న స్వాభావిక ధర్మం వస్తువులో ద్యోతక మవుతుంది. అదేధర్మంతో వస్తువు తదితర వస్తువులతో సంయోగము పొందుతుంది.

ఈ ప్రకృతి అణువులచే సృష్టింప బడినందున యీ ప్రకృతికి ఆది అంతము కలదు. కారణం లేకుండా కార్యము జరుగదు కాన ప్రపంచ సృష్టికి అణువులే కారణము. అణువులు వియోగము చెందిన యేకార్యము జరుగదు. అప్పుడు అగోచరమైన శక్తివల్ల అణువులు సంయోగముపొంది కణాలుగా పరివర్తనజెంది ప్రపంచ సృష్టి జరుగును.

కణాలు యేర్పడటానికి అందులోవున్న అణువులే కారణము. యీ కలయికకు అగోచరమైన శక్తి కారణం.

ఈ సిద్ధాంతంలో భౌతికతత్వం బాగా స్ఫురిస్తుంది.

ప్రకృతికి మూలకారణం అణువులని చెప్పుచూ, అగోచరమైన వేరేశక్తిని కారణభూతముగా చూపాడు. ఈ రెండో కారణము అనవసరముగా గన్పట్టుచున్నది. ఏలన, ఒకదానితో మరొకటి సంయోగము పొందే గుణము అణువులలోనే అంతర్గతముగా నున్నది. కాన అణువుల సంయోగమునకు వేరే శక్తి అనవసరము.

"కార్యం (వస్తువు) కారణంలో యిమిడివున్న సంయోగ స్వభావాన్ని బట్టి యేర్పడుతూవుంటుంది." అంటే సంయోగం అణువుల స్వాభావిక ధర్మము కాన అణువు లెప్పుడు చేతనావస్థలో నుంటవని కణాదుడు వూహించలేక అగోచరమైన శక్తిని అనవసరముగా జోడిం

చాడు. కణాదుని సిద్ధాంతరీత్యా ఆధ్యాత్మికవేత్తలు చెప్పుకునే పరమాత్మకు స్థానం లేదు. దీని ప్రకారము ఆత్మకు స్వతస్సిద్ధమైన జ్ఞానమూ లేదు.

కణాదుడు మరిలా వాదిస్తాడు.

"ఒక వస్తువు కారణమైనపుడు, ఆ వస్తువులో వున్న గుణాలే, కార్యముగా పరివర్తన జెందిన వస్తువులోను తప్పని సరిగా వుండితీరాలి. జ్ఞానవంతమైన చేతనం (పరమాత్మ) ప్రపంచానికి కారణమైన, కార్యమైన ప్రపంచమందును "జ్ఞానం" యనే గుణం తప్పని సరిగా వుండాలి. కాని అలా లేదు. కాన జ్ఞానవంతమైన పరబ్రహ్మ ప్రపంచమునకు కారణ భూతము కాజాలదు. కాన పరబ్రహ్మను తెలిసికొన్న సర్వము తెలిసికొన్నట్లే, యనే వాదన పునాదుల సహితమున పెరికి వేయబడినది.

అణువులు విపరీత కలియిక వల్ల మనస్సు (చేతనావస్థ) యేర్పడుతుంది. ఆత్మ కేవలం ప్రాణియుద్దీపన, ప్రాణి, పదార్థ సంయోగము వల్ల యేర్పడుతుంది. అణువుల సంయోగమువలన యేర్పడిన ప్రాణి, ఒక దశలో బహిర్గత ప్రపంచముతో వ్యవహరించే గుణాన్ని పొందుతుంది. అదే మనస్సు. ఆత్మ వేటివల్ల యేర్పడుతుందో, అవి ప్రాణికి కారణభూతమైన వస్తువుల్లోనే అంతర్భూతముగా వున్నవి. వస్తువు అణువుల సంయోగమువలన కలుగుచున్నది. అణువులు నాలుగు విధాలు — భూమి, నీరు, గాలి, అగ్ని.

ఇవ్విధమున ఆత్మ జడ పదార్థమని, చేతనంకాదని నిరూపిస్తూ బహిర్గతమైన పరమాత్మ మూలకారణం కాదని నొక్కి చెపుతున్నాడు. అణువులే ప్రపంచసృష్టికి మూలకారణం యని స్పష్టంగా చెప్పాడు.

ఆధ్యాత్మికవేత్తలే జడపదార్థమును అజ్ఞానముగా, పరమాత్మను విజ్ఞానముగా భావించారో అట్టి పరమాత్మ అజ్ఞానముగా అనవసరముగాను; పదార్థమునకు మూలమైన యణువులే జ్ఞానవంతముగా కణాదుడు సిద్ధాంతము జేశాడు. ఇతని సిద్ధాంత రీత్యా, ప్రకృతి





యెప్పుడూ మార్పు జెందుచూ, వుండుటచే పాతవస్తువులు నశించి క్రొ వస్తువులేర్పడుచున్నవి. కానిపదార్థమునకుమాత్రమునాశనములేదు."

ఇతని దరిమిలా సాంఖ్యశాస్త్ర నిర్మాత కపిలుడు యీ విధంగా వాదిస్తాడు.

"భగవంతుని అస్థిత్వం తర్కబద్ధంగా నిరూపించటానికి వీల్లేదు."

అందుకని ఆధ్యాత్మవేత్తలు యితనిని నాస్తికుడిగా పేర్కొన్నారు.

ప్రకృతి స్థిరత్వమును గుర్తించటమే యితని సిద్ధాంతములో వున్న గొప్పదనము. భావం మినహా యేదీ స్థిరముగాదనే వాదనను సాంఖ్యశాస్త్రము పూర్తిగా ఖండించుతుంది. కపిలుడు యిలా వాదిస్తాడు.

"భావం ఒక్కటే స్థిరమైనదని యనటానికి వీలు లేదు. ఏలన బహిర్గత ప్రపంచము వున్నది. భావనకు కారణభూతము ప్రపంచము. కాన ప్రపంచము లేకపోతే భావంవుండదు. అప్పుడు అంతాశూన్యం భావనాశక్తి వల్లనే వస్తుస్థిరత్వము రుజువు చేయబడుతుంది. భావనా శక్తిని మిధ్యని వాదిస్తే భావంవున్నదనే భావనాశక్తియూ మి... యవుతుంది.

సాంఖ్యశాస్త్రములోని యీ సూత్రము "వస్తువునుబట్టి భావ వుంటుంది." అనే అధునిక భౌతిక వాదముతో యేకీభవిస్తుంది.

ఆధ్యాత్మిక వేత్తలు భగవంతుని సృష్టికర్తగా సమర్థిం టానికి యీ వాదనను యిలా ఖండించారు.

"స్వప్న సమానమైన యీ ప్రపంచమును స్థిరము, అస్థిరమ అని చర్చించటము అనవసరము."

దీన్ని ఖండిస్తూ కపిలుడు యిలా అన్నాడు.

"ప్రపంచం అస్థిర మైనదికాదు. దీని స్థిరత్వాన్ని కాదం నికి తగిన ప్రబల కారణములేదు. పంచేంద్రియాలు వున్నదా? లేవనే మాధ్యంలో లేవు. కాన ప్రపంచ స్థిరత్వాన్ని కాదనటా యెవరూ సమర్థులుకారు.

"శూన్యంనుంచి యేదీ వుద్భవించదు." అని కపిలుడు స్పష్టంగా చెప్పాడు. దీనితో ఆధ్యాత్మిక పునాదులే కదిలిపోయినాయి.

కపిలుడు వస్తువును 25 భాగాలుగా విభజిస్తాడు. ఐనప్పటికి వీని కన్నింటికి మూలం భౌతిక పదార్థముగానే అంగీకరిస్తాడు.

"మూలానికి మూలంవుండదు. కాన మూలం మూలంలేనిది."

ఈ విధముగా జడ పదార్థము ఆదికారణ భూతమైనదిగా అంగీకరిస్తాడు. మనస్సు, బుద్ధి ప్రకృతిలోనివే కాన భౌతికాంతర్గత ములే; ఆత్మఒక్కటే పదార్థానాకి వేరుగా చూపబడింది. పదార్థమే యీ ప్రపంచానికి కారణ భూతమని యంగీకరించిన ఆత్మ అనవసరము.

సాంఖ్యశాస్త్ర ప్రకారము ప్రకృతి త్రిగుణాత్మకంగా (సత్వ, రజ, తమోగుణములుగ) చూపబడ్డది. మరియు యివే ప్రకృతి పరిణామమున కాధారభూతములున్నా ఐన యీ గుణములకు కారణమేమిటో? కపిలుని సిద్ధాంతము ప్రకారము "శూన్యంనుంచీ యేదీ యుద్భవించదు." కాన యీ చిక్కునుండి కపిలుడు తప్పించుకోవటానికి "అచేతనావస్థలోనే పదార్థం త్రిగుణాత్మకమని" నిర్వచించాడు.

కపిలుడు కణాదుని యణువాదాన్ని యంగీకరిస్తే తనగొప్పతనానికి లోటని యిన్ని సందిగ్ధావస్థల నెదుర్కొనవలసి వచ్చినది.

కాని కపిలుని వాదమే బాగా పరిశీలిస్తే సరియైన భౌతికవాదం యని తేలుతుంది.

కణాదుని సిద్ధాంతరీత్యా కపిలుడును అన్ని వస్తువులకుమూలం అణువులే యంటూ, అంతకంటే సూక్ష్మమై సర్వము వ్యాపించిన మరొకటి వుత్పత్తి పదార్థముగా సూచిస్తాడు. ఆధునిక భౌతిక వాదులున్నా, పరమాణువు కంటేను మరొకటి కలదని యంగీకరించిరి గాన కపిలుని సిద్ధాంతము పూర్తిగా భౌతిక వాదముతోనే నడచింది.

"ఏదైనా వుద్భవించటానికి పదార్థం అవసరం. లేని దాన్నుం యేదీయుద్భవించదు." కాన సాంఖ్యశాస్త్రరీత్యా యీ ప్రకృతికి కారణ భూతం అణువు లే.

• ఆత్మనిర్గుణం, నిరాకారం. ఇటువంటి యాత్మనుండి, ఆకారగుణాదులు కలిగిన ప్రకృతి జన్మించినదని చెప్పుటకు వీల్లేదు. చెప్పిన ఆత్మ స్వభావానికే విరుద్ధము. కపిలుని సిద్ధాంతరీత్యా ప్రకృతిస్వయం సంపూర్ణత్వం గల్గి మూల కారణముగా చూపబడ్డది.

ఈ విధముగా కణాద, కపిలులు ఆధ్యాత్మికతత్వమును ఖండించారు. ఐనప్పటికి ప్రజలకు తెలిసికొను జ్ఞానము లేనందున, యీ హేతువాదాన్ని యంగీకరించిన వారు స్వల్పసంఖ్యాకులగుటచేతను, ఆధ్యాత్మిక శాస్త్ర ప్రభావమే ప్రజలపై ప్రసరించింది.

దరిమిలా ఆధ్యాత్మిక వేత్తలు యీ నాస్తిక ప్రచారము ప్రజలందు వ్యాపింపకుండుటకై మార్గమేమిటాయని విచారించగా ప్రజలను మరింత అజ్ఞానుల జేయుటే మార్గముగా గన్పట్టినది.

ఆర్యులు నిర్వికారుడే దేవుడని తెలిసికొన్నప్పటికి ప్రజలకు తెలుపక అజ్ఞానావస్థలోనే యట్టిపెట్టి యనేక యసత్య బోధలజేయ మొదలిడిరి.

"స్వర్గ నరకములు కలవు. పునర్జన్మ కలదు. ప్రపంచమున ధనవంతులు, దరిద్రులు, సుందరులు, కురూపులు విద్యావంతులు, అవిద్యావంతులు అవయవహీనులు జన్మించుటకు వారి ప్రారబ్ధకర్మమే కారణము. అసలు ప్రారబ్ధకర్మ ననుభవించుటకే జన్మకలుగుచున్నది. నీచకర్ములు నీచయోనులందు మధ్యమ కర్ములు పశుపక్ష్యాదులు అనయవహీనులు దరిద్రులు జన్మింతురు. ఉత్తమకర్ములు ఉత్తమ మానవులై జన్మింతురు. కాన యిందు మానవ స్వాతంత్ర్య మేమియు లేదు. ప్రారబ్ధ కర్మానుసారమున జీవులు పుట్టుచున్నారు. గిట్టుచున్నారు. సుఖదుఃఖముల ననుభవించు చున్నారు. కాన మానవుడు కర్మాధీనము. కర్మవిధికృతము. విధి దైవాధీనము. కాన దేవుని

పూజించుట యుత్తమము." ఇంతేగాకుండా అసలు మానవ కోర్కె లనే నశింపజేసి జడులచేయటానికే ప్రయత్నించారు.

మానవుని కోర్కెలకు అంతులేదు. ప్రపంచమున మానవుడు కోర్కెలద్వారా ఆనందము ననుభవించు చున్నను యింకను యనుభ వించ వలసినది మిగిలియే యుండును. కాన సంపూర్ణానందము యీ ప్రపంచమున దొరకుట దుర్లభము. కాన కోర్కెలను నశింపజేసిన మనఃస్థిమితము గలుగును. తద్వారా మనస్సును సమూలమున నశింప జేసిన నిత్యానందమును చూపుమార్గమే లేదు.

ఇవ్విధమున యార్యులు స్వార్థపరులై ప్రజలను అజ్ఞాన రొంపిలో పడద్రోసి, తమ యధికార సుఖముల రక్షించుకొనుచూ, తదితరుల స్వాతంత్ర్య సుఖముల ఖూనీచేశారు. సంఘానికి తీరని యపచారము కలుగజేసి సంఘద్రోహులైరి. దేశద్రోహులైరి.

ఆర్యులీవిధమున సంఘమును ఖూనీ చేయుచుండ, ఆర్యేతరులలో కొందరు కాయకష్టము జేసి జీవించ లేక సంఘాన్ని పీల్చి పిప్పి జేయుటకు బయలు దేరారు.

ఈ అజ్ఞాన యుగమున కార్యమునకు కారణము తెలియనందున యనేకవూహా సిద్ధాంతముల విశ్వసించెడివారు. అందులో వైద్య మొకటి. వ్యాధివచ్చిన, దాని కారణమరయక, ఆర్యులు జెప్పెడి పరలోకములు, పునర్జన్మ మున్నగు సిద్ధాంతములు యమలు నందుండుటచే, విరోధి చనిపోయిన దరిమిలా పగ సాధించుటకై దెయ్యమై, సజీవుని బాధించు చున్నాడనియో లేక పిశాచమో భూతమో పట్టినదనియో భావించి యారోగిని బలవంతముగా చావ మోదుదురు భూతవైద్యులు ఇట్లే ప్రతి వ్యాధిగ్రస్తులకును దెయ్యమో, భూతమో పట్టినదని చెప్పెడివారు. ఆ రోగులు మరింత భయపడి వున్మాదులయ్యెదరు. అంత భూతవైద్యులు "అదిగో, యిదిగో" యనుచు పారిపొమ్మని బలవంతముగా కొట్టెదరు. అంత రోగిస్మృతి హీనుడై పడిపోవును. దయ్యము విడిచివెళ్లినదని తన పరాక్రమమును

౯నెళ్ళ౯గక్కు-చూ గంతులు వేయును. దరిమిళా వ్యాధి మాత్రము నశించెడిది కాదు. వ్యక్తి నశించ వలసినదే. ఒకవేళ వ్యాధి నివర్తించిన భూతవైద్యుని మహిమ, మరణించిన దేవుని మహిమ! కర్మ!! రోజులు సరి!!!

ఈ విధముగా సంఘములోవున్న మూఢాభిప్రాయముల నెటులనైనా నశింపజేసి, ప్రజలకు విజ్ఞానము బోధించి, ఆర్యసిద్ధాంతముల నశింపజేసి, ప్రజలను ఆర్యదాస్యము నుండి విడిపింప జేయటానికై నాస్తికులు సర్వదా విశేష ప్రయత్నములు జేయుచుండిరి. కాని యిది యెలా సాఫ్యమగుతుంది? స్వార్థపరులైన యార్యులు యధికారులగుటచే, నాస్తికులు జెప్పెడు సత్యబోధ ప్రచారముగాకుండా నిషేధించుచుండిరి. అందువలన నాస్తికులును యధికారము చేతనే ఆర్య సిద్ధాంతము నశింపజేసి, ప్రజలను జ్ఞానవంతులజేసి వారి జీవితముల సుఖవంతము జేయవలెనని నడుము కట్టినవారై, రాజులకు ఆర్య కుతంత్రము బోధించి తమప్రచారమును సఫల వంతముగా జేయవలసినదని ప్రార్థించుచుండ యెవ్వరును అంగీకరింపరైరి. అంతనాస్తికులు ఓర్పువహించి కాలము కొరకు వేచియుండిరి.

## బౌద్ధ మహాయుగము.

గోరఖ్పూరు జిల్లాకు నుత్తరమున కపిలవస్తు నగరము కలదు' దీనిని శుద్ధోధనుడను రాజు పాలించుచుండెను. ఈతని భార్య మాయాదేవి.

ఈ రాజ దంపతులకు క్రీ. పూ. 557 వ సంవత్సరమున నొక బాలుడు జన్మించెను. దరిమిళా నబ్బాలునకు గౌతముడని నామమిడిరి.

ప్రవర్ధమాన చంద్రుని భాతి పంచవర్షప్రాయుడైయుంట, విద్యాభ్యాసము జేయించిరి.

క్షత్రియులే విద్యను యభ్యసించెడువారు. ఆర్యులకు తెలిసి నప్పటికి నశింపజేయ మొదలిడిరి. ఏలన, ప్రజలు విద్యావంతులయిన తమను ధిక్కరించెదరనియు, తమ యాచారవ్యవహారములు, కపట ద్రోహములని ప్రజలకు తెలిసిన ప్రాణాపాయము సంభవించునని తలంచి, లిపిని, విద్యను, విజ్ఞానమును నశింపు జేయుటకు కర్తవ్యులైరి. వీరు విద్యను విజ్ఞానము నభివృద్ధి జేసుకొనుచుండిరి. శిష్యులు పాఠములను కంఠస్థం జేసెడివారు. ఇట్లే వంశపారంపర్యముగా బోధించుచుండిరి. క్షత్రియులు విద్య నభివృద్ధి జేయకున్నప్పటికి, వారు మాత్రము విద్యావంతులుగా నుండిరి. అందు వలన గౌతముడు యౌవ్వనము వచ్చునటకూ విద్యాభ్యాసము జేసెను. రాజోచిత వీర కృత్యముల నభ్యసించెను.

ఇవ్విధమున గౌతమునకు యుక్తవయస్సురాగా, యశోధర యను రాజ పుత్రికను వివాహము జేసిరి. ఇతడును క్షత్రియులందరి వలనే రాజ్య భోగము లనుభవించుచు రాజ్య పాలన జేయుచుండెను. ఇతడు యే విషయమందైననూ పట్టినపట్టు విడచువాడు కాడు. ధైర్యశాలి దయాళువు. న్యాయ రక్షణకై తన ప్రాణముల యొసంగు "షహీద్".

ఈ గౌతమునకు అకస్మాత్తుగ వైరాగ్యము జనించుటకు, ప్రాచ్య పాశ్చాత్య చరిత్రకారు లిట్లు కారణము చెప్పిరి.

"గౌతముడు పట్టణము జూడబోవ, ఒకరోగి, ముదుసలి, శవము కంటబడినవి. మానవులకు రోగము కలదా? వార్ధక్యము కలదా? మరణము కలదా? యని వైరాగ్యము జెందెను. అచ్చట నుండి సన్యాసియై తనకు కలిగిన యనుభవమును ప్రచారము జేసి మరణించెను"

ఈ విధముగ వ్రాయువారు, విశ్వసించువారు యెంతటి బుద్ధిహీనులో?

గౌతముడు విద్యా వంతుడు. అందు యౌవ్వన కాలము. పైగా రాజ్యమును పరిపాలించుచున్న సమర్థుడైనరాజు. అట్టిక్షణమున

వ్యాధి యననేమో? వార్ధక్య మననేమో? శవమున నేమో? తెలియదని చెప్పుట కన్నను హాస్యాస్పద మింకొకటికలదా?

ఇంతకు పూర్వము నాస్తికులు ఆర్యమతము (ఆస్తికమతము)ను నశింప జేయుటకై, రాజాశ్రయ నిమిత్తమై పీడించుచుండిరని తెలిసి కొని యున్నాము. తద్విధముగనే గౌతమునకును యార్య కుతంత్రమును యి విధమున బోధించిరి.

"గౌతమా, మనము ద్రావిడ సంతతివారము. అత్యున్నతమైన నాగరికతతో మహోన్నతదశ యనుభవించు చుంటిమి. ఇంతలో యార్యులెచ్చట నుండియో మన దేశము జొచ్చి, నిర్దయులై మనల దక్షిణదేశమునకు పారద్రోలిరి. ద్రావిడులందు యంతః కలహము లుండుటచే సులభమున ద్రావిడుల వశీకరణజేసి కొనిరి. అంత వారి యధికారమే సుస్థిరమై సర్వదా యుండుటకై ప్రజలను యజ్ఞానరొంపి యందు పడద్రోసిరి తద్వారా అసత్య పూరిత గాధల విశ్వ జింపజేసి ధన సంగ్రహణ జేయుచుండిరి. అందునిమిత్తమై ప్రజలను విజ్ఞాన రహితుల, చైతన్య విహీనుల, పశువులుగా యొనర్చుటయే వారి లక్ష్యమై యొప్పెడిని.

ఆర్యులు నిర్దయులై, పాషాణహృదయులై వేనవేల జంతువుల పశువుల యజ్ఞము లనుపేర వధించి, మాంస భక్షకులైరి. సర్వదా మద్యమును గ్రోలుచుండిరి. నీతి నియమములు లేక వ్యభిచరించుచుండిరి. ఇట్టి యవనీతి పరులు, అసత్యవాదులు, హింసాపరులు, సంఘద్రోహులు, ప్రజలచే దేవతలుగా పూజింప బడుచుండిరి

గౌతమా! నీవు న్యాయ, ధర్మ. సత్య నిరతుడవేని, అన్యాయ అధర్మ, అసత్యముల పారద్రోలుము.

అంత గౌతముడు ఆవేశ పూరితుడై "న్యాయ, ధర్మ, సత్యములకై నా జీవితమంతయు త్యాగమొనరించెద. ఆర్యు లన్యాయ, యధర్మ, యసత్య వాదులేని తక్షణమే వారి నెదుర్కొనుటకు సంసిద్ధుడనై యుంటిని.

కాని మీరు ఆర్యులకు విరోధులై యట్లుచెప్పుచుంటిరో? సత్యముగనే వచించుచుండిరో, నేను సత్యమును వీక్షింపకనే యేకార్యమును జేయ సాహసించను. కాన ఆర్యుల సిద్ధాంతము లెంత వరకు సత్యములో వారి ద్రోహబుద్ధి యెటువంటిదో గ్రహించెద. ఇందున్నిమిత్తమై నేనీయర్ధరాత్రముననే మారు వేషమున చని, ఆర్యుల పరిశీలించెద."

"గౌతమా! మహదానందము. నేటికిగదా ధన్యులమైతి"మని నాస్తికులు ఆనంద బాష్పముల రాల్చి, పునః యిట్లు పల్కిరి.

"గౌతమా! అజ్ఞాన ప్రజానీకమునకు విజ్ఞానభిక్ష పెట్టవలసినదిగా, ప్రజల తరఫున ప్రార్థించుచున్నాము. ఇందుకు నీవొక్కడవే సమర్ధుడవు. లే! లెమ్ము!! ఈ అర్ధరాత్రముననే లెమ్ము!!! జగత్తుకు జ్ఞానజ్యోతిని ప్రసాదింపుము. జగత్తుండు నంతవరకూ నీ కీర్తి ప్రకాశించుగాత. శుభము! అవిఘ్నమస్తు!! విజయ ప్రాప్తిరస్తు"!!!

ఇట్లు గౌతముడు నాస్తికుల యాశీర్వాదములః బొంది, ఆ యర్ధరాత్రముననే పయనమై, మారు వేషమున ఆర్యుల శుశ్రూష జేయుచుండెను. ఇతని శుశ్రూష, వినయ, భక్తి సంపన్నతలకు యార్యులు సంతోషించి ముక్తి మార్గమును వుపదేశించిరి.

అంత గౌతముడు యిది యెంతవరకు సత్యమో? పరిశోధించవలయునని, సత్యకాంక్షాపరుడై ఆహార పానీయాదుల విసర్జించి కొంతకాలము ఘోరతపస్సుజేసె. అంత దేహము శుష్కించి, శల్యావశిష్టమై, స్మృతిహీనుడై పడియుండె. అంత నాదారినిపోవు గొల్లపిల్ల తనవద్దనున్న మేకపాలను త్రావించి, వుపచారములు చేయుచుండ, కొంత దడవునకు శక్తిగలిగి, గొల్లపిల్లకు కృతజ్ఞత తెలిపి; ఇప్పుడు కర్తవ్య మేమని వృక్షముక్రింద నాసీనుడై యాలోజింపదొడగె. నాస్తికులు వచించినది "సత్యమే" యని అప్పుడు తనకు ప్రత్యక్షముగా అనుభవమునైనది.

అంత, తక్షణమే స్వగృహమునకు మరలి వెళ్ళి, నాస్తికుల రప్పించి, కర్తవ్య మూహింపుడనియె ఆహా! నేడుగదా నాస్తికుల శ్రమ ఫలించినది. అంత గౌతమునకు "బుద్ధుడని" నామమిడిరి. తాము ను బౌద్ధులై, మతప్రచారార్థమై, ప్రచారిక దుస్తులధరించి, బౌద్ధమత ప్రచారమును గ్రామగ్రామముల సలుపుచుండిరి.

## బుద్ధ సందేశము .

"ఆర్యులు మాంసభక్షణార్థమై యజ్ఞముల సృష్టించి, అందు జంతువుల వధించిన పాపములేకపోగా పుణ్యము లభించు ననుచుండిరి. అట్లు వధింపబడిన జంతువులకు స్వర్గము లభించునట! ఐన ఆర్యులు వారి తల్లిదండ్రుల, బంధువుల వధించి యేల స్వర్గమున కంపరు?

ఒక జీవిని హింసించిన పాపము లభించునుగాని, పుణ్యము లభించునా? తన కపకారము జేసిన హింసించుట ధర్మము. తమ కుపకారము జేయు వానిని వధించుట యెంత యధర్మమో? అన్యాయమో? హింసాతి హింసయో యోజింపుడు.

క్రూరమృగములు మాంసమును భక్షించుట ప్రకృతిధర్మము. ఏలన వానికి ఆహారము సంపాదించుకొను దేహప్రకృతి భిన్నమై నందున, కోరలు గలిగి మాంసభక్షణచే జీవించుట వానికిధర్మము. మానవునకు తద్భిన్నమున, విచక్షణాజ్ఞానము కలిగి, ప్రకృతిజ్ఞానసము పార్జనచే, ఆహారము సంపాదించుకొనుట కనువైన దేహప్రకృతి కలిగి యున్నందున, క్రూరమృగములవలె మాంసభక్షణ జేయుట యెంత విరుద్ధమో? హింసయో? యోజింపుడు. ఐన క్రూరమృగము లకు మానవులకు భేదము నశించినదిగదా? వీరి మానవప్రకృతిని ఖూనీ జేసుకొని క్రూరమృగదశ యనుభవించు చుండిరన్నమాట!

ప్రకృతిజన్య పదార్థములకంటెను మాంసము రుచిగా నున్నందున వీరు జంతువుల వధించి మాంసభక్షణ జేయుచున్న పక్షమున; జంతువులను ఖూనీ చేయుటకాదు. తననుతాను ఖూనీ జేసుకొనుటయే.

ఏలన, వీరిసిద్ధాంతరీత్యా, అన్నిపదార్థముల కంటెను మాంసము రుచి గానున్నందున భక్షించు చుంటిమనిరి. ఐన రెండ్లుయుగములు గడ చినను, మాంసమునకు మించినరుచిని వీరుపొందలేరు. పొందబోరు. ఈ విధముగా వారినివారే ఖూనీ జేసుకుంటున్నారు. ప్రకృతిజన్య పదార్థ ముల పరిశీలించి, తనవిజ్ఞాన ప్రభావముచే మాంసము కన్నను వేయిం తలు రుచిగల పదార్థముల యనుభవించుట శ్రేయస్కరము. కాన మాంస భక్షణ మానవులెవరూ జేయ రాదు.

నీచజంతువుల శుక్లశోణితముల భక్షించు మానవున కన్నను అధమాధము డెవడైనా కలడా?

ఒక జీవిని అన్యాయమున మరొక జీవి యపకారము చేయదలచిన, తక్షణమే యట్టి జీవిని సంహరించుట అహింస యనబరగు.

తన కపకారము జేయని, వుపకారము జేయుని వానిని వధించుట హింస యనబరగు.

తన కుపకారము జేయు వానిని, స్వార్థపరులై సజీవుల, విగత జీవుల యొనర్చు టెంతఘోరాతి ఘోర హింసయో యోజింపుడు. హింసల యందిట్టి ఘోరహింస వేరొండు కలదా?

ఆర్య పీడిత దాస్య అజ్ఞాన ప్రజల్లారా! ఆర్యులు మానవాతీతులుగారు. దేవతలుగారు. జంతువుల వెండబట్టి నిర్దయులై వధించు కిరాతకులు. యజ్ఞములను పేర మాంసభక్షణజేయు క్రూరమృగములు. అట్టి క్రూరమృగముల వధించి, మన కుపకారము జేయు జంతువుల రక్షించుడి.

మద్య పానము అమృత పానమట! ఓహో! హో!! అవును!!! మాంస భక్షణజేయు క్రూరమృగములకు మద్యము యమృతముగా గన్పట్టుట యాశ్చర్యమేమి?

నరక స్వర్గములు లేవు. నరకమను పేర మిమ్మందల భయపెట్టి, వారిని రక్షించుకొనుటకును, స్వర్గమను పేర సౌఖ్యము లభించునని,

మీ వద్ద ధన సంగ్రహణ జేయుటకు పన్నిన పన్నాగము. కాన అట్టి వాని యందు విశ్వాసముంచకుడి.

ఆర్యులు కొన్ని మహత్తుల జూపినందున మానవాతీతులని, దేవతలని భావించుచుండిరి. ప్రాణాయామ యోగాభ్యాసమున నీళ్లపై నడవవచ్చు, గాలిలో యెగురవచ్చు. అంత మాత్రమున మీరు వారి యందు గౌరవముంచనక్కరలేదు. మిమ్ముల వశీకరణ మొనరించుటకే యట్టి యోగము లభ్యశించి ప్రదర్శించు చుండిరి. కాన ఇటువంటి వారిని గర్హించుటుత్తమము.

మోక్షమనునది దేవతలకును సాధ్యము కాన మహోన్నత పదవిగా భావించుటం జేసి, మీకసలు మోక్షమననేమో తెలియక పోవుటచే మోక్షమున కంత యాధిక్యత నిచ్చుచున్నట్లున్నది.

మోక్ష మనగా, మానవుడు ప్రకృతిని వశీకరణ మొనరించుకొని, తన కనుకూల పరిస్థితులుగా మార్చి సుఖించుట కష్టము, అశేద్యముగా యార్యులు భావించి ప్రకృతి జ్ఞానమునకు దూరముగా పోయి, ప్రకృతిని మిధ్య స్వప్న సమానమని దూషించి, ప్రకృతిః వాంఛించు కోర్కెల నశింపజేయుటె నిత్యానంద ప్రదమైె మోక్షము. అనగా మనస్సును నశింపజేసిన ప్రకృతి కష్టములు దూరమగునని భావించిరి.

ప్రకృతి జ్ఞానము నుండి దూరముగా పోవుటయే విజ్ఞానము నిత్యానంద మని భావించిరి. వీరుజెప్పెడి మోక్షమందు నిత్యానంమెట్టి దనగా నేతిబీరకాయ లాంటిది. సుషుప్తి (నిద్ర) కాలమం మనస్సునశించును. అట్టి సమయమున యేమియు తెలియదు. సుఖదుఖము లుండవు. మాధ్యమిక యవస్థ. అట్టియవస్థయే సర్వదావుం నట్లు మనస్సును బలవంతమున నశింపజేసికొనెదరు. అట్టి మాధ్యమి యవస్థయందు సుఖదుఃఖములులేక వుండెదరు. అదేసుషుప్తి మోక్షము, మరణము. అదేనిత్య ప్రపూర్ణిత యఖండానందము.

మానవుడు ప్రకృతిజ్ఞానమునకు దూరమవుట అజ్ఞానమునకు తిన్నని మార్గము. అట్టి సమయమున పశువులకు మానవులకు గల భేదము నశించునని ప్రత్యేకించి చెప్పనవసరము లేదు.

పక్షిజాతి ఫలములను ముక్కుతో పొడచి భక్షింప వలసినదే గానివేరు మార్గములేదు. ఎన్నియుగములు గడచినను మార్పు జేసి కొనుశక్తి లేదు. పశువులకును ప్రకృతి వశీకరణ జ్ఞానము లేనందున "ప్రపంచము మిథ్య యనుకొని దొరికిన యాహారము స్వీకరించుచూ నిర్విచారమున జీవితము గడపును. కాని మానవునకు తద్భిన్నమున ప్రకృతిని యర్థము జేసుకొని తన జ్ఞానాధిక్యతచే తనకష్టముల దూరము జేసుకొని సుఖింపగల శక్తియున్నది. అచ్చటనే పశుత్వము నుంచి మానవత్వము వేరుజేయుబడుతుంది. కాన ప్రకృతిజ్ఞానసము పార్జనచే తనకష్టముల దూరము జేసుకొనుట మానవుని ప్రథమ కర్తవ్యము. తద్వ్యతిరిక్తమున తనకున్న జ్ఞానశక్తినశింపజేసి, కన్నులు మూసికొని కూర్చుంటుట పశువుల కన్నను హీనప్రవృత్తి కల్గి యుండుటయే ముక్తిఫలము.

వ్యక్తి సంఘజీవి. సంఘమునువిడచి వ్యక్తిలేదు. వ్యక్తులవిడచి సంఘము లేదు.

తాను సంఘశ్రేయస్సుకోరిన సంఘము తనశ్రేయస్సుకోరును. సంఘశ్రేయస్సునకు భంగము కలిగించి తన స్వార్థ మీడేర్చుకొనుట ఘోర యన్యాయము. అట్లు యొనర్చినవాడు సంఘద్రోహిగా పరిగ ణింపబడి శిక్షితుడు గావలయును ప్రతివ్యక్తి సంఘసేవకై భౌతిక పరి శోధన జరిపి సంఘకష్టముల దూరమొనరించి తద్వారా తాను సుఖ మున నుండుటయే సంఘజీవి కర్తవ్యము. సంఘన్యాయముల ననుస రించి భౌతిక సుఖముల ననుభవించుటే జీవితలక్ష్యము.

ప్రతివ్యక్తి సంఘనియమముల ననుసరించి వాటి నతిక్రమింప కుండుటవలన వ్యక్తికి గౌరవ మర్యాదలు లభించును. ఆర్యు డైనంత మాత్రమున నీతినియమములు లేకున్నను గౌరవించుట

మనకర్మము. నీచాని నీచునిగా చూచుట ధర్మము. అట్టి ఆర్యేతరులైనంత మాత్రమున నీచముగా చూచుట యెంత నీచము? మానవులుగా జన్మించి మానవులచే ఏవగింపబడుట దోషమా? ఇది యెంతటి విరుద్ధాతీతమైన విషయము. నీచాతి నీచమున చూచుచున్న ఆర్యుల (బ్రాహ్మణులు) నీచాతి నీచమున చూచుట ధర్మము! సత్యము!! న్యాయము!!!

ప్రస్తుతము మీరు ఆర్యులచే సర్వవిధముల నధఃపాతాళమునకు త్రొక్కబడి యుంటిరి. కాన ఆర్యుల ధిక్కరించి ఆర్య సిద్ధాంతముల తొలగద్రోసి సత్యమార్గమును ప్రవేశింపుడు. సంఘోన్నతికింతకంటెను వేరొండు మార్గములేదు!"

ఇవ్విధమున బుద్ధుడు గ్రామగ్రామమున ఆర్యుల ధిక్కరించుచు ఆర్య స్మృతి రీక ప్రచారము చేయుచు, ప్రజానీకమును ఆకర్షించుచూ, అనేక శిష్యులను తన దరి కాకర్షించి బౌద్ధమత ప్రచారము జేయుచుండెను.

ఆర్యులకు గౌరవము నశింపగా అసలీ దేశమున నుండుటకు ప్రాప్తి కలదో! లేదో! యను భీతి జనించినది. అందువలన బుద్ధుని ఈ ప్రపంచమున లేకుండా జేయుటయే తమకు కర్తవ్యమని కుట్రలు పన్నుచుండిరి.

బుద్ధుని దాయాదియైన దేవదత్తుని ఆర్యులు లోబరచుకొనిరి. అంత దేవదత్తుని పంపున ఇద్దరు కిరాతకులు బుద్ధుని హత్య చేయుటకై వెళ్ళిరి. అంత బుద్ధభగవానుని దర్శించిన మాత్రముననే, యా కిరాతకులు తమ తప్పిదమును బుద్ధునకు నివేదించిరి. అంతట బుద్ధుడు వారికి హితోపదేశముచేసి తన శిష్యులగా పరిగ్రహించెను.

ఈ విషయము దేవదత్తుడెరిగి తన తప్పిదమునకు శిక్ష లేదని పశ్చాత్తాప మొందుచూ పిచ్చివాడయ్యె. అంత బుద్ధుడు సరియైన మార్గమునకు తెచ్చి తన శిష్యునిగా పరిగ్రహించెను

ఈ విషయ మూర్యులెరిగి హత్యాప్రయత్నము విరమించు కొనిరి. ఎటులైనను ప్రజలకు బుద్ధునియందు గౌరవము లేకుండా జేయవలయునని కుట్రలు పన్నుచుండిరి.

ఒక సుందరిని బౌద్ధమత యోగినిగా యొనర్చి బుద్ధునియొద్దకు పంపిరి. ఆ సుందరి రాత్రింబవళ్ళచ్చటనే యుండెడిది.

అనంతరము ఆరు మాసములకు శిష్యప్రజానీకము గూడిన సభయందు బుద్ధుడు ప్రసంగించుచుండ ఆ సుందరి ప్రవేశించి "బుద్ధా! నన్నిట్లు పరిత్యజించుట పాడియా? నా కష్టముల విచారింప వైతివి. ఇదియేనా పురుషప్రేమ? మంచము లేదు. ఇల్లు లేదు స్త్రీవి సమయమున నలదన్నలేకెక్కడికి వెళ్లుదాన? అబలను రక్షింపుము"నియె. అంత బుద్ధుడు "నావలన నీకేమి యపచారము గలిగినదితల్లీ"యనియె. అంత సుందరి "అమ్మో! అపచారము!! అన్యాయము!!! తల్లీ"యని సంబోధించు చుంటివా? బుద్ధిహీనుడా! ఇన్ని దినంబులు నీ యిచ్చ వచ్చిన తెరంగున భోగించి, నేను "తల్లీ"యని సంబోధించుచుంటివా? నేను యారు మాసములనుండియు నీవద్దనే యుండలేదా? తత్ఫలిత మిదిగో! గర్భిణి" అని విలవిల యేడ్వదొడంగె. ప్రజలందరు విస్మయు లైరి. ఔరా! బుద్ధుడెంతటి "ద్రోహి" యని ప్రజలు మదిలో తల పోయు చుండిరి. ఇంతలో బుద్ధుని ప్రియశిష్యుడొకడు బయటకు గెంటుటకు బలాత్కరింప రహస్యము వెల్లడియైనది. సహజ గర్భము కాదనియు, కృత్రిమ గర్భమని ప్రేక్షకులందరు వీక్షించి, విచిత్రసంఘ టనకు విస్మయులైరి. అంత కొందరు సుందరిని చావమోద ప్రయ త్నింప బుద్ధు డడ్డగించి సుందరిని సురక్షితముగ సాగనంపె.

ఈ విషయ మూర్యులెరిగి యేమిచేయుటకు పాలుబోక, యా సుందరిని హత్యజేయించి, బుద్ధుని నివాసమున కనతిదూరమున నొక పొదయందు దాచిరి. మరుసటి యుదయమున సుందరి కనుపించుట లేదని గగ్గోలుపెట్టిరి. అంత సుందరి శవమును తెచ్చి పంచాయతీ జేసిరి. బుద్ధుని కపకారము చేయదలచినదను క్రోధముతో బుద్ధుడే సుందరిని

హత్య జేసెనని తీర్మానించిరార్యులు. బుద్ధుని విచారణ చేయవలసిన దిగా రాజులతో విన్నవించిరి. రాజులును బుద్ధుడే హత్య జేసియుండ వలయునని విశ్వశించిరి. ఏలన, తన కపకారము చేయ ప్రయత్నించిన స్త్రీని ప్రత్యపకారము జేయ ప్రయత్నించెనన్న విశ్వసింపని వారెవరు?

ఆమరుసటిరోజు బుద్ధుని పిలిపించి విచారణచేయుటకు అందరు నిర్ణయించుకొనిరి.

ఆ విధముగానే మరుసటిరోజు బుద్ధుని పిలిపించిరి.

అట్టి క్షణముననే సుందరిని హత్యచేసిన కిరాతకులు విశేష ధనమును పొందినందున అమిత మద్యమును ద్రావి ఒడలెరుంగక "ఒరేయి! ఆ సుందరిని హత్యచేశావుగాని!! ఇటువంటి సమయంలో మనకెంత ఉపకరించెడిదిరా!!!" "ఉపకరించెడిదా? ఉపకరించెడిదా? నీచేతులారా నీ పొట్టను బెట్టుకున్నావు." ఇవ్విధమున యీ కిరాత కులు నీవే హత్యచేసావంటే నీవే హత్యచేసావని నడివీధులలో ప్రేలు చుండిరి. అంతట రాజభటులు బంధించి రాజునొద్దకు గొంపోయిరి. అట్టి సమయమున రాజాధిరాజులు, ఆర్యులు, బుద్ధుడు, బుద్ధ పరివారము యావన్మంది సభతీర్చియుండిరి. అట్టిసభకు కిరాతకులు రావింప బడిరి. "యెవరిని హత్యచేసితిరో నిక్కముగ వచింపు"డనిన ఆ కిరాత కులు తామే ఆ సుందరిని హత్యజేసినట్లు అంగీకరించిరి. ఆర్యులు చేయమన్నట్లు సత్యము వచించిరి. అంత కిరాతకులు క్షమింపబడిరి.

అంత రాజులందరు ఆర్య కుతంత్రమును తెలిసికొనిరి. బుద్ధుని నిర్దోషిత్వమునకు సంతోషించి బుద్ధుని శిష్యులై, బౌద్ధమతావలంబకులై, బౌద్ధమత ప్రచారకులైరి.

ఆర్యుల కుతంత్రము బుద్ధుని ఆధిక్యతకే వినియోగ పడు చుండె. తద్వారా బుద్ధుని మహత్ అధికమై విశేష ప్రజానీకము బౌద్ధమతమును స్వీకరించుచుండిరి. ఆర్యుల ధిక్కరించుచుండిరి.

ఇట్టి కుతంత్రములచే ఆర్యులకున్న స్వల్పగౌరవమును పోగొట్టు కొనిరి. ఆర్యులంటే యేహ్యమున, అగౌరవమున, నీచాతి నీచమున ప్రజలు చూచుచుండిరి.

అన్యాయము, అధర్మము, అసత్యము, కుతంత్రము యెప్పటికైనా నశించునవియే. వానితోపాటు వాని నాశ్రయించిన వారును నశించును. ఇది ప్రకృతి ధర్మము. ఇందుకు ఆర్యులు దృష్టాంతము.

ప్రపంచమున ప్రప్రథమ విప్లవకర్త బుద్ధమహానుభావుడు. ప్రజల మూఢవిశ్వాసముల పారద్రోలి, విప్లవశక్తికలుగజేసి, హిందూ దేశమునకేగాక యావత్ప్రపంచకమునకును విజ్ఞానభిక్షపెట్టిన బుద్ధ భగవానునకు మనమందరము ఋణపడి యున్నాము. ఆ ఋణము తీర్చుకొనవలయునన్న ఆర్య (బ్రాహ్మణ) సిద్ధాంతముల విశ్వశింప కుండుట, బ్రాహ్మణుల గౌరవింపకుండుట సంఘద్రోహులను నీచాతి నీచముగ జూచుట మన కర్తవ్యము.

ఈ బౌద్ధ సంస్కృతియే హిందూ సంస్కృతిగా, భారతసంస్కృతిగా, బ్రాహ్మణ సంస్కృతిగా భావించబడుచున్నది.

చైనాయందు బుద్ధుని సమకాలీనులైన లోచే, కన్ఫ్యూసియస్ అను నిద్దరు ప్రవక్తలు కలరు. వీరునూ మూఢాచారముల నశింపజేసి సంఘసేవచేయుట, నీతివంతముగా జీవించుట ముఖ్యమనిరి.

బుద్ధ, లోచే, కన్ఫ్యూసియస్ యొక్క యుపదేశములను చీనా దేశస్థులు "వుపదేశత్రయ" మందురు.

ప్రజాశ్రేయస్సు వాంఛించువాడై రాజభోగముల విసర్జించి, తన జీవితమంతయు ప్రజాసేవకై త్యాగమొనర్చిన త్యాగమూర్తి బుద్ధభగవానుడు. ఆర్యద్రోహ చింతననుండి ప్రజానీకమును రక్షించి విజ్ఞానభిక్షపెట్టిన జ్ఞానమూర్తి బుద్ధమహానుభావుడు.

ఇవ్విధమున యేబది వత్సరములు నిరాటంకముగ ప్రచారము సలిపి తన యెనుబదివ (80)వత్సరమున గోరక్‌పూరు జిల్లాయందుగల కుశినగరమందు క్రీ. పూ. 477 వత్సరమున నిర్యాణము జెందెను.

ఆ సంవత్సరముననే బౌద్ధాచార్యులందరు సమావేశమై బుద్ధుని యుపదేశములను త్రిపిటకములుగా సంగ్రహించిరి. బుద్ధుడు శిష్యులకు జేసిన యుపదేశములకు సూత్రపిటకమని పేరు. సంఘసంబంధ నిబంధనలకు వినయపిటకమని పేరు. మతసిద్ధాంతములకు అభిదమ్మ పిటకమని పేరు.

దరిమిలా వైశాలి. నగరమందు రెండవ పరిషత్తు జరిగినది. అందు భేదములుకల్గి నాలుగు శాఖలుగా విడిపోయారు, (1) శూన్యవాదశాఖ, (2) యదార్ధవాదశాఖ, (3)విజ్ఞానవాదశాఖ, (4) నిర్వాణవాదశాఖ.

ఆత్మ దేహసంబంధమైన దగుటచే ప్రకృతికిలోబడి ఆత్మ వుంటుంది. జడపదార్ధములవలన ఆత్మయేర్పడుటచే ఆత్మ అస్వతంత్రం. కాన ఆత్మకు చైతన్యమే లేదు. దీనిరీత్యా పరమాత్మ (దేవుడు) లేడనే విశ్వాసము కలిగింది. బుద్ధునకు జీవితసమస్యా పరిష్కారానికి, ఆత్మ, పరమాత్మ (దేవుడు) అవసరముగా గన్పట్టినది.

శూన్యవాద ప్రకారం ప్రతిదీ నాశనం జెందుతుంది. కాన "శూన్యం" ప్రతిదానికీ కారణమన్నారు.

"మార్పులేని వస్తువు ప్రకృతికి కారణభూతం కాజాలదు. మార్పువుంటే నాశనం జెందక తప్పదు. కాన ప్రకృతిశూన్యంనుంచే బయలుదేరింది". ఈశూన్యవాదరీత్యా ఆస్తికులు చెప్పుకొనెడి అస్థిత్వ పరమాత్మకు స్థానంలేదు. ఈ శూన్యవాదము వేదాంతమత ప్రధాన సిద్ధాంతాన్నే త్రోసివేసింది.

యదార్ధవాదులు ప్రకృతి పరిణామమునకు ఆదివస్తువు వుండాలని వాదిస్తారు. దీనిప్రకారం నిరాకారిమైన పరబ్రహ్మ కారణభూతం కాజాలదు.

"కార్యం ఫలించటానికి కారణంముందు నాశనంకావాలి." వృక్షమునకు కారణ భూతమైన విత్తనం, విత్తనముగా నుండక పరిణామముజెంది మొలకరూపంలో నాశనం జెందుతుంది. తద్వారుగానే ప్రకృతి కారణ కారక శక్తిగలిగినట్లు చెప్పబడినది. కాన యథార్థ వాదులు చెప్పే కారణ వస్తువుకు శూన్యవాదులు చెప్పే 'శూన్య' సిద్ధాంతానికి భేదములేదు.

"ఆద్యంతములు లేని ప్రకృతి పరిణామంలో వస్తువు యొక్క అస్తిత్వం తాత్కాలికం" అని విజ్ఞాన వాదశాఖ.

ఈవాదం వేదాంతంలోని ప్రధానసిద్ధాంతాన్ని త్రోసివేశింది. నాల్గవది నిర్వాణ వాదశాఖ:- ఆర్యులు బోధిస్తున్న పరమాత్మను త్రోసి వేయుటకు బౌద్ధవాదులు అనిత్యవాదాన్ని (యేవస్తువు స్థిరంగా వుండదు) ప్రచారము సల్పారు. దీనితో పరమాత్మకు అస్థిరం సంభవించింది.

ఈవాదం భౌతికముగానే గాక మానసికముగాను వుపయోగించారు. సంఘమందు విశేషకష్టము లుండుటచే బాధలన్నీ తాత్కాలికములే యని బోధించిరి. ఇచ్చట బుద్ధుని భౌతికవాదము భావవాదముగా పరివర్తన జెందినది. అనిత్యం అనుకున్నది నిత్యము కాజాలదు. దుఃఖం, విచారము కేవలము మానసికగుణాలు. కాన వానికి భావరూపంలోతప్ప ప్రత్యేక అస్థిత్వంలేదు.

ఇది యానాటి సాంఘిక పరిస్థితుల శాంతింప జేయుటకై జెప్పిన సిద్ధాంతము. ఇది ప్రధాన సిద్ధాంతములతో సంబంధించదు.

భౌతిక వాదమునుండియే పైనాలుగు శాఖలుద్భవించి, తిరిగి భౌతికవాదమునందే లీనమయినవి.

జైన తత్వశాస్త్రజ్ఞులు, "ఒకేవస్తువు పరస్పరవిరుద్ధ గుణాలు కలిగి యుండునని చెప్పారు. ఈవాదము ప్రకారము యేదీ స్థిరముగా నుండుటకు వీల్లేదు. కానపరమాత్మ అస్థిత్వం యీవాదాని గురికావలసివచ్చింది.

8)





వీరు ఆత్మ వుందని విశ్వసించారు. కాని యెప్పుడు మారుతూ వుంటుందన్నారు. ఒక వస్తువు యెప్పుడు శాశ్వతముగా అశాశ్వతముగా వుంటుంది. ఎప్పుడూ నీరు ప్రవహిస్తూన్నా, ప్రవాహం మాత్రం అక్కడే వుంటుంది. అదేవిధంగా ప్రపంచములో జరిగే పరివర్తన అశాశ్వతముగా గన్పట్టి నప్పటికి ప్రపంచం మాత్రంశాశ్వతం.

ఈ జైనమత కర్త మహావీరుడు. ఇతడును బుద్ధుని సమకాలీనుడే.

ఈ జైనమతము బౌద్ధమతమువలె ఆర్య (బ్రాహ్మణ) మతమును సంపూర్ణముగా ధిక్కరించినది. ఆర్య సిద్ధాంతములు సంఘ ద్రోహమునకే వినియోగి పడుచున్నవి గాన, ఆర్య సిద్ధాంతముల సంపూర్ణముగా నశింపజేయవలె ననిరి. వేయేల! ఆర్య మతమును ధిక్కరించుచూ బౌద్ధమతమునకు అండగా నిలిచి యెంతో సహాయ పడినది.

ఇవ్విధమున బౌద్ధ జైనమతములు ఆర్య (ఆస్తిక) మతమును నశింపుజేయుచూ, సత్యము బోధించుచుండిరి.

## అలెగ్జాండరు దండయాత్ర

అలెగ్జాండరను ఘనతవహించిన గ్రీసు దేశపు రాజు క్రీ. పూ. 327లో హిందూ దేశముపై దండెత్తెను. ప్రపంచమంతయు జయించవలెనను తృష్ణచే హిందూ దేశమును ప్రవేశించెను.

ఈ సమయమున రాజులు ఐకమత్య విహీనులై యుండిరి. జీలం, చీనాబ్ నదుల నడుమ, పౌరవుడగు పురుషోత్తము డనురాజు పాలించుచుండె.

ఇతడు అతి బలశాలి. విశేష స్వదేశాభిమాని, యైనందున యలగ్జాండరును యెదుర్కొనెను

పురుషోత్తముడు, తన సైన్యము, యెంతటి బల, శౌర్య, పరాక్రమముల ప్రదర్శించి నప్పటికి. అలెగ్జాండరును జయించ లేక సైన్యము భీతావహము జెందె.

విశేషవర్షము కురిసినందున నితని యేనుగులు బురదలో దిగబడి భీతిజెంది, వీరి సైన్యమునే నాశనముజేసె. ఇవ్విధమున పురుషోత్తముడు పరాజితుడు కావలసివచ్చినది.

అంత గ్రీకు సైనికులు పురుషోత్తముని బంధించి అలెగ్జాండరు సముఖమున నిలువ బెట్టిరి. అంత అలెగ్జాండరు "నిన్నిప్పుడేమి చేయవలయునో" చెప్పుమనియె. అంతపురుషోత్తముడు "రాజు వద్దకు మరొకరాజు విచ్చేసిన యేమిచేయునో అట్టి గౌరవ మర్యాదలనే యొనరింపుము." ఈ మాటలకు అలెగ్జాండరు చకితుడై, మరియు అతని ధైర్య, శౌర్య, బల, సాహసముల చవిచూచుటచే నట్లే గౌరవించి అతని రాజ్యము అతని కిచ్చివేశెను.

అలెగ్జాండరు హిందూదేశము నంతను జయింపవలెనని, సైనికులకు తెలుప, వారునసేమీ యంగీకరించలేదు. స్వస్థానమిడచి చాలాకాలమైనందున, తక్షణమే మరలివెళ్లవలెననిరి.

అంత అలెగ్జాండరు చేయునదిలేక, జయించిన ప్రదేశములందు ప్రతినిధుల నేర్పరచి స్వదేశమునకు మరలి పోవలసివచ్చె.

ఇట్లు వెళ్లునపుడు అత్యాశ్చర్యకరమైన దృశ్యముల కొన్నిటిని చూచె. ఇంతకు పూర్వము ప్రపంచమందెక్కడను నిట్టివింతమనుష్యుల చూడక పోవుటచే, వీరినిజూచి యలెగ్జాండరునకు అమితాశ్చర్యము కలిగినది,

ఒకమారు యిరువురు యోగులు అలెగ్జాండరు బల్లయొద్దకు వచ్చి భుజించిరి. వారిలో పెద్దవాడు భూమిపైపరుండి, సూర్యరశ్మిని, వర్షమును సహించెననియు. రెండవవాడు కించిత్ కర్రయాధారముతో, దినమంతయు, యొంటికాలిపై నిలబడెనట.

"ఈ యోగులు దిగంబరులుగా నుండెదరనియు, చలి యెండ బాధలుండవనియు, యెండుగడ్డి పడకలమీద పరుండెద రనియు, నిరాడంబర జీవనము చేయువారనియు, గ్రీసు దేశస్థుడైన మెగస్థనీసు (కీ. పూ. 302) తెలుపుచున్నాడు.

యవనలేఖకుల వ్రాతలను బట్టి, రెండు విధములైన యోగు లుండెడివారనియు, ఒకరకమువారు దేశద్రిమ్మరులై, ప్రజలందు మహత్తుల ప్రదర్శించి గౌరవమును పొందు చుండిరి.

రెండవరకము, స్థిరనివాసులై మౌనముగా యాశ్రమ జీవనము జేయువారనియు, పచ్చిదుంపలు, మాంసము తినియెద రనియు, ధ్యాన, ఉపవాసములతో కాలము గడపెదరనియు చెప్పు చున్నాడు.

వీరికి లిపి తెలిపి నప్పటికి పరిగ్రహించెడు వారు కారనియు, గురుముఖతా వేదమంత్రములు వల్లించెడు వారనియు, జీవాత్మ, పర మాత్మమున్నగు వేదాంత విషయముల చర్చించెడి వారనియు మెగస్థ నీసు తెలుపుచున్నాడు.

ఇవ్విధమున అలెగ్జాండరు అచ్చటి యోగులదర్శించి, పయ నమై 'బాబిలోను' నగరము ప్రవేశింప శీతజ్వరముచే క్రీ. పూ. 323 వత్సరమున దివికేగెను.

## మౌర్యవంశము - చంద్రగుప్తుడు
## క్రీ. పూ. 322 – 297

అట్టిసమయమున మగధదేశమును మహాపద్మనందుడు పాలించు చుండెను.

చంద్రగుప్తనను క్షత్రియ యువకుడు, విశేష ధైర్య సాహస వంతుడగుటచే, తనకేమి ముప్పు సంభవించునోయని పద్మనందుడు తన దేశమునుండి చంద్రగుప్తుని వెడలగొట్టెను, ఇతడిట్లజ్ఞాతవాసము నందున్న సమయముననే అలెగ్జాండరు హిందూదేశముపై దండెత్తి నది. చంద్రగుప్తుడు అలెగ్జాండరును దర్శించెనను కింవదంతి కలదు.

తదనంతరము గ్రీకులు పురుషోత్తముని హత్యజేసి రనువార్త విని, ప్రజలు విశేష క్రోధోన్మత్తులై, గ్రీకులను సర్వనాశనము జేయు

టకు సంసిద్ధులుగా నుండిరి, కాని సమర్థనాయకు డెవరూ లేనందున రోషావేశమున నుండిరి.

ఈ యవకాశమును చంద్రగుప్తుడు వినియోగించు కొనియె. అంత చంద్రగుప్తుడు నాయకుడై తక్షణమే గ్రీకుల జయించెను.

అంత తన సైన్యాభివృద్ధిజేసి, తనను దేశమునుండి వెడల నంపిన పద్మనందునిపై దండయాత్రజేసె. పద్మనందుని జయించి యుభయ రాజ్యముల పాలించుచుండె.

అంతటితో తనివిజెందక, యుత్తర హిందూస్థానము నంతయు జయించి మగధ సామ్రాజ్యమును స్థాపించి, నలుముఖముల విస్తరింప జేయుచుండెను.

"సెల్యూకసను" గ్రీకు సేనాని, అలెగ్జాండరువలె ప్రపంచమంతయు జయించవలెనని పశ్చిమ యాశియాయంతయు జయించెను. అంతతో తృప్తిజెందక హిందూదేశముపై దాడివెడలి చంద్రగుప్తుని యెదుర్కొనెను.

ఇంతకు పూర్వము దేశము చిన్నాభిన్నమై అనేక రాజుల పాలనక్రింద యుండుటచే, కలహములు గలిగి, యైకమత్య విహీనులై యుండిరి. ఇప్పుడట్లుగాక చంద్రగుప్తుడు విశాల మగధసామ్రాజ్యమును నిర్మించినందున, జయించుట దుర్లభమైనది.

అందువలన సెల్యూకసు తన శక్తిసామర్థ్యముల నన్నిటిని ప్రయోగించినను లాభము కన్పట్టదయ్యె. చంద్రగుప్తుని విశేష ధైర్యసాహసముల కచ్చెరువొంది, పోరాటము మాని సంధిజేసికొని, తనకుమార్తెను చంద్రగుప్తునకిచ్చి వివాహముజేసి, తాను జయించిన "ఏరియా, గెడ్రోశియా, షేత్రపి" యనబడు మూడు రాజ్యముల కానుకగానిచ్చి, తన స్వస్థానమునకు మరలి వెళ్లెను.

ఈ మూడు రాజ్యములతో మగధ సామ్రాజ్యము హిమాలయ పర్వతముల కంటుకొనియె. పదునారు వత్సరములలో నింత విశాల సామ్రాజ్యమును స్థాపించి రక్షించి నందున, చంద్రగుప్తునికి

"ప్రపంచ శూరాగ్రేసర చక్రవర్తి" యని పాశ్చాత్య చరిత్రకారులు బిరుదమిచ్చిరి.

చంద్రగుప్తుడు (క్రీ. పూ. 322) వత్సరమున మగధ సింహాసన మధిష్ఠించి, సామ్రాజ్యమును విస్తరింప జేయుచూ పాలించు చుండె. సెల్యూకసు సంధి యనంతరము. మెగస్థనీసు రాయబారి చంద్రగుప్తునివద్దనేయుండి, అప్పటి హిందూదేశ చరిత్రను వర్ణించి నాడు.

చంద్రగుప్తుడు బౌద్ధమతాభిమానియై క్రీ. పూ. 297 వ వత్సరమున దివంగతుడయ్యెను.

## బిందుసారుడు

## (క్రీ. పూ. 297-272)

చంద్రగుప్తుడు కాలధర్మము నొందగా నతని తనయుడు బిందుసారుడు సింహాసన మధిష్టించెను.

ఇతడును తండ్రివలెనే రాజ్యపిపాసియై దక్షిణ హిందూదేశమున కొంతభాగము జయించి "అమిత్రఘాతు" డను బిరుదము వహించెను.

సెల్యూకసు అనంతరము అతని కుమారుడు "ఆంటియోకస్" బిందుసారునితో బంధుత్వభావముంచి రాయబారుల పంపుచుండె. ఈతని కాలములో "డైనీసియస్" యను రాయబారివచ్చి హిందూదేశమును గురించి వొక గ్రంధము వ్రాసెను.

బిందుసారుడు బౌద్ధమతాభిమానియై క్రీ. పూ. 271వ వత్సరమున దివంగతుడయ్యెను.

# అశోకవర్ధనుడు

(క్రీ. పూ. 272 – 231)

బిందుసారుని యనంతరము, అతని కుమారుడు యశోకవర్ధనుడు మగధ సింహాసనమును క్రీ. పూ. 272 న అధిష్ఠించెను.

ఇతడును తండ్రితాతవలె రాజ్యకాంక్షా సక్తుడై క్రీ. పూ. 261 లో కళింగదేశముపై దండయాత్ర జేసెను.

కళింగదేశ మనగా, గోదావరి మహానదుల నడుమనున్న సముద్రతీర ప్రాంతము. కాళింగులును విశేష బలవంతులై యుండిరి.

ఇట్లు వుభయ బలవంతరాజులకు ఘోరసంగ్రామము కలిగినది. తుదకు అశోకుడే జయించెను.

అశోకుడు "రాజ్యము జయించితి" నను సంతోషము నశించి విచారహృదయుడయ్యె.

ఏలన వుభయులు బలవంతులగుటచే ఘోరయుద్ధము సంభవించినది. అందువలన వేనకువేల యుద్ధభటుల కంఠములు తెగినవి. రుధిర ప్రవాహము కాలువలై పారజొచ్చె. అట్టి కరము గొల్పు కళింగ రణభూమిని తిలకించి యశోకుడు విరక్తిజెంది "తన జీవితమున ఖడ్గము ముట్టనని శపథముజేసె. బౌద్ధమతమే శరణ్యమని, బౌద్ధమతమును స్వీకరించి, బౌద్ధమత ప్రచారముకొరకే తన జీవితమంతయు త్యాగ మొనరించిన త్యాగమూర్తి యశోకసామ్రాట్.

"ఇతరరాజుల శస్త్రములతో జయించుట తమ ధర్మమని తలంచుట గర్హనీయాంశము. ధర్మమువలన పొందిన జయమే జయము" అని శాసించెను. మాంస భక్షణ పూర్తిగ మాన్పించెను. వినోదముకై మృగముల వేటాడుట నిషేధించెను. మరియు ప్రజల కష్టముల నివారించుటయే లక్ష్యముగాగల్గి, వారి కష్టముల విచారించి ప్రజాను రంజకముగ పరిపాలించుచుండెను.

అనేక రోడ్లు నిర్మించి, రెండువైపుల మఱ్ఱి వృక్షముల నాటించె. ఫర్లాంగునకొక నూతిని త్రవ్వించి, మైళ్ళరాళ్ల నేర్పరచి ప్రయాణ సౌకర్యములు కలుగజేసె.

అనేక వైద్యాలు తరిఫీదు చేయించి వుచిత వైద్యాలయముల నెలకొల్పి మనుజులకు, పశువులకు వ్యాధిబాధల నివారించె.

ఆనాడు ఖరోష్టిలిపి వ్యవహారికలిపి. అందు యనేక పాఠశాలల నెలకొల్పి ప్రజలను విద్యావంతులుగా జేసి, దీక్షయొసంగి బౌద్ధ మత ప్రచారమునకు పంపుచుండెను.

ప్రజలు నైతికమున నెట్లు నడచుకొనవలసినది. యే యాచారముల యవలంబింపవలసినది మున్నగు వుపదేశముల పదునాలుగు శాసనములుగా యేర్పరిచి తాను స్వయముగ హిందూదేశమంతయు పర్యటనజేసి అనేక స్థలముల శిలాశాసనముల స్థాపించెను.

## మొదటి శిలాశాసనము

పావనుడై ఘనతవహించిన ప్రియదర్శి ప్రభువు నాజ్ఞానుసారముగ యీ పవిత్రశాసనము ప్రకటించబడుచున్నది.

ఈ రాజదానీ (పాటలీపుత్ర) మందు సాంఘికోత్సవములు జరుపరాదు. ఏలన అనేక హింసాకృత్యములు జరుగును ప్రియదర్శి ప్రభువు స్వయముగా నట్టి ఘోరముల తిలకించినారు. కాన జాతరలందు యే విధమైన ప్రాణి వధజేయరాదు. ప్రాణివధ జేయకున్న వుత్సవముల జరుపుకొనుటకెట్టి యాటంకము లేదు. మరియు కూరనిమిత్తమై ప్రతిదినము అనేక ప్రాణులు సంహరింపబడుచున్నవి. దీనినీ సంపూర్ణముగా యీ పవిత్రశాసనము నిషేధించు చున్నది.

## ద్వితీయ శాసనము

మనుష్యుల, పశువుల సౌఖ్యముల గురించిన భవిష్య న్నిబంధనలు.

## 3. వ శాసనము

రాజకీయోద్యోగు లందరు బౌద్ధధర్మముల ప్రజలయందు ప్రచారము జేయుట, అహింస, పొదుపు, నీతి నియమములు కలిగి యుండవలెను.

## 4 వ శాసనము

బౌద్ధ ధర్మాచరణ విషయమును విశదముగ చర్చించినది.

## 5 వ శాసనము

పాప మొనరించుట కడు సులభము. సత్కార్యములచే నిల బడుచూ, దుష్కార్యముల చెంత జేరకుండుట కష్ట సాధ్యము. ఐనప్పటికి సత్కృత్యముల జేయ నలవాటు పొందిన నది సులభ సాధ్యమగును. కాన నావలెనె, నాపుత్రపౌత్ర వంశపారంపర్యము నిట్టి సత్కార్యముల జేయుచూ, ప్రజలచే జేయించుచుండిన ప్రజలందరు, నీతి వంతులై, సత్య సంపన్నులై, అహింసా పరులై, సుఖ పరులై జీవించగలరు.

## 6 వ శాసనము

ఎవరి యందైనా, యెట్టి కాలమందైనా, యెచ్చటనైనా మోసము జరిగిన తక్షణమే నాకు తెలియ జేయవలయును

ప్రజల మేలు కొరకే నేను జన్మించితిని. లేని యెడల మరి దేనికి జన్మించితిని ? నా జీవితమంతయు ప్రజాసేవకై త్యాగ మొనర్చుటకై జన్మించితిని. ప్రజలను సుఖ పెట్టుటె నా సుఖము. ఇవ్విధమున, నాపుత్ర పౌత్ర పారంపర్యముగా నందరును ప్రజాక్షేమమునకు పాటు పడెదరు గాక.

## 7 వ శాసనము

ఇంద్రియ వశీకరణము, అన వ్యభిచారము, దొంగలించుట మున్నగునవి జేయకుండుట, చిత్తశుద్ధి అన యితరుల మోసము జేయుట, అసత్య మాడుట మున్నగునవి యాచరింపకుండుట, కృతజ్ఞత, అన చేసిన మేలు మరువకుండుట.

## 8 వ శాసనము

ఘనత వహించిన ప్రియదర్శి ప్రభువు ప్రభుత్వమునకు వచ్చిన పదునొకండవవత్సరమున జ్ఞానమార్గగామియయ్యె. అవి (1) శుద్ధ సంకల్పములు (2) శుద్ధాను భవములు (3) శుద్ధ వాక్కులు (4) శుద్ధ ప్రవర్తన (5) శుద్ధ జీవనము (6) శుద్ధ కృషి (7) శుద్ధ స్మృతి (8) శుద్ధ విచారణ. వీనిని అష్టాంగ మార్గము లనియెదరు.

ఇందువలనం జేసి ప్రజలును నట్లె నడువవలయునని ప్రియదర్శి ప్రభువు ప్రార్థించుచున్నాడు.

## 9 వ శాసనము

ప్రజలందు గల మూఢాచారముల నశింపజేసి శుద్ధాచారముల యాచరింపవలసినదిగా నున్నది.

## 10 వ శాసనము

ప్రతివొక్కరు యిట్టి వుత్తమమైన బౌద్ధమతమును స్వీకరించి సత్యాచరణచే జీవితమును సార్థకము జేసికొందురు గాక.

## 11 వ శాసనము

బానిసలను, సేవకులను, బీదలను దయతో చూచుట, పెద్దల గౌరవించుట, బౌద్ధమత ప్రచారమునకై విరాళముల నిచ్చుట, బౌద్ధ మత మవలంబించుట, ప్రచారము జేయుట మానవుని కర్తవ్యమై యున్నది.

బౌద్ధ ధర్మమును ప్రతివ్యక్తి తన పొరుగు వానికి బోధింప వలయును. అట్టి బోధన వస్తు రూప దానములకంటె వేయి రెట్లు శ్రేయస్కరము. ఆ ధర్మ బోధవలన జన్మ బంధుత్వమునకంటె, బల మయిన ఆత్మ బంధుత్వ మేర్పడు చున్నది.

## 12 వ శాసనము

బౌద్ధమతమే మేము మంచిదని చెప్పుచున్నాము. అంత మాత్రమున మీరు అంధ విశ్వాసమున మత స్వీకరణ జేయరాదు.

అట్లు జేసిన అసత్య బోధలకు గురి కావలసి వస్తుంది. కాన ఏ విషయ మును నిశ్లే యెరులు చెప్పినంత మాత్రమున పరిశీలన జేయక, ఆచరించుట ఆత్మహత్యకు సమానమగును.

తద్వతుగానే మతము లన్నిటిని పరిశీలించి, యేమతము ప్రజల శ్రేయస్సు కోరునో నా మతమును స్వీకరింపుడు.

## 13 వ శాసనము

### (సత్యమే జయము)

అసత్యము, అన్యాయము, అధర్మము యెప్పటికైనా నశించు నవియే. నశింపజేయునవియే.

కాన సత్యమైన బౌద్ధమతము 600 యోజనముల వరకూ వ్యాపించినది. అన ఆంటియోకస్ నామధేయుడగు గ్రీకు ప్రభువు రాజ్యము వరకున్నూ, ఆ రాజ్యమున కావలనున్న "టోలమీ, ఆంటిగోనసు, మాగాస్, అలెగ్జాండరు" అను రాజ చతుష్టయమందును బౌద్ధమతము వ్యాపించినది. దక్షిణముననున్న పాండ్య, చోళ, సింహాళ రాజ్యములందును బౌద్ధమతము స్వీకరించబడినది. మరియు, యవనులు, కళింగులు, భోజులు, ఆంధ్రులు, పుళిందులు ప్రియదర్శి ప్రకటించిన ప్రకారము బౌద్ధ ధర్మావలంబకులై యుండిరి. మరియు అనేక విదేశములునూ దీనిని అవలంబించెను.

## 14 వ శాసనము

బౌద్ధమతము నశింపకుండవలయుననియు, అందుకు ప్రజలు, వుద్యోగులు సన్మార్గులై, బౌద్ధమతమును రక్షించెదరని విశ్వసించు చున్నాను. నాలుగు మాసముల కొకసారి జరుగు పుష్య నక్షత్రోత్సవ మునందు యీ శాసనముల జదివి ప్రజలకు వినిపింపవలయును. ఇట్లు ప్రజలకు తెలియ పరచిన ప్రజలందరు సన్మార్గులయ్యెదరు.

ఇవ్విధముననే మూడులక్షశిలాశాసనములు, గుహాశాసన ములు, స్తంభశాసనములు మున్నగునవి యనేకము దేశ విదేశము లందంతటను స్థాపించె.

ఇవ్విధమున హిందూదేశమునందే గాక విదేశములకును ప్రచారకుల నంపి, బౌద్ధమత వ్యాప్తిజేసె.

9 వేల మైళ్ల దూరముననున్న సిరియా, ఐగుప్తు, మాసిడోనియా, ఎపిరసు, కైరేని రాజ్యములందును, బర్మా, చైనా, జపాను సింహళమందును బౌద్ధమత స్థాపన మొనర్చెను.

దేశ విదేశస్థులందరు సత్యమతమైన బౌద్ధమును స్వీకరించిరి.

తన కుమార్తెను, కుమారుని బౌద్ధమత ప్రచారమునకై సింహళమునకు పంపెను.

ఇట్టి సమయమున ప్రపంచమందు గల యన్ని దేశములు అజ్ఞానాంధకారమున మునిగియున్నవి. ఈ బౌద్ధమత విప్లవ చైతన్యమే ప్రపంచమునకు విజ్ఞాన దీప్తి నిచ్చి అజ్ఞానాంధకారము బాపి నేటి నాగరికతకు కారణ భూతమయ్యె.

## శిల్పకళ

అశోకునిచే నిర్మింపబడిన స్థూపములు, స్తంభములు, విగ్రహములు, భవనములు ప్రపంచ విఖ్యాతినందినవి.

ఈ శిల్పులు నల్లరాతిని అద్దమును మరిపించునట్లు మెరుగు పెట్టగలరు. ఇంతటి శిల్పకళాభివృద్ధి యానాడు కలదన్న యెంతటి విశేషము? గ్రీకు చిత్రకళ బౌద్ధ చిత్రకళ ముందు, సూర్యుని యెదుట కాగడావలె వెలవెల బోవుచున్నదని గ్రీకు చరిత్ర కారులే విస్మయులైరి.

భారతమున వర్ణింపబడిన మయసభావర్ణనవలన బౌద్ధుల శిల్ప చాతురీమహిమ కన్పట్టుచున్నది.

ప్రతిమాశిల్పములందును వీరు అసమాన్య ప్రావీణ్యులు. వీరిచే నిర్మింపబడిన సింహ, గజ, మనుజ విగ్రహములు అతిరమ్యముగా నున్నవి.

దారు (కొయ్య) శిల్పమునందును విశేష ప్రజ్ఞ చూపిరి. మూర్తి విగ్రహములు చెక్కుట యందు వీరి కళాచాతుర్యము చిరస్మరణీయమైనది.

శిలాలేఖనమున యప్రతిమాన లేఖనా నైపుణ్యమును ప్రదర్శించిరి. అందలి యక్షరములు పొంకను దీరి యందముగా నున్నవి.

అశోకునిచే యిట్టివిధమున కళలన్నియు సృష్టింపబడి పెంపొందింపబడియె.

## విద్యావ్యాప్తి

ప్రతిబౌద్ధమఠమునందును పాఠశాలయు నుండెడిది. బౌద్ధ భిక్షులు ప్రజల యందు విద్యావ్యాప్తియు కలిగించిరి.

గ్రామగ్రామములందును పాఠశాలల నెలకొల్పి ప్రజలందరిని విద్యావంతుల జేయుచుండెను

ఆర్యులకు ప్రజలు విద్యావంతులగుట, విజ్ఞాన వంతులగుట ప్రాణసంకటముగా గన్పట్టెను. ఏలన తమతప్పుడు యాచారములను అసత్య సిద్ధాంతములను గ్రహించి, తమను ధిక్కరించెద రనియు, అందువలన ప్రజలను అజ్ఞానుల జేసిన తాముజెప్పినదే విశ్వసించి తమ యాజ్ఞానుసారులై వర్తించెదరనియు, తమ మతయధికారములె సుస్థిరముననిల్చునని యు తలంచి, విజ్ఞానాభివృద్ధికరమైన లిపిని, విద్యను పూర్తిగ బహిష్కరించిరి

అందువలన బౌద్ధులే ప్రప్రథమముగా వ్రాతసామగ్రని కనుగొని గ్రంథముల వ్రాయదొడగిరి. బౌద్ధులవేదములగు త్రిపిటకములను లిఖితరూపములోనికి దెచ్చిరి. అనేక వ్రాతప్రతులు తీయుచుండిరి.

తాటియాకులు, వస్త్రము, దారు, లోహ, శిల మున్నగు వానిపై లిఖించుచుండిరి. ఇట్టివిధమున బౌద్ధ ధర్మ గ్రంథము లన్నియు లిఖిత రూపము లోనికి వచ్చినవి.

దరిమిలా పాళీభాషయందు విశేష సారస్వతాభివృద్ధి జెందెను. అఖండ ప్రతిభాశాలురగు కవిశిఖామణులు, గ్రంథకర్త లుండిరి.

అనేక వ్యాకరణ శాస్త్రముల నిర్మించిరి. సంస్కృత వ్యాకరణములు బౌద్ధులు నిర్మించినవే. గ్రీకులనుండి బౌద్ధులు ఛందస్సును గ్రహించి యనేక ఛందశ్శాస్త్రముల నిర్మించిరి. సంస్కృతము నందును చాలా గ్రంథములు లిఖించిరి

ఓషధుల పరిశీలించి ఔషధముల కనిపెట్టి వైద్య శాస్త్రములను ప్రప్రథమమున నిర్మించినవారు బౌద్ధులే.

ఎంతటి దీర్ఘవ్యాధులనైనను సులభమున నివర్తి జేయుచుండిరి. శస్త్ర చికిత్సను చేయుచుండిరి.

ఈ పరిశోధనల గ్రంథములకు ఆర్యులు తమ నామములుంచి ప్రకటించుకొనిరి. ప్రస్తుత ఆయుర్వేద గ్రంథములన్నియు, నాడు బౌద్ధులచే రచింపబడినవే. ఇవి యన్నియు యార్య నామరూపమున నేడు కనపడుచున్నవి.

వేయేల! యరువది నాల్గు విద్యలు పరిశోధింపబడి, అభివృద్ధి జెంది వ్యాప్తి జెందినవి.

బౌద్ధమతమును ఆర్యులు నశింపజేసి, బౌద్ధ సంస్కృతినే తమ సంస్కృతిగా ప్రకటించుకొనిరి.

ఆర్యులు ప్రపంచము మిథ్య, స్వప్నసమానము, తుచ్ఛము, అని ప్రకృతి జ్ఞానమునకు దూరులై, మా యాప్రకృతిని తెలిసికొనుట అజ్ఞానమని ముక్కు మూసుకొని "అహంబ్రహ్మాస్మి" (నేనే బ్రహ్మను) అనుముక్తి మంత్రమును జపించుచూ మనస్సును నశింపజేసి, చైతన్య విహీనులై శిలావిగ్రహములైరి. అటువంటి యార్యులే యరువది నాల్గు విద్యలు పరిశోధించిరన్న నింతకంటె హాస్యాస్పదమేరొండు కలదా? నేడు వారి సంతతి బ్రాహ్మణులు తమ ఆర్య సంస్కృతి యెంతో మహోన్నతమైనదని ప్రపంచమునకు చాటుట సిగ్గుపడవలసిన విషయము.

మరి యార్యసంస్కృతి (విజ్ఞానము) యేమన, యజ్ఞముల పేరిట మాంసభక్షణ జేయుట, మద్యమును పుచ్చుకొనుట, అవినీతి,

ద్రోహబుద్ధి, అసత్య విషయబోధన, సంఘమును నాశనముజేయుటె లక్ష్యముగా గల్గియుండుట, విప్లవమును నశింపజేయుట మొన్నగునవి.

ఇంతటి యవినీతిపరులు, అజ్ఞానులు, ద్రోహులు యైనందు ననే బౌద్ధ విప్లవమునకు ఆస్కారము లభించినది. విశేష వ్యాప్తి జెందినది. ఆర్యులెంతటి విప్లవము (విజ్ఞానము) నాశనము జేసిరో, బౌద్ధు లంతటి విప్లవము (విజ్ఞానము) యభివృద్ధిజేసిరి.

నేడు పాశ్చాత్యులు యెంతటి శ్రమకు లోనై ప్రకృతి పరిశోధనలు జరుపుచుండిరో, నాడు బౌద్ధులు (20 వందల సంవత్సర క్రితము) యంతటి శ్రమకులోనై ప్రకృతిని పరిశీలించి సమస్త విజ్ఞానమును (నేటియంత్రములు మినహా) సృష్టించి యభివృద్ధిజేసి వ్యాప్తి జేసిరి. ఇట్లు ప్రపంచమున ప్రప్రధమ ప్రకృతి పరిశోధకులు బౌద్ధులే. బౌద్ధులనుండి యరబ్బులు, యరబ్బులనుండి పాశ్చాత్యులు కొంత విజ్ఞానమును గ్రహించిరి.

ఇవ్విధమున యశోకుని కాలమందు హిందూ దేశము అఖండ వైభవముగ, సమస్త విజ్ఞానమునకు యాలవాలమై అఖండ కీర్తిని పొందినది.

ఇట్లు యశోకుని నలుబదివత్సర పాలనమందు, అఖండ విప్లవేత్తయై, తన జీవితమునంతయు బౌద్ధమత ప్రచారమునకే వినియోగించి క్రీ పూ. 231 వ వత్సరమున నిర్యాణము జెందెను.

అశోకుడు స్వర్గస్థుడైన యచిరకాలములోనే మౌర్య సామ్రాజ్యము అస్తమించినది.

## శుంగ వంశము — పుష్య మిత్రుడు

మౌర్య వంశజుడైన బృహద్రధరాజ సైన్యాధీశుడైన పుష్య మిత్రుడు రాజును సంహరించి క్రీ. పూ. 184 వ వత్సరమున మగధ సింహాసన మధిష్ఠించెను.

పుష్య మిత్రుని కుమారుడు అగ్ని మిత్రుడు. ఈతని భార్య ధారణి. వీరికి వసుమిత్రుడను కుమారుడు కల.

ఆర్యులు పుష్య మిత్రుని లోబరచుకొని బౌద్ధమతమును నాశనము జేయుటకు తమకు సాయపడవలసినదిగా ప్రార్థించిరి. అందుకు పుష్య మిత్రు డంగీకరించలేదు. అంత యార్యులు ఒక యశ్వమేధ యాగమైనా జేయవలసినదిగా ప్రార్థించిరి. అందుల కంగీకరించి. యశ్వమును వదలి, సద్దాని సంరక్షణకై తన మనుమని సైన్య సమేతమున పంపెను. అశ్వమును బట్టుకొనిన వారిని జయించుచూ మనుమడు జయభేరీలతో తాతగారి సముఖమునకు మరలివెళ్ళెను.

దరిమిళా ఆర్యులం దభిమానముచే బౌద్ధుల హింసించినట్లుగాన వచ్చుచున్నది. ఇతడు క్రీ. పూ 143 లో మృతిజెందెను.

ఇతని దరిమిళా ఇతని కుమారుడు అగ్నిమిత్రుడు రాజయ్యె.

ఇతని దరిమిళా పదియవరాజగు దేవభూతి రాజుకాగా యతని బ్రాహ్మణ మంత్రియగు వసుదేవుడు హత్యజేసి క్రీ. పూ. 63 న సింహాసనమధిష్టించెను.

## కాణ్వవంశము – వసుదేవుడు

ఈ వసుదేవుని దరిమిళా ముగ్గురు రాజ్యపాలన జేసిరి. కడపటి వానిని క్రీ. పూ. 27 లో ఆంధ్రరాజులు సంహరించి సింహాసన మధిష్ఠించిరి.

## ఆంధ్ర రాజులు

ఆంధ్రరాజులు క్రీ. శ. 249 వరకూ రాజ్యపాలనజేసిరి. వీరు బౌద్ధమతాభిమానులై అమరావతి, జగ్గయ్యపేట మున్నగు చోట్ల బౌద్ధారామముల కట్టించి బౌద్ధమతమును రక్షించిరి.

ఆంధ్రరాజుల పాలనమందు విజాతమమూకలు మిడుతలదండు వలె హిందూదేశము జొచ్చిరి.

శాకులను పారద్రోలి, వారికి కుశన వంశజులు జయించిరి.

ఈ వంశమున కనిష్కుడను రాజు క్రీ. శ. రెండవ శతాబ్దారంభమున విఖ్యాతి గాంచెను. ఇతడనేక రాజ్యముల జయించెను.

## బౌద్ధమత వ్యాప్తి

అశోకునివలె కనిష్కుడును బౌద్ధమతమును స్వీకరించి, మధ్య ఆసియా యందెల్ల వ్యాపింపజేసెను. అందువలన యితని కీర్తి చిరస్మరణీయమైనది.

ఈతని సమకాలీనుడు నాగార్జునుడు. ఇతడు ఆర్యులకైనప్పటికీ, ఆర్య దుర్నడతకు, ద్రోహబుద్ధికి యార్యుల యమేధ్యమువలె విసర్జించి బౌద్ధమతమును స్వీకరించి, విశేష పరిశోధనల జరిపి, మత వ్యాప్తి జేసెను.

కనిష్కుడు బౌద్ధుల నందర రావించి తృతీయ పరిషత్ మహావైభవమున జరిపెను. ఇందు బౌద్ధాచార్యులు బౌద్ధ సాహిత్యము తరచి మహాభాష్యముల లిఖించిరి. ఇవి చీనా భాషయందు నేటికిని కలవు.

ఈ మహాపరిషత్ సముఖమున పరిష్కరింపబడిన విషయములను తామ్ర ఫలకముపై వ్రాయించెను.

ఈ రాజు అనేక కట్టడముల కట్టించి శిల్పకళ నభివృద్ధి జేసెను. తన రాజధాని యగు పురుష పురము (పెషావరు)న బుద్ధుని శల్యములపై బ్రహ్మాండమగు గోపురమును నిర్మించెను. ఇది పద మూడు యంతస్థులు కలిగి నాలుగువందల యడుగుల యున్నతి కలిగి మేఘమండలము నానెను. చిత్రవిచిత్రములగు చెక్కడములతో నెంతో రమ్యముగా నుండెను.

ఈ గోపురము చెంతనే బుద్ధవిహారమును గట్టించెను. పెషావరులో యిది విద్యాపీఠమై ప్రఖ్యాతి గాంచినది.

ఇవ్విధమున కనిష్కుడు తన జీవితమంతయు బౌద్ధ సేవకే త్యాగ మొనరించి క్రీ. శ. 157 న దివికేగెను

ఇతని దరిమిలా హావిష్కవాసుదేవులు పాలించిరి. వీరితో కుషాను సామ్రాజ్యము అస్తమించినది.

## క్రైస్తవ మతము

ఇవ్విధమున హిందూ దేశము విజ్ఞానమున కాలవాలమై, మహోన్నత నాగరికత ననుభవించుచుండ తదితర దేశము లన్నియు కొంత నాగరికత గలిగి యున్నప్పటికి విశేష అజ్ఞానులై యుండిరి.

యూదు దేశమున "ఏసు" అను మహాత్ముడుద్భవించి కొంత విప్లవము (నాగరికత)కు మార్గగామియయ్యెను.

ఇతడు మత ప్రవక్తయై 12 గురు శిష్యులతో పర్యటనజేయుచూ మత ప్రచారము జేసెను.

"ఇన్ని దేవతలను పూజించుట తగనిపని. ఒకడే దేవుడు, అతడు "ఎహోవా," ఉతనిచే పంపబడిన దైవదూతను. కాన మీరం దరు నాయందు విశ్వాస ముంచి నేజెప్పెడి ప్రకారము యాచరిం చెదరు గాక."

ఏసుదూత వ్యక్తి నైతిక సిద్ధాంతముల బోధించి సంఘమున విప్లవ శక్తి గలిగించి సంఘ ధర్మముల బోధించి సంఘమును వైక మార్గమునకు తెచ్చెను.

ఇమ్మహనీయుని పేర క్రీస్తుశకారంభమైనది. ప్రపంచమందు గల శకములన్నిటి యందు, క్రీస్తుశకమే యమలు నందున్నది.

## ఆర్యుల కుతంత్రము

ఆర్యులు ముక్కు మూసికొని "అహంబ్రహ్మాస్మి" యని కూర్చున్న శానకములకున్న గౌరవమును దక్కదని, తత్క్షణమే యోగముల విసర్జించి కర్తవ్య మాలోచించుచుండిరి.

తమ యధికారము, మతము, సుస్థిరమున నిలుపవలెనన్న యే మాండలిక రాజత్వమైనా నుండవలెనని తలంచిరి. అందు నిమిత్తమై యోగాభ్యాసముల పరిత్యజించి, సైనిక శిక్షణాభ్యాసపరులైరి.

ఇట్లు యుద్ధ భటులైన యనంతరము వీరి నాయకుడు గుప్త* నామధారియై "రాజ" బిరుదమును కల్పించుకొని, రాజులచే సముచిత గౌరవ మర్యాదలు పొందుచుండె.

ఈతని మనమడు మొదటి చంద్రగుప్తుడు. ఇతడు తమ లక్ష్య సిద్ధి కొరకు అనేక రాజుల సహాయము కోరుచూరాగా, లిక్షివీ క్షత్రియులు "తమ కన్య నుద్వాహమాడిన విశేష సహాయ మొనరించెద"మనిరి.

అందులకు చంద్రగుప్తుడు సమ్మతించి లిక్షిలీ వంశ క్షత్రియ కన్య నుద్వాహమాడె. "పాటలీపుత్రమునకు రాజు"నని ప్రకటించుకొనెను. అంత పాటలీపుత్ర రాజు చంద్రగుప్తునిపై దండెత్తగా, చంద్రగుప్తుడు తన మామగారైన లిక్షిలీ క్షత్రియుల సాయమున, పాటలీపుత్ర రాజును వోడించి, తత్సమీపమునన్నున్న మరికొన్ని రాష్ట్రముల జయించి సార్వభౌమ బిరుదమున క్రీ. శ. 320 వత్సరమున పాటలీపుత్ర సింహాసన మధిష్ఠించెను.

## గుప్త వంశము – చంద్రగుప్తుడు

ఈ గుప్త వంశజు లనగా ఆర్యులని మరువకుడు. వీరు బౌద్ధ మతమును నాశనము జేయుట తమ ఆస్తిక మతమును, అధికారమును, గౌరవమును కలిగియుండుటకై యిట్లు రాజ్యాధికారులైననే తమ లక్ష్యము సిద్ధించునని రాజులైరి.

చంద్రగుప్తుడు తలంచిన కార్యములన్నియు నెరవేరలేదు ఇతడు సింహాసన మధిష్ఠించిన పదివత్సరములకే మరణించెను. (క్రీ. శ. 330).

---

* గుప్త యనగా, రహస్యమైన, మరుగు పడిన, గుప్త రాజు లనగా, ఆరబీ రాజులు గుప్త వంశ మనగా ఆర్య వంశము.

## సముద్రగుప్తుడు

చంద్రగుప్తుడు జీవించి యుండగనే తన కుమారుడైన సముద్రగుప్తునకు క్రీ. శ. 323 న పట్టాభిషేక మొనరించెను.

సముద్రగుప్తుడు సైన్యాభివృద్ధిజేసి మరికొన్ని రాజ్యములు జయించెను. తన విజయము దెలుపుటకై యశ్వమేధయాగము జేసెను యశ్వమేధ సూచికములగు నాణెముల యములునందుంచెను. ఇట్లితడు రాజ్యముల జయించుచు, రక్షించుచూ క్రీ. శ. 375 న మరణించెను

## చంద్రగుప్త విక్రమాదిత్యుడు

### క్రీ. శ. 375–4 3

సముద్రగుప్తుని తనయుడగు చంద్రగుప్తుడు క్రీ. శ. 372 న సంహాసన మలంకరించెను.

ఇతడును తండ్రి తాతలవలె కొన్ని రాజ్యముల జయించి "విక్రమాదిత్యుడ"ను బిరుదము వహించెను.

ఈ గుప్తరాజులు యార్యులని మున్నే వచించితిని. అందువలన వీరు బౌద్ధ (నాస్తిక) మతమును నశింపజేసి, ఆర్య (ఆస్తిక) మతమును పునః స్థాపించవలయునని యభిలాషులై యుండిరి

గుప్తవంశజులు తత్కారణమున సంస్కృతభాషను రాజకీయ భాషగా నెలకొల్పిరి చంద్రగుప్తుడు, సముద్రగుప్తుడు తమ మతమునకు అంతకన్న విశేషసాయము జేయజాలకైరి. ఏలన రాజ్యముల జయించుట రక్షించుకొనుట మున్నగు రాచకార్యములందే సర్వదా నిమగ్నులై యుండిరి

వీరి దరిమిలా చంద్రగుప్త విక్రమాదిత్యుడు యార్యులకు సంపూర్ణదోహద మొసంగి, పునః ఆర్య (ఆస్తిక) మతస్థాపనా కారకుడయ్యె.

సంస్కృతభాష రాజకీయభాషగా నున్నదని యింతకు మున్నే వచించితిని. ఇంతకు మున్నే బౌద్ధులు సంస్కృత వ్యాకరణ, ఛందశ్శాస్త్రముల రచించిరి. ఈ గ్రంథములవలన యార్యులు సంస్కృత పండితులు గాజొచ్చిరి. ఇట్లు అసంఖ్యాకులు సంస్కృత పండితులగుచుండిరి వీరిలో కాళిదాసను కవి శిఖామణి యొకండు కలడు. ఇతడు యార్య పండితులకెల్లను శ్రేష్ఠుడై "కవి సార్వభౌమ" బిరుదము వహించి యుండెను.

ఆర్యులు బౌద్ధమత నాశనమే లక్ష్యముగా గలవారై అనేక కల్పిత బాధల వల్లి, నాలుగు యుగముల సృష్టించి, దశావతారముల కల్పించి, తాము దేవతలుగను, గొప్పవారుగను, సత్యవంతులుగను, ధర్మవంతులుగను, అహింసాపరులుగను; ద్రావిడుల రాక్షసులగను, క్రోతులుగను, హింసాపరులగను, క్రూర, వికృతకాయులగను, వర్ణించి. ఆర్య ద్రావిడ యుద్ధములనే కథుమాతృకలుగా స్వీకరించి, వారి పుర్రెకు పుట్టిన బుద్ధినంతయు వినియోగించి, కల్పితాతి కల్పిత గాధల నల్లిరి. కవి శిఖామణియైన కాళిదాసు, శ్లోకరూపమిచ్చి ప్రకటించె. నేడు మనకు కనుపించుచున్న సంస్కృతి యితి హాసములు.

ఈ గ్రంథములన్నియు బౌద్ధ మహాయుగమున నే రచింపబడి నందుకు అనేక ప్రబల కారణము లున్నవి.

మాంస భక్షణ నిషేధము, మద్య పానము దోషము, హింస దోషాతి దోషము, మున్నగు సిద్ధాంతములు బుద్ధునిచే ప్రతిపాదింప బడినవి. ఇంతకుమున్ను ఆర్యులు వీనిని సభ్యతగా, యాచారముగా పరిగణించుచుండిరి. కాన బౌద్ధ యుగమునకు పూర్వమే ఆర్యులు గ్రంథములు లిఖించెరన్న, అట్టి యసభ్యతయే సభ్యతగా గన్పట్టెడిది. తద్వ్యతిరిక్తమున బుద్ధునిచే ప్రతిపాదింపబడిన సిద్ధాంతములనే వారు యాచరించినట్లుగా చెప్పికొనిరి. కాన బుద్ధుని యనంతరమే యితి హాసములు రచింపబడినవి.

ఆనాడు బుద్ధుని ప్రచారమువలన ప్రజలు అహింసాపరులై నీతి నియమములు కలిగి యుండిరి. కాన ప్రజాదరణ పొందవలెనన్న

ప్రజాభిరుచిని యనుసరింపవలయును గదా? అందువలన తర్క గ్రంథములన్నిటి యందు బౌద్ధ ధర్మములు ప్రతిఫలించినవి, మీదు మిక్కిలి తాము ప్రజలచే విశేష గౌరవ మర్యాదల నందవలెనని తాము అహింసాపరులుగను, సత్ప్రవంతులగను వర్ణించుకొని, ద్రావిడు లన్న ప్రజల కయిష్టత కలుగునట్లు హింసాపరులుగను, మాంస భక్షకులుగను, మద్యమును గోలెడి వారుగను వర్ణించి ఇతి హాస త్రయము (భారత, భాగవత, రామాయణము)ను నిర్మించిరి.

వీరికి శత్రువులైన నాస్తికుల నిందించుచూ వ్యభిచారమే లక్ష్యముగా గలవారని, పాషండులని, దేశద్రోహులని వర్ణించిరి.

ఆర్యులకు యింతకు పూర్వము ఛందస్సు తెలియదు. బౌద్ధులే గ్రీకులనుండి గ్రహించి సంస్కృతమున వ్యాకరణములు, ఛందస్సు, రచించిరి. మరియు బౌద్ధమతమునంతయు సంస్కృతమున లిఖించిరి.

కాన యింతకు పూర్వము ఆర్యులకు ఛందస్సు తెలియదు. బౌద్ధుల పుణ్యమాయాంటూ స్వల్పకాలముననే ఆర్యులందరు పండితులైరి.

కాన వేదములును నిప్పుడు రచించినవే. ఈ వేద కాలము అత్యంత ప్రాచీనమగుటచే, అప్పటి పరిస్థితులచే వర్ణించిరి. వీని యందు కల్పితమేమియును లేదు.

కొలది ప్రాచీనములైన స్మృతుల కాలమున ఆర్యులు విశేష మాంస భక్షకులై యుండిరి. కాన ఆ స్మృతులందు సంపూర్ణ సభ్య తగా, మాంస భక్షణను వర్ణించెడివారే. కాన యివియును యిప్పుడు రచింపబడినవగుటచే మాంస భక్షణ దోషమంటూ,కొన్ని కార్యము లందు మాంస భక్షణ దోషము కాదంటూ స్మృతులు నిర్మించారు.

కాన వేదములు, స్మృతులు, రామాయణ, భారత, భాగ వతములు చంద్రగుప్త విక్రమాదిత్య కాలమున కాళిదాసుని చేతను, మరికొందరి చేతను రచింపబడినవి.

అన్య లింతటి శ్రమములోనైనది బౌద్ధమతమును నాశన మొనరించి ఆర్య (ఆస్తిక) మతమును స్థాపించుటకే యని తెలియ వలయును. అంతియే కాని ప్రజల నుద్ధరించుటకు కాదు.

వీరి లక్ష్యమే సిద్ధించినది. అధికారులైనందున బౌద్ధుల హింసించి, బౌద్ధమతమును విసర్జించమనిరి. అనేక బౌద్ధాచార్యుల హత్య జేసిరి. బౌద్ధ గ్రంధముల తస్కరించి తమ కవసరమయిన వైద్య గ్రంధములు మున్నగు వానిని రక్షించి, అనేక బౌద్ధ గ్రంధ ముల దహనము జేసిరి. ఇవ్విధముగ బలాత్కారముగ బౌద్ధమతమును చాలాభాగము నశింపజేసిరి. తమ యాసత్య పూరిత కల్పిత గాధల ప్రచారము జేయుచుండిరి. పునః ఆస్తిక సిద్ధాంతముల ప్రభావము ప్రజలపై ప్రసరింపసాగింది.

ఇవ్విధమున చంద్రగుప్త విక్రమాదిత్యునిచే బౌద్ధమత పతనము, ఆర్య (ఆస్తిక) మత వికాసము సంభవించింది.

## ఫాహియాన్ యాత్రికుని రాక

అన్ని దేశములకంటెను చీనాదేశస్థులు విరివిగా బౌద్ధమత మును స్వీకరించిరి. పండితులు, పామరులు, ఈ ప్రపంచమున నింత కంటె ఉత్తమమైన మతము లేదని ఆబాలగోపాలము బౌద్ధమత మును స్వీకరించిరి. బౌద్ధమతమును యెవరైనా ద్వేషించినవారు సహించరు. తమ ప్రాణములైనా యర్పించి, బౌద్ధమత గౌరవమును కాపాడుచుండిరి. నేటికిని నవ్విధముగనే యుండిరి.

చీనాదేశస్థులైన పండితులు బౌద్ధమత పరిశోధనా సక్తులై సంస్కృత మభ్యసించి తద్వారా బౌద్ధ గ్రంధముల చీనాభాషలోనికి తర్జుమా జేయుచుండిరి. అట్లు తర్జుమా జేసిన ప్రతిననుసరించి యనేక వ్రాత ప్రతుల చేయుచుండిరి. ఇవ్విధమున యనేక వ్రాత ప్రతులు తీయుట విశేషకష్టముగా నుండుటంజేసి అచ్చు యంత్రము కనిపెట్టిరి. ఇదినేటి యంత్రమునలె సౌకర్యముగా నుండక, ప్రప్రధమమున కని

పట్టిన దగుటచే విశేష ఆలస్య, బాధలకు గురిగాజొచ్చిరి. ఐనప్పటికీ యెన్ని కష్టములనైనా సహించి బౌద్ధమత గ్రంథము లన్నిటిని అచ్చు వేసిరి. ఆహా! చీనాదేశస్థుల కార్య దీక్ష నేమని కొనియాడ వలయును ?

చీనాయనగా, మన దేశమున నుత్తరమునగల హిమాలయ పర్వతముల కుత్తర ప్రదేశము.

అచ్చటనుండి "ఫాహియాను" అను బౌద్ధ మత పండితుడు బౌద్ధగ్రంథములు నశింపకమునుపే తమ దేశమునకు గైకొనివెళ్లి అచ్చు వేయవలెనను వుద్దేశ్యముతో 399 న చీనాయందు పయనమై, తన ప్రాణములపై యాసవదలి అరణ్యములు, పర్వతములు, నదులు, దాటుచూ, యెండనక, వాననక ఆరువత్సరములకు వుత్తరహిందూస్థానమునకు చేరుకొనియె. అంత తక్షశిల, వారణాశి, గయ, పాటలీపుత్రము, కపిలవస్తు, తామ్రవిత్త మున్నగు బౌద్ధ క్షేత్రముల దర్శించుచూ, శేషించిన బౌద్ధ గ్రంథముల పరిశీలించుచుండెను.

ఇక్కాలమున యితడు యెంతదూరము వెళ్లినను కాలిబాటనే ప్రయాణము జేయవలసియుండెను. ఆహా! ఎంతటి!! బౌద్ధాభిమాని!!

బౌద్ధ మతమునకై ఏదేశీయు లింతటి శ్రమనోర్చి తమ ప్రాణముల సరకు చేయక బౌద్ధమత, గ్రంథ, ధర్మ రక్షణకై తమ జీవిత, ప్రాణముల యర్పించిన చీనాదేశస్థులకు మాధన్య వాదములు.

హిందూదేశమునం దుద్భవించిన బౌద్ధమతము హిందూదేశమున నామరూపాదులు లేకుండా నశింపజేసిన బ్రాహ్మణ (ఆర్య) చండాలురకు ధిక్కారము.

ప్రజలందు విప్లవము కల్గించి, విజ్ఞానుల జేసి, ప్రజాభ్యుదయమునకు పాటుబడిన బౌద్ధమతమును నామరూపాదులు లేకుండా నశింపజేసిన బ్రాహ్మణులు తక్షణము దండనార్హులు. అట్టి చైతన్యమును నశింపజేసి, ప్రజల యజ్ఞానుల జేసి, అసత్య సిద్ధాంతముల విశ్వసింపజేసి, తమ యధికారమును చెలాయించుచున్న బ్రాహ్మణులను,

బ్రాహ్మణ మతమును తక్షణమే నామరూపాములు లేకుండా నశింప జేయుట బ్రాహ్మణేతరుల కర్తవ్యమై యున్నది.

ప్రజాభ్యుదయమునకై పాటుబడిన బౌద్ధమతమును బ్రాహ్మణులు నాశనము జేయగా, ప్రజాభ్యుదయమును నశింపజేయు బ్రాహ్మణులను, బ్రాహ్మణ మతమును యేనాడో నామరూపాములు లేకుండా నశింపజేయవలసినది. "తలస్యాం ఉమ్మతెం విషం" యని వారే చెప్పుచున్నారు.

ఫాహియాను హిందూదేశమునంతయు పర్యటన జేయుచూ అప్పటి హిందూదేశ చరిత్రను లిఖించెను. మన కిప్పుడు ఇతని వ్రాతలే అప్పటి చరిత్రకు ముఖ్యాధారములు.

బ్రాహ్మణులు హిందూదేశ చరిత్రను వ్రాయకపోగా వ్రాసి పెట్టిన చరిత్రలను నాశనముజేసిరి. ఏలన ప్రాచీనకాల హిందూదేశ చరిత్రమంతయు ఆర్యులు(బ్రాహ్మణులు)దుష్కృత్యములతోను, కుతంత్రములతోను నిండి యున్నందున, యిట్టి చరిత్ర ప్రచార మందుండిన తమకు గౌరవహాని సంభవించునని చరితముల మరుగుపరచిరి. కాన విదేశీయుల చరిత్రలే మనకు ప్రమాణగ్రంథములు. కొందరు పాశ్చాత్యులు మన దేశము జొచ్చి చరిత్రకై పరిశోధనలు జరుపుచుండ, ఆర్యుల సత్య విషయముల జెప్పి వారిచే లిఖింపజేసిరి. అందువలన నట్టి చరిత్రలు గర్హనీయములైనవి.

ఫాహియాను తన యాత్రావృత్తాంతమును పట్టువస్త్రములపై వ్రాసికొనెను.

బౌద్ధమత విప్లవ పరివర్తనచే గలిగిన హిందూ(బ్రాహ్మణేతర) సంస్కృతిని చక్కగా వర్ణించెను.

అశోకుని బౌద్ధమత దీక్షకు, అతనిరాజ్య పరిపాలనాకౌశల్యమునకు, అతనిచే యభ్యుదయ మందిన హిందూదేశ సౌభాగ్యమునకు ఆనందాశ్రువులు రాల్చినాడు. అశోకుని సౌధము గాంచి "ఇది మనుష్య నిర్మితమా?" యని ఆశ్చర్య పులకాంకితుడయ్యె.

ఇతని కాలమున చంద్రగుప్త విక్రమాదిత్యుడు పాలనజేయు చుండె.

చంద్రగుప్త విక్రమాదిత్యుడు బౌద్ధుల సంహరించి, బౌద్ధమత నాశన కారకుడయ్యెనని తెలిసి అతని పేరునే యుచ్చరింపలేదు.

ఇతడు స్వయముగా బౌద్ధమత నాశనము చెందిన ప్రదేశముల వీక్షించినాడు. అశోక, కనిష్క సామ్రాట్టుల కాలమున అతులిత వైభవమునందిన బౌద్ధ క్షేత్రములు నిర్జన ప్రదేశములై పాడు వడినవి.

గౌతముని జన్మస్థానమైన కపిల వస్తునగరము పాడుబడినది. కోసల రాజ్యమునకు రాజధానియై, బుద్ధుని కాలమున మహాపట్టణమై, మహోన్నత వైభవమందిన కపిలవస్తునగరమున యున్నారు కుటుంబములైన గానరాకున్నవని ఫాహియాను విశేషముగా దుఃఖించెను.

కాన చంద్రగుప్త విక్రమాదిత్యునిచే బౌద్ధమతము సర్వ నాశనము జేయబడినది ఇక్కాలమున బౌద్ధమతము కొన యూపిరితో మారు మూలలల దాగి యున్నది.

అనేక బౌద్ధ గ్రంథముల దహన మొనరించెనని విన్నవాడై విశేషముగా దుఃఖించి, విచారముతోనే వెళ్లెను.

ఇట్టితడు లభించిన బౌద్ధ గ్రంథముల గైకొని సింహళమునకు వెళ్లెను. ఇచ్చట రెండు వత్సరములుండి, బౌద్ధ గ్రంథముల పరిశోధించి, కొన్నిటి గైకొని, చీనాపోవు వర్తక నావపై స్వస్థానమునకు మరలెను.

మార్గ మధ్యమున 13 దినములు భయంకర తుపాను వీచెను. "గోరు చుట్టుపై రోకటి పోటనునట్లు, నావకు చిన్నరంధ్ర మేర్పడి, నీరులోనికి రాజొచ్చె. అంత యాత్రికులందరు తమకున్న సామానును సముద్రములో పారవేయుచుండిరి. ఫాహియాను కూడా తనకున్న సామాగ్రి పారవైచెను కాని తానింతకష్టపడి తెచ్చిన బౌద్ధగ్రంథముల రక్షించు టెట్లాయని విలపింప సాగెను. అంత తనమనంబునకట్లు తలపోయసాగె. "ప్రకృతి యందు న్యాయము, ధర్మము వున్న యెడల

నాపడి హేను వత్సరములు శ్రమ ఫలించి, బౌద్ధ గ్రంథములు, సురక్షితమున చీనా దేశము జేరుగాక ! యనిరోషావేశమున ప్రకృతిని నిందించుచూ బుద్ధమహాను భావుని స్మరించుకొనుచూ "నేను చేయునది ధర్మము కాని యధర్మము కాదె ? కాన బౌద్ధ గ్రంథము లెందుకు రక్షింపబడవు ?" అను విశ్వాసముతో సురక్షితముగ చీనా దేశము జేరుకొనెను. అంత నతని యానందమునకు మేర లేకుండెను.

ఇంతటి బౌద్ధమత నాశకులైన గుప్తవంశజుల సామ్రాజ్యము త్వరలోనే అస్తమించినది.

విక్రమాదిత్యుని కుమారుడు కుమారగుప్తుడు 413 న సింహాసన మలంకరించెను. ఇతడు బౌద్ధుల హింసించినట్లుగ పడుట లేదు. ఏలన హూణులు దండయాత్రలు సలుపుటచే వారితో పోరుసల్పుటయే సరిపోయినది. ఇతనికుమారుడు స్కందగుప్తుడు. (455–480) యితనితో గుప్తసామ్రాజ్య మస్తమించినది.

## మాళవ సామ్రాజ్యము

శక, హూణాది విదేశీయులగు తురేనియనులు గుప్త సామ్రాజ్యమును నశింపజేసి తాము రాజులైరి. వీరు బౌద్ధమతస్థులగుట చేత, గుప్త వంశజులు బౌద్ధమతమును నశింపజేయుటం జేసి, గుప్త సామ్రాజ్యము అస్తమించినది.

తోరమానుడను హూణ నాయకుడు 495 న గుప్త వంశజుడైన బాలాదిత్యునిపై దండెత్తెను.

మాళవము పాంచాలము మున్నగు వానిని జయించి రాజయ్యెను. ఈ తీరమానుని కుమారుడు మిహిరకులుడు.

తండ్రి కంటెను యితడు కడు సమర్థుడు, అత్యంత శూరుడు, రణపిపాసి, ఐనందున ప్రక్కనున్న రాజ్యములపై దండెత్తెను. అంత బాలాదిత్యుడు, యశోవర్మ, విక్రమాదిత్యుడు మున్నగు రాజులందరు నైకమత్యమున మిహిరకులుని వోడించి బంధించిరి. బాలాదిత్యుడు

శైవాభిమాని, కుమారులు బౌద్ధాభిమాని, యైనందున నితనిని నిర్బంధించక దేశమునుండి వెడల గొట్టిరి.

అప్పటి రాజులలో యశోధర్ముడు బలశాలియై గుప్త వంశజుల నోడించి, మాళవ సామ్రాజ్యమును జయించి, వుజ్జయినీ రాజధానిగా నొనర్చి 533 న సింహాసనారూఢుడయ్యె. ఇతడు యింకను యనేక రాజ్యముల జయించి "విక్రమాదిత్యుడ"ను బిరుదము వహించెను.

ఇతడు దుర్మార్గుల శిక్షించెనేగాని బౌద్ధుల హింసింపలేదు.

విక్రమాదిత్యుని కుమారుడు *శిలాదిత్యుడు ఇతడు సుగుణ సంతుడు సజాతీయులనే విజాతీయులను గౌరవించువాడు.

బౌద్ధ ఆ గ్రంథములను సద్దృష్టి చూచినప్పటికి, సత్య, ధర్మ బౌద్ధమతాభిమాని.

స్థానేశ్వర రాజగు ప్రభాకరవర్ధనుని జ్యేష్ఠపుత్రుడు రాజ్యవర్ధనుడు శిలాదిత్యునిపై క్రీ. శ. 605 న దండెత్తి పూర్తిగా వోడించెను. అంతటితో మాళవ సామ్రాజ్య మస్తమించెను.

## హర్షవర్ధనుడు

ఈ రాజ్యవర్ధనుడు గృహము జేరకమునుపే శత్రువులచే సంహరింపబడెను.

ఇతని తమ్ముడు శ్రీహర్షుడు వుజ్జయినికి 606 న రాజయ్యెను. ఇతని జన్మకాలము 5 0 యైనందున పట్టాభిషేక కాలమునకు 16 సంవత్సరములు. ఇంతటి శౌర్యాయముగల రాజు మరొకడు లేడు.

---

* ఈ కాలమున ఆరేబియా యందు మహమ్మదు ప్రవక్తగలడు. ఇతని సిద్ధాంతముల విశ్వసించువారు మహమ్మదీయులు,

ఏసువలె యితడును యేకేశ్వరోపాసన బోధించి సంఘమును ఒక మార్గమునకు తెచ్చెను.

ఇతడు బాలుడైనందున అనేక రాజులు దండెత్తుటకు వేచి యుండిరి. ఐనప్పటికి సాహసవంతుడైన హర్షునకు శత్రువులన్న జంకు గొంకు యుండెడిదికాదు.

దరిమిలా యితడు సైన్యాభివృద్ధిజేసి రాజ్యపిపాసియై, ఆరువత్సరములు ఘోరయుద్ధము నొనరించి అనేక రాజ్యముల జయించెను. తుట్టతుదకు చాళుక్య చక్రవర్తియైన రెండవ పులకేశి నర్మదానది యొడ్డున పూర్తిగా ప్రతిఘటించినందున, నర్మదానదియే దక్షిణ సరిహద్దుగా నెంచి, స్వస్థానమునకు మరలివెళ్ళెను ఇది మొదలుకొని తన జీవితమున మరొక యుద్ధము చేయలేదు.

హిమాలయము మొదలుకొని నర్మదానదివరకు నేపాళమును, పశ్చిమమున మాళవ, ఘూర్జర, సౌరాష్ట్ర దేశములను, తూర్పున కొంత నతనియాజ్ఞకు లోనై యుండెను.

ఇవ్విధముగ సామ్రాజ్యము. విస్తరించి "చక్రవర్తి" బిరుదము పొంది నిశ్చింతతో రాజ్యపాలన జేయుచుండె.

శ్రీహర్ష చక్రవర్తి సార్వభౌముడు బౌద్ధాభిమానియై "మూడవ యశోకు"*డని కీర్తి పొందెను.

బౌద్ధులకు రాజాదరణ లభించుటకిదియే కడసారి.

చీనా పరివ్రాజకుడగు "హుయాన్ సాంగు" బంగాళమున హర్షుని కలిసికొని బౌద్ధ ధర్మముల యుపదేశించి, ♦నాల్గవ పరిషత్ జరుపవలసినదిగా కోరెను. అందుకు హర్షుడు సమ్మతించి కన్యాకుబ్జమున సభజరుపుటకు నిర్ణయించెను.

బ్రహ్మాండములైన యేర్పాటులు జరిగినవి. దేశ విదేశములందు గల రాజులను, బౌద్ధులను రావలసినదిగా ప్రకటించెను.

---

* అశోకుడు రెండవ అశోకుడు కనిష్కుడు మూడవ యశోకుడు హర్షుడు

♦ I వ పరిషత్ బుద్ధుని మరణ వత్సరమున 2 వ పరిషత్ అశోకునిచే 3 వ పరిషత్ కనిష్కునిచే 4 వ పరిషత్ హర్షునిచే.

అనేక స్వతంత్ర రాజులు, సామంత రాజులు, అనేక వేల మంది బౌద్ధ భిక్షువులు, జైనులు, బ్రాహ్మణులు, చూడ వచ్చిన అసంఖ్యాక ప్రజానీక జనసమూహాముకు మేర లేకుండెను.

కన్యాకుబ్జమున నొక విశాలమైన సభామంటపము నిర్మింప బడినది. దీని సన్ముఖమున నూరడుగుల గోపురము నిర్మాపబడినది. అందు బంగారు బుద్ధ విగ్రహమును నెలకొల్పిరి. అది రాజెంత యెత్తుండెనో అంత యెత్తుండెనట 3 అడుగుల బంగారు బుద్ధ విగ్రహాముము ఉత్సవ సమయమున ఉత్సవ విగ్రహముగా గైకొనిరి.

644 వ వత్సర నిర్ణీత దివసమున పరిషత్ ప్రారంభమైనది. శ్రీహర్ష చక్రవర్తి మహోత్సవముతో సభాప్రవేశ మొనరించెను.

రమ్యమైన రత్న ఖచిత యంబారి గజ శ్రేష్ఠునిపై నిర్మించిరి. ఆ యంబారియందు బుద్ధ విగ్రహము నుంచిరి. కుడి వైపున దేవేంద్రుని వేషముతో హర్షుడు, బుద్ధ దేవునకు ఛత్రము పట్టుచుండెను. కామరూప రాకుమారుడు బ్రహ్మవేషధారియై వామభాగమున చామరము వీచుచుండెను.

హుయాన్‌సాంగు, రాజులు సామంతరాజులు వెనుక గజారోహణులైరి. తదితర పరివారము అశ్వారూఢులైరి. వీరివెనుక ప్రజానీకము వెంబడించిరి.

ఇట్లు కోలాహలముగా హర్షుడు బయలువెడలి అడివిలునగలిన సువర్ణమును, ముత్యములను, మణులను వెదజల్లుచుండెను.

శ్రీహర్ష చక్రవర్తి తనహస్తములతో విగ్రహమునకు స్నానము జేయించి, తనభుజబములపై మోసుకొని నిశ్శి గోపురము నందుంచెను.

ఇట్టి సమయమున యార్యులు(బ్రాహ్మణులు) బుద్ధునకు జరుగు గౌరవ మర్యాదల సహించనేరక. హర్షుని హత్య జేయుటకై ప్రయత్నింప, బంధింపబడి శిక్షితులైరి.

పరిషత్తులు సభామంటపమున నుచితాసనములపై నందరును నధిష్ఠించిరి. అంతహర్షుడు సభాసదుల గౌరవించి హ్యూయాన్‌త్సాంగును అధ్యక్షపీఠ మలంకరింపజేసి సభాకార్యక్రమమును నడిపెను. అందు బౌద్ధమత వాదవివాదములు చర్చించబడెను. ఇవ్విధమున పరిషత్తు ముగిసెను.

హర్షవర్ధనుడు రమారమి నలుబది వర్షములు రాజ్యపాలన జేసి క్రీ. శ. ౬౪౭ లో కీర్తి శేషుడయ్యెను.

దరిమిలా శకవంశజులైన విదేశీయులు దండెత్తి రాజపుతానా, గుజరాత్‌ను, దక్షిణ దేశముల కొన్నిటిని జయించి రాజ్య పాలన జేయుచూ హిందువులైరి.

## కుమారిల భట్టు

అయ్యవి యెన్నికుతంత్రము లొనరించినను బౌద్ధమతమును సంపూర్ణముగా నశింపజేయ జాలకుండిరి, ఇట్టి సమయమున బౌద్ధుల నాదరించు రాజులేరయ్యె. ఇదే మంచి సమయముగా గన్పట్టినది. కాని ప్రజలా బౌద్ధమతాసక్తులై యుండిరి. కాన కర్తవ్య రహితులై విచారమున నుండిరి.

అంత కుమారిల భట్టను ఆర్య సంతతివాడు గొప్ప సంస్కృత పండితుడై, సర్వశాస్త్రముల వీక్షించి, గత చరితమునంతయు దిలకించినవాడై బౌద్ధమతమును నశింపజేయుటెట్లు ? యని వితర్కించుకొని, జైన వేషమున జినాచార్యుల వద్ద తన్మతరహస్యము లెరిగి, బౌద్ధ వేషమున బౌద్ధాచార్యుల నొద్ద తన్మత రహస్యము లెరిగి "ప్రపంచమున గల పండితులలో శ్రేష్ఠుడననియు, నన్ను జయించు వారలెవ్వరీ జగమున లేరని" రాజుల నొద్ద మొర బెట్టుకొనుచు, తమరు పరీక్ష జేయదలచిన నాతో వాదమునకు, బౌద్ధ జైనులను రప్పించి, న్యాయము జరపుడని ప్రార్థింప, రాజులు జోక్యము కలిగించుకొనక వచ్చిన దారి పట్టుమనిరి. పట్టిన పట్టు వీడక అనేక రాజుల వద్ద మొర బెట్టుకొనుచుండెను.

అంత మేదినీపుర (మిడ్నాపూర్) రాజైన సుధన్వుడను రాజు వాని మొర యూలకించి. అట్లే బౌద్ధ జైనులరావించి సభయేర్పాటు గావించెద ననెను.

అంత బౌద్ధ జైనాచార్యులు వాదము సల్పుటకై రాగా, "తమ శిష్యుడనని మత రహస్యము లెరింగిన కుమారిల భట్టును, జూచి మౌనమున మరలివెళ్ళిరి. అంత సుధన్వుడు వాదముసల్పుటయందస మర్ధులుగాన మరలివెళ్లినని వూహించెను. ఇతని వూహ ప్రకారము అస మర్థులైన సనలు రాకుండెడివారే.

కుమారిల భట్టు గురుద్రోహియైన విషయము రాజునకు తెలియక, ఇతడే గొప్పవాడని భావించి కుమారిలుడు చెప్పిన ప్రకారము యాచరించెను. తత్ఫలితము లేవన: బౌద్ధసిహాసనముల పడగొట్టుట,బౌద్ధ విద్యాలయముల నశింపజేయుట,గ్రంధముల దహనము జేయుట, బౌద్ధ దేవాలయముల రూపు మాపుట, బౌద్ధ జైనుల చిత్రవధ జేయుట మున్నగు విధముల బౌద్ధమతము ఘోరాతి, ఘోరమున హింసింప బడుచున్నది.

అంత కుమారిలభట్టు ప్రధమ దోషము గురుద్రోహి, ద్వితీయ దోషము వర్ణింపరానిది. ఐనందున శత్రువులచే సంహరింప బడుట కంటె ఆత్మహత్యే వుచితమని కార్య నిమగ్నుడై యుండె.

## శంకరాచార్యులు

ఇట్టి సమయమున మళయాల బ్రాహ్మణుడగు శంకరాచార్యు లసమాన పాండిత్య బలమున తన్నెదిరించువారిజ్జగంబున కలరా? యని విర్రవీగుచుండెను.

అంత కుమారిల భట్టను వాడు కలడని తెలిసికొని తక్షణమే అతని యొద్దకు వెళ్ళి, నాతో వాదమునకు రావలసినదని కుమారి లుని యెదిరించె. అంత కుమారిలుడు "శంకరా! ప్రస్తుత పరిస్థితి నాలకించి మన వైదిక మతమును స్థాపించుటకు బయలు దేరుము.

మనలో మనము వాదము సల్పుకొనుచూ కూర్చుండిన ప్రయోజన మేమి?" యని గత చరిత్రమునంతయు శంకరునికి బోధించి తుషాగ్ని పడి ప్రాణముల విసర్జించెను.

అంత శంకరాచార్యులు సుధన్వు నొద్దకు వెళ్ళి, కుమారిల భట్టు పంపున నొచ్చినాడనని చెప్పి రాజాదరణ పొందెను.

శంకరుడు బ్రాహ్మణ (ఆస్తిక) మతస్థాపకుడై, రాజ సైనికుల వెంట నిడుకొని, తన శిష్య పరివార సహితముగ బ్రహ్మాండ యాత్ర జేయుచూ కనుపించిన బౌద్ధ విహారముల, స్తూపముల పడగొట్టుచూ, తమ దేవాలయముల ప్రతిష్ఠించుచూ, బౌద్ధుల చిత్ర వధ జేయుచూ, తమ శిష్యుల కధికారమిచ్చుచూ యివ్విధమున హిందూ దేశమంతయు పర్యటన సలిపి బౌద్ధమతమును, నామరూపాదులు లేకుండా నశింప జేసెను.

ఈ సమయమున కొందరు బౌద్ధులు, రహస్యమున నుంచిన బౌద్ధ గ్రంధముల గైకొని సింహళమునకు పారిపోయిరి.

ఇవ్విధమున హిందూ దేశమున నుచ్ఛ్రయిల్లిన బౌద్ధ మతము హిందూ దేశమున నామరూపాదులు లేకుండా బలాత్కారమున విదేశములకు వెడలగొట్ట బడినది. విదేశములందు నేటికిని సురక్షిత మున గలదు.

శంకరుడివ్విధమున బౌద్ధమతమును నశింపజేసి బ్రాహ్మణ (ఆస్తిక) మతస్థాపనజేసి, తమతమ చిహ్నములుగా నాలుగు మఠముల నేర్పరచెను.

ఈసమయమున "కర్మ్య" లన్న ప్రజలకు యార్యులే నుండు నని "బ్రాహ్మణ" నామధేయులైరి. వారు వైదికులు, నియోగులని యిరుతెగలు. బ్రాహ్మణ (ఆస్తిక) మతమును రక్షించువారు వైదికులు. రాజకీయ వ్యవహారులు నియోగులు.



ఈ సమయమునసే, రామాయణ, భారత, భాగవత ముల నుండి కథావస్తువుల గ్రహించి, అనేక అసత్యపూరిత పురాణ, వుప పురాణాది గ్రంథముల సెన్నింటినో రచించిరి.

గ్రామ గ్రామమున దేవాలయముల సృష్టించిరి. వీనిమహాత్తు పురాణములందు జెప్పిరి. వాళ్లనుపూజింప వలయుననిరి. సమస్త వాంఛములు కలుగునవిరి. ఇంకను మోక్షము లభించుననిరి. ఇట్లు ముక్తి నందినవారున్నారు పురాణముల జూడమనిరి. ఇవ్విధమున ప్రజలను అజ్ఞానాంధ కారమున ముంచివేసిరి.

బౌద్ధ యుగమున అస్పృశ్యులు బౌద్ధమత స్వీకరణచే యార్యులవమానముగా నెంచి, అనేక నిర్బంధముల సృష్టించిరి.

"గ్రామమునందు అడుగిడుటకు అర్హులు కారు. మాకార్య నిమిత్తమై మేము పిలువనంపిన రావలయును. అదెట్లనగా, నడుము నకు వెనుక పంజావంటి చీపురు పట్టుకొనవలయును. తద్వారావారు నడచిన మార్గము శుద్ధియగును. మరియు వీరిని నీచాతి నీచమున చూడవలయును. వీరి ముఖము చూడరాదు. వీరిగాలి సోకరాదు ? వీరు అంటరానివారు !! వీరు చెప్పరానివారు !!!

అంత స్పృశ్యులు క్రోధోన్మత్తులై, దీని కంతకూ కారణము శంకరుడు గదాయని, శంకరుని హత్య జేయుటకై కొందరు వేచి యుండిరి.

నిత్యాను సారము నిత్య కృత్యములకై శంకరుడు గంగానది నుండి వచ్చుచుండ అస్పృశ్యు లడ్డగించి "నీవు మా యెడల జేసిన యపచారమునకు తిమను గౌరవించుచుంటి" మని బాకుల వెలికి దీసిరి. అంత శంకరుడు తన తప్పిదమునకు పశ్చాత్తాపము జెంది, "అన్యాయము జేసిన వాడ యస్పృశ్యులకు; వారు నన్ను వధించుట న్యాయము. కాన అన్యాయమునకు బలియగుటకంటె న్యాయమునకే బలియగుట యుచిత" మనుకొని "క్షమించుడీ! తక్షణమే గృహము

జొచ్చి మీాపైనున్న మరతుల నిషేధించెన.* నని బాస చేసి గృహమున కువెళ్లి మనీషాపంచకమున నిట్లు వ్రాసె.

"నేను (శంకరుడు) స్నానము జేసి వచ్చుచుండ, యెవరో ఒక సామాన్య వ్యక్తి యెదురుపడెను. అంత నేను "దూరముగా తొలగు ఛండాలా" యంటిని. అంత నాతడు "ఎవరుస్వామి? ఛండాలుడు? పాంచభూత భౌతికమైన నా దేహమా? లేక పరబ్రహ్మ స్వరూపుడనైన నేనా?" యని ప్రశ్నించెను. ఇతడెవరో మహాత్ముడు. యీా వేషమున నాకు జ్ఞానబోధ జేయుటకై వచ్చెనని, నమస్కరించి "క్షమింపు"డని ప్రార్థించితిని. కాన అస్పృశ్యులపై నింతటి కఠినమరతు లుంచుట పాడిగాదు. కాన నామరతు లన్నింటిని నీక్షణముననే రద్దుచేయు చుంటిని.

ఈవార్త బ్రాహ్మణులందరు దెలిసి "ఇదేమి శంకరాచార్యు లున్మత్తులైరి." యని గగ్గోలుపెట్టిరి. అంత బ్రాహ్మణ సంఘము "నీనిశ్చితాభిప్రాయ మేమ"ని ప్రశ్నించిరి. అంత శంకరాచార్యులు "నానిశ్చితాభి ప్రాయమిది—అస్పృశ్యులును మానవ జన్మమెత్తిరి. వారి దేహ ప్రకృతియు మన దేహ ప్రకృతియు సమంబు. ఏతత్కారణంబున వారిని అస్పృశ్యులుగా (అంటరానివారిగా) జేయుట మహా దోషము."

అంత బ్రాహ్మణులందరు మరనపడి యితడు జీవించియున్న ప్రమాదము వాటిల్లగలదని, నొక రేయిహత్యజేసి శవమునుఖననము జేసిరి. అంత కొన్నిదినసంబులకు "శంకరాచార్యు లేరని" ప్రజలకుగ యివ్విధమున నచ్చజెప్పిరి. "శంకరాచార్యులు శివుని యవతారము. కాన శివునకు విశేషకార్యము లుండుటంజేసి తాను (శంకరాచార్యులు) హిమవత్పర్వతమేగి శివునియందు లీనమైరి."

శంకరుడు తన వారిచే ఖూనీ చేయబడినందున యితని జీవిత కాలము 32 వత్సరములే.

ఇతడు పదివత్సరములు పరమత ఖండనము. స్వమత మండనము జేయుచూ, అనేక గ్రంథములు రచించెను.

---

వ్యాసకృత వేదాంత సూత్రములను, దశోపనిషత్తులకు, భగవద్గీతకును భాష్యములు రచించెను. వీనికి ప్రస్థానత్రయమని పేరు.

ప్రాచీన కాలమున ప్రజలు జీవించుటకై ప్రకృతి పోరాటమున విశేష కష్టముల బొందవలసి వచ్చినది. అందు నిమిత్తమై బుద్ధుడు, వారి కష్టములవలన కలిగెడు మానసిక బాధను నశింపజేయుటకై కష్టాలు, దుఃఖాలు తాత్కాలికమని బోధించాడు.

శంకరాచార్యులు యీనైరుధ్యాన్ని, ఆధారంగా తీసుకొని బుద్ధుని భావవాదిగా పక్షించాడు.

"తాత్కాలికం అనుకునది నిత్యం కాజాలదు. దుఃఖం, విచారము మున్నగునవి కేవలము మానసిక సంబంధమైనవి. వీనికి భావ రూపంలో తప్ప ప్రత్యేక అస్తిత్వం లేదు. కాన వీనికి భౌతిక పదార్థం కారణ భూతం కాజాలదు."

బుద్ధుడు దుఃఖమును దూర మొనర్చుటకు నిర్వాణ వాదము చెప్పినాడు.

"అణువులు వాటంతటవే సృష్టి కార్యానికి వుపక్రమించవు. అణువులే సృష్టికి కారణమైన, యీ పరిస్పందనాల సర్వావస్థ లందును చలన స్వభావాన్ని కలిగి వుండాలి. నిర్వాణమంటే చలన రహితం."

బుద్ధుని సిద్ధాంత ప్రకారము అణువులు చలన స్వభావాన్ని కలిగి, వాటంతటవే కారణ కార్యములు పొందును కాన శంకరుడు చూపినట్లుగా భౌతిక ప్రకృతి చలన రహితం కాజాలదు. దానికి ఆద్యంతములు లేవు.

అంత శంకరుడు అద్వైత స్థాపనకు యిద్విధమున తత్వవిచారణ జేయ ప్రారంభించాడు.

"నామరూప వికారాదులు లేని చేతనం (పరబ్రహ్మ) నుంచి, నామరూప వికారములున్న జగము బయలు దేరిన దనుటకు వీల్లేదు రెండు వస్తువులు సమాన ధర్మములు కలిగి యున్నప్పుడే కారణ—కార్యము లుత్పన్నమగుట కవకాశము కలదు. కాన

చేతనంనుండి జడము వచ్చుటకు వీల్లేదు. జడం చేతనంనుండి వచ్చిందంటే చేతనం జడత్వం పొందితీరాలి. అంటే రెండూ సమానధర్మములు కలిగి యుండాలి. కాన చేతనం తన అస్థిత్వాన్నే కోల్పోతుంది."

"జడం—చేతనం రెంటికీ భేదముశూన్యము." వీనిరెంటికీ భేదము చూపటమే శంకరుని లక్ష్యము.

"జడం—చేతనం పరస్పర విరుద్ధములు కలిసియున్నవి కాన జడచేతనాల్ని తెలుసుకోవాలంటే, జడం చేతనంకావాలి అట్లుగాక చేతనం అనాదినుంచి మరొకదాన్ని కలిగివున్న, ద్వైత్వమును అంగీకరింపవలయును. ఈద్విత్వం అంగీకరిస్తే "పరమాత్మను తెలుసుకుంటే సర్వము తెలిసి కొన్నట్లే అనే ప్రమాణమునకు అర్థ్యమే లభింపదు. కాన చేతనం తోపాటు, అదే (చేతనం) మరొక రూపంలో అనాది నుంచి వస్తున్నదనటానికి ప్రయత్నిస్తాడు. ఇందువలన అసలు విషయము బోధపడదు.

శంకరుడు భాష్యమును యిలా ఆరంభిస్తాడు

"చేతనం — జడం సర్వదాభిన్నములే. ఒక దాని కొకటి పగలు - రాత్రి కున్నంత భేదము కలిగి వున్నాయి. కాన వీని రెండింటినీ ఒకటేయనుటకు వీల్లేదు."

ఈద్వైత్వంనుంచి ఏకత్వాన్ని నిరూపించటమే శంకరుని లక్ష్యము.

కపిలో ప మాత్మ ఖనహో మరొకటి లేదని యంగీకరించిన, ఆకాశ, వాయు, అగ్ని, జల, భూమ్యాదులు పరమాత్మనుండి సృష్టింపబడినవని యంగీకరింపవలయు. అట్లు అంగీకరించిన పరమాత్మను నిర్వికల్పుడు, నిర్గుణుడు, నిరాకారుడు అనే వాదన కాస్కారమే లేదు ఏతద్భిన్నముగా పంచ భూతాలు పరమాత్మ తోపాటు అనాది యని యంగీకరించిన, పరమాత్మ ఒక్కటే అనాది (స్వయంభూ) అనే సిద్ధాంతమునకు అస్థిత్వమే లేదు. కాన దేనిని

యంగీకరించి, దేనిని త్రోసి వేసినను వేద మతమునకు హాని కలుగుచున్నది. ఈ చిక్కునుండి శంకరుడు వేదాంతాన్ని రక్షించ టానికై యిలా ప్రయత్నిస్తాడు.

"పరమాత్మ నిర్వికల్పుడు, నిర్గుణుడని నిరూపించాలంటే, పంచ భూతములు అనాది యని చెప్పాలి. ఇందువలన పరమాత్మ కలుష రహితం కావాలంటే పంచ భూతములు పరమాత్మ స్వరూపమేనని చెప్పాలి. వేదం ప్రకారం, కారణ – కార్యాలు ఒకటే యని యంగీ కరించిన యీ విభేదం వుండదు. పంచ భూతములు (ఆకాశ, వాయు, అగ్ని, జల, భూమి) పరమాత్ముని కార్యాలు కాకపోతే, పరమాత్ముని తెలుసుకున్నంత మాత్రమున వీనిని తెలిసికొనలేము. కాన ఆకాశం మున్నగునవి అనాది వస్తువులని యంగీకరించిన వేదాధికారం తొలగు తుంది. కాన యీ వాదము అంగీకరించటానికి వీల్లేదు.

ఈ వైరుధ్యాల నన్నిటినుండి తప్పించుకోవటానికి శంకరుడు మాయావాదాన్ని (వేద సూత్రాల్లో కాదు) సృష్టిస్తాడు.

"పరమాత్మనుండి అవిద్య (మాయ) అనే శక్తి కలిగింది. ఈ మాయాశక్తే ప్రపంచ సృష్టికి కారణ భూతము, ఈ శక్తిని చేతనం అనటానికి వీల్లేదు. "చేతనం" అంటే "పరమాత్మ" ఒక్కడికే చెందుతుంది. ఈ మాయాశక్తిని చేతనమనిస్తే పరమాత్మ యింకొక దానిని కలిగి వుండవలసి వస్తుంది. అప్పుడు పరమాత్మ "అనాది" యనే వాదము దెబ్బ తింటుంది. ఈ శక్తి "అచేతనం" అనటానికి వీల్లేదు. అచేతనం నుంచి యేదీ సృష్టింపబడటానికి వీల్లేదు

కాన యీ మాయాశక్తి (అవిద్య) చేతనం కాదు. అచేతనం కాదు. "అనిర్వచనీయం." ఐనప్పటికీ మాయ, ప్రకృతికి వుపాదాన కారణముగా చూపబడ్డది. మాయ పరమాత్మని శక్తిగా జెంది యుంది. మాయ పరమాత్మతో కలసి యున్నది గాన, మాయ యందు ప్రతిఫలించిన ప్రకృతి పరమాత్మకే జెందుతుంది."

ఈ సిద్ధాంతరీత్యా "పరమాత్మ ఒక్కడే యనాది" అనే వాదన దెబ్బ తింటుంది. పరమాత్మ నిర్గుణుడు. అయినా 'మాయాశక్తి ఆపాదింపబడింది. కాగా మాయ కూడా పరమాత్మతోపాటు అస్తిత్వం కలిగి యున్నదని చెప్పబడుతూంది. ఇచ్చట ద్వైత్వం గోచరిస్తూనే యున్నది.

భిన్నత్వంనుండి, ఏకత్వం నిరూపించటమే ఆధ్యాత్మిక శాస్త్ర ఘనతగా భావించబడింది. ఇందువల్ల పరిష్కరింపవలసిన సమస్యలు పరిష్కరింపబడలేదు. ఆధ్యాత్మిక శాస్త్రమంతయు వూహాలేకాని సిద్ధాంతములు కావు.

"భౌతికమైన ప్రకృతికి అభౌతికం కారణం కావటం తర్క బద్ధం కాదు."

ఈ విషయాన్ని ఋషులనుండి శంకరాచార్యుని వరకూ, యే ఆధ్యాత్మిక శాస్త్ర వేత్త కూడా, సహేతుకంగా, అభౌతకము నుంచి భౌతిక పదార్థాలు యెలా సృష్టింపబడినవో వ్యాఖ్యరూ నిరూపించలేదు. ఈ అజ్ఞానావస్థే తుట్ట తుదకు "మాయావాదం"గా పరిణమించింది.

ఉన్న వ్యవస్థనే రక్షింపవలయునను తత్వ శాస్త్ర వేత్తలు బయలుదేరినందున తర్కబద్ధమైన హేతువాదము నశించి నాలుగుస్థంబాలాటగా తిరిగినచోటె తిరుగుచూ తత్వ (ఆధ్యాత్మిక) శాస్త్రం ముందుకుపోలేక అజ్ఞానావస్థలోనే వుండిపోయింది.

శంకరుడు భౌతికవాదుల నెదుర్కొని భౌతికవాదాన్ని ఖండించటంలో పూర్తిగా విఫలుడయ్యాడు. వేదాంత సూత్రాలకు భాష్యముచెపుతూ రాత్రికి పగలుకున్నంత భేదము. ఆదిలోనే వస్తువులకు, వస్తు తత్వానికి వున్నదంటాడు. ఈవిధంగా ఆదిలో ద్వైతసిద్ధాంతముతో బయలుదేరినవాడై ఏకత్వాన్ని నిరూపించటానికి "మాయ వాద"ము సృష్టిస్తాడు.

వస్తుమాత్రపు "అస్థిత్వం" నిరూపించటానికి ప్రమాణ పూర్వకంగా రుజువు జేయనక్కర్లేదంటాడు. ప్రమాణపూర్వకంగా రుజువు జేయటానికి వీలున్న ప్రకృతి అస్థిత్వాన్ని "మాయ" యని త్రోసి వేస్తాడు.

శంకరుని అద్వైతవాదం అసలైన ఆధ్యాత్మిక వాదంకాదు. భౌతికవాదాన్ని తలక్రిందులుచేసి చెప్పాడు.

అతనిమాయా వాదంలోనే ప్రకృతి అస్థిత్వాన్ని కాదన లేక పోయాడు. అంటే మరొక రూపంలో శంకరుడు భౌతిక వాదాన్ని యంగీకరించినట్లే. కాని భౌతికవాదాన్ని ఖండించటమే తన గొప్ప దనముగా భావించి, ప్రకృతి అస్థిత్వాన్ని సహేతు పూర్వకంగా ఖండించుటకు విఫలుడై, తనలక్ష్య ప్రకారము ఏలాగైనా తన వాదాన్ని నెగ్గించుకోవాలని "ప్రకృతి మిధ్య అందుకు వేదాలు ప్రమాణం" అని ఒక్క కొండగుర్తుజెప్పి శంకరుడు దొడ్డి త్రోవను పడ్డాడు

వేదాంత సూత్రాల ప్రకారము "ప్రపంచం అస్థిరం" అని చెప్పబడింది. కాని బౌద్ధమతములోని భావవాదాన్ని ఖండించటానికై శంకరుడు వేదాంత సూత్రాలనే త్రోసివేస్తాడు.

"బహిర్గత ప్రపంచం ప్రత్యక్ష పూర్వకంగా కనబడుతుంది. కాన దాని "అస్థిత్వం" త్రోసి వేయటానికి వీల్లేదు. ప్రకృతి "అస్థిత్వం" లేదని చెప్పే భావవాదుల వాదనలు వినటము అనవసరము."

అయితే శంకరుడు "మాయా" వాదాన్ని గూర్చి చెప్పే టప్పుడు యెందుకు వినాలో ?

"ఒక వ్యక్తికే ఒక వృక్షాన్ని (చెట్టును) చూచినప్పుడు, అతని దృష్టికే గాక అందరి దృష్టిలోనూ వృక్షముగానే కనబడుతుంది. బహిర్గత ప్రకృతి అస్థిత్వం లేదనే వారికి కూడా వృక్షముగానే కన బడుతుంది. వస్తు వున్నప్పుడే భావం వుంటుంది. కాన బహిర్గత ప్రపంచం అస్థిత్వాన్ననుసరించి, మానసిక అస్థిత్వం వుంటుంది. కాన

యీ బహిర్గత ప్రపంచ అస్థిత్వాన్ని త్రోసి వేయటానికి యెవరూ సమర్థులు కారు."

భావవాదంమీద దండెత్తినపుడు భౌతికవాదం చేపట్టాలసి వచ్చింది. అందువలన తనకు తెలియకుండానే తన సిద్ధాంతాలను ఖండించుకున్నవాడయ్యాడు. కాని యీ విషయాన్ని అధిక సంఖ్యాకులు గ్రహించనందున ఆ సిద్ధాంతాలనే అజ్ఞానులై అంధ విశ్వాసమున విశ్వశిస్తున్నాడు. శంకరుని * అద్వైతవాదమును హేతువాదముతో విమర్శించిన అస్థిత్వాన్నే కోలుపోతుంది.

శంకరునివరకూ తత్వశాస్త్రము పరస్పర విరుద్ధ భావాలు కలిగి యున్నందున, శంకరుడు భౌతికవాదాన్ని చేపట్టి పరమత ఖండనము జేయుచూ విజయం పొందాడు. కాని భౌతికవాదాన్ని చేపట్టకుండా, వేదమతాన్ని రక్షించే నిమిత్తమై శంకరుడు తప్పుడు మార్గాన్ని త్రొక్కవలసి వచ్చింది. అందువలన భౌతికవాదానికి వ్యతిరిక్తమున నుండునట్లు, తత్వశాస్త్ర విరుద్ధభావాలు నశింప చేసేందుకు మార్గమేమిటాయని యాలోచించి "మాయా" వాదాన్ని సృష్టించాడు.

ఈ మాయావాదమువల్ల అసలు విషయము పరిష్కరింప బడదు. ఇందువలన భౌతికవాదులను జయించినామని సంతోష పడ్డారు. తత్వశాస్త్ర విరుద్ధభావాలు నశించినందుకు ఆనందపడ్డారు. కాని విరుద్ధవాదాలను, భౌతిక (హేతు) వాదాన్ని నశింపజేసి, యీ "మాయావాదము" యెంతటి అజ్ఞానావస్థకు తీసుకువెళ్ళిందో మీరు గమనించలేదు.

* శంకరుని అద్వైత (మాయా) వాదాన్ని, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు పూర్తిగా ఖండించారు.







## మహమ్మదీయులు వొచ్చునప్పటికీ మన దేశస్థితి

బౌద్ధమతాన్ని నశింపజేసి బ్రాహ్మణవర్గము, ఆస్తికమతాన్ని పునరుద్ధరించుకుంది. ఇలా ఆస్తిక ప్రచారము జేయసాగారు.

ఇదివరకే వ్రాసియుంచిన రామాయణ, భారత, భాగవతము లను ప్రచారములోనికి తెచ్చారు. వీని ననుసరించి వ్యక్తికొక పురాణము రచించారు. వ్యాసుని పేరిట చలామణీ జేశారు. ఈపురాతన పుహపురాణముల పరిశీలించిన, వీనిని రచించినవారు మానవులా? పశువులా? యను సందియము కలుగక మానదు! ఇంతటి యజ్ఞానులు ప్రపంచమున మరొకరు వుండరు. ఈఅజ్ఞానమంతయు ప్రజలనెత్తిపై రుద్దిరి.

గ్రామగ్రామమున యీ బ్రాహ్మణ దేవతలనెలకొల్పి ప్రజలచే దేవాలయముల నిర్మింపజేసి, దేవునకు ప్రజలకుమధ్యవర్తిగా" దేవదూత" వైకానుకలు స్వీకరించెడివారు. వీరు ఆస్తికమతాన్ని ప్రచారము చేయటానికి పెక్కు విభాగములైరి.

1. పురోహితుడు—పురః + హితుడు = పౌరో హితుడు. పురము (గ్రామము) నకు హితమును కలుగజేయువాడు గాన పౌరో హితుడయ్యె.

హిందూ సంఘాన్ని "ఆస్తికత్వ" మనే ముక్కు త్రాడుతో బంధించి, బ్రాహ్మణ సంఘము తమ జీవనోపాధికి అనేక తప్పుడు (అసత్యములైన) సిద్ధాంతముల సృష్టించారు. ప్రజలను అజ్ఞానులుగా జేసినందున సమస్త యసత్య సిద్ధాంతములు విశ్వసించుచుండిరి. కాన ఆతప్పుడు సిద్ధాంతముల యాచరింప జేయుటకై "పౌరోహిత" నామ ధారులై గ్రామమున నొక కుటుంబము నివశించజొచ్చిరి.

వీరుచేయు హితబోధ లెవ్వియన —

ప్రజలను అజ్ఞానుల నొనర్చి కార్యము యొక్క సరియైన కారణము తెలిసికొన కుండునట్లు హేతువాదము నశింపజేసి, సమస్త కార్యముల కారణములు తమకే తెలియునని రి. తత్కార్యము లందు గల దోషముల పరిహార మొనరించి శుభము జేకూర్చ గలవని పంచాంగమును సృష్టించారు. ఇందువలన యేవ్యక్తి యేకార్యము జేయ దలచినను తమసలహాపై నాధారపడునట్లు ఆకర్షణశక్తి గలిగించారు.

మరియు దోషరహితమైన కాలమునకు దోషమాపాదించారు. అట్టిదోషకాలమున నే కార్యము జేయరాదనిరి. అట్లుజేసి నాతడు సర్వనాశనము జెందుననిరి. ఈ సిద్ధాంతములో వ్యక్తి జీవితకార్యముల తమ యధీనములో వుంచుకొనిరి

ప్రతివ్యక్తికి తమ కార్యములు నిర్విఘ్నముగా జయప్రదమొంద వలెనను తలంపు కల్గియుండుట సహజము.

ఒక గృహమును నిర్మింప వలయునన్న, ప్రయాణము చేయ వలెనన్న, రైతు ప్రథమున నే కార్యము జేయవలయునన్న తుట్ట తుదకు క్షురకర్మపైనను వీరి లగ్న ప్రభావము ప్రసరించినది.

అట్టి మొదల కొంత కాలము "దోష"మని యాపాదింపబడి నందున "మంచి" (లగ్నము) కొరకు పురోహితుని యాశ్రయించుట ప్రతివ్యక్తికి తప్పని సరియయినది. దీనితో పురోహితుని జీవితము సలక్షణముగా నున్నది.

ఈదోషమే క్రమేపీ పరివర్తనజెంది సంఘాన్ని ఖూనీచేసింది. పిల్లి యెదురుపడిన దోషము, కాకి యెదురుగా పోయిన దోషము, విధవ యెదురైన దోషము, కుక్క యెదురైనదోషము. నక్క కనబడిన దోషము, రాత్రిపూట పక్షియరచిన దోషము, గుడ్లగూబ కనుపించిన దోషము, దగ్గితే దోషము ! తుమ్మితే దోషము! ! ఆవలించితే దోషము!!! ఎక్కిళ్లువస్తే దోషము!!!! ఔరా ! బ్రాహ్మణ (ఆస్తిక) మతము ?

వ్యక్తి జీవితకార్యాలను తమయధీనములో నుంచుకొనుటయే గాక జీవితమునే తమయధీనములో వుంచుకోవటానికి ప్రయత్నించి షోడశకర్మల సృష్టించారు. ఇవి వ్యక్తి జీవితాన్ని సుఖవంతం జేయటానికి వుపయోగ పడతాయి. నిజమే! పురోహితుడు లేనియెడల యీ కర్మలద్వారా సుఖవంతంకాదా? ఈకర్మల్లో కొన్నిటియందు విశేష లాభమున్నదని బ్రాహ్మణేతరులకు నిషేధించారు. మిగతా కర్మలు ధనసంగ్రహణకై చేయుచుండిరి. ఇట్టివానిలో వివాహము, శ్రాద్ధకర్మము ముఖ్యమైనవి.

వివాహము—ఇందుకు పురోహితుడు మంచిని యేర్పాటు జేస్తాడు. ఆలగ్నము ప్రకారము వివాహము జరుగుతుంది. పురోహితుని సమక్షమున, నాతనిచే జరుగుతుంది. తాను బాల్యములో కంఠతా జేసిన నాలుగు అమరిశ్లోకాలు అప్పగిస్తాడు. దీంతో వివాహము పూర్తియైనట్లే. అంత పురోహితుడు విశేష ధనసంగ్రహణ జేసి తనదారిన చక్కాపోతాడు.

శ్రాద్ధకర్మ—వ్యక్తి మరణించిన దరిమిళా యమలోకమునకు పోవునట. యమలోకమువద్ద చీము, నెత్తురుతోనిండిన వైతరణీ నది యుండునట. దానిని జీవుడు దాటవలయునట. సులభముగా దాటుటకు మార్గమున్నదనిరి. ఏమన! పురోహితునకు గోదానము జేసిన ఆగోవుతోక సహాయముతో ఆ మృత వ్యక్తి ఆనదిని దాటునట.

ఈ కర్మయందే శూద్రులని పిలవబడువారిని "దాస" యని సంబోధించెదరు. "దాస" యనగా సేవకుడని, పాపిష్టిముఖము కలవాడని, లంజకొడుకని యర్థము. కాని, యజ్ఞాన ప్రజానీకమునకు తెలియకుండా సంస్కృతమున నిట్లు బ్రాహ్మణులు తిట్టుచున్నారు. మంత్రములద్వారా సద్గతిని కలుగజేయు చున్నారని బ్రాహ్మణేతరులు భావించుచున్నారు.

ఇట్లు తిట్టుచూ, పాదప్రక్షాళనము జేయించుకొనుచూ, విశేష ధన సంగ్రహణ జేయుచుండిరి. ఇంతటితో తృప్తిపొందక, అమృతజీవి ఆకలిదప్పులచే విశేష బాధ జెందునుగాన తన్నివారణార్థము "తద్దినం" చేయవలయుననిరి. తత్ + దినము – తద్దినము (ఆరోజు) పునః కర్మకాండ జరుపవలెననిరి. ఇట్లు ప్రతి వత్సరము తద్దినము (మృతిజెందిన దినమున) చేయవలయునట. ఇట్లు జేసిన క్షుత్పిపాసలుదీరి మృతజీవి సుఖముగా నుండునట. మృతజీవియేమో కాని పురోహితుడు మాత్రము క్షుత్పిపాసలుదీరి సుఖముగా వుండుట చూచుచున్నాము.

ఔరా ! బ్రహ్మణభండాలా! న్యాయమును వీక్షించు దేవుడే యుండి యమలోకమే వున్న యిట్టి అన్యాయమునకు ఒడిగట్టుదువా? విగ్రహారాధన – అర్చకులు – పురాణములందును, యితిహాసత్రయమునందును వేయేల బ్రాహ్మణ (ఆస్తిక) గ్రంథములన్నిటియందును దేవునిలీలలు, మహత్తును కల్పించిరి. ఈ యవతారములు ప్రజలచే పూజింపజేయు టెట్లు?

ఒక యవతార విగ్రహమును నిర్మించి అర్ధరాత్రి సమయమున నొకచోట పాతిపెట్టి వచ్చెదరు. కొన్ని దివసంబులకు గనము పెంచుకొనిరో, లేక స్వప్నమున కనుపించిరో? "ఫలానాచోట యున్నాను. ఆలయము కట్టించ వలసిందిగాకోరినాడను మిషచే ప్రజానీకమునకుచాట గలరు. పరీక్షింపవలయునని వెళ్ళిత్రవ్వగానిర్మిత విగ్రహము బయల్పడును. ఈ కుతంత్రము తెలియని ప్రజానీకము "దేవుడు వెలిశాడని తలంచెదరు. అంత ధనవంతులచే ఆలయ నిర్మాణముగావించి దానినొకపుణ్యక్షేత్రముగా నొనరించెదరు. నేడుమనము జూచుచున్న పుణ్యక్షేత్రాలు, కొన్ని దేవాలయాలు యిట్లు నిర్మితమైనవే. ఇట్లు నిర్మిత దేవునకు కానుక లిచ్చిన కష్టములు దూరమగుననిరి. స్వర్గమున విశేష

ధన మిచ్చెదరనిరి. పునర్జన్మమున యెవరి దాన ప్రకారమువారు విశేష ధనవంతులై జన్మింతురనిరి.

ఈ యాసచే బీద ప్రజానీకము వున్నయాస్తినంతయు దేవుని కర్పించి, తినటానికి తిండిలేక మల మల మాడి మరణిస్తున్నారు. అర్చకులు విశేష ధన సంగ్రహణచే తమ జీవితము సలక్షణ సురక్షితమున గడుపు చున్నారు.

దరిమిలా బ్రాహ్మణ సంఘ జనాభా వృద్ధి కాజొచ్చె. అంత వీరు జీవనోపాధికి అనేక మార్గములు వెదుక దొడంగిరి. హస్తసాముద్రికము, జ్యోతిషము, వైద్యము, భూతవైద్యము, మున్నగు వానిని సృష్టించి విశేషధన సంగ్రహణ జేయుచుండిరి.

బోధకులు (అయ్యవార్లు) — అసత్య పూరితములై తమ పరముగా రచింప బడిన రామాయణ, భారత, భాగవత, పురాణాదుల ప్రజలకు బోధ జేయుటకై "బోధకులు" బయలు వెడలిరి. వీరిని ప్రజలే పోషించువారు.

ఈ యాచారమే రానురాను అయ్యవార్లై "మీ తాత ముత్తాతలకు మా తాత ముత్తాతలుపదేశించిరిగాన, మేముమీకు గురువులము. కానమమ్ము మీరు పోషింప వలయు. అది మీవిధి యనిరి. అన్నెము పున్నెమెరుగని అజ్ఞాన ప్రజానీకము వారు జెప్పినట్లె యొప్పుకున్నది. ఈ యాచారము రానురాను కతిపయ తుల కు గురిగా జొచ్చినది. ప్రజలను మరింత యజ్ఞానుల జేయుచూ వారి యధికారము నభివృద్ధి జేసుకొను చుండిరి.

అయ్యవార్లు [illegible] కి పోయిన పరుగెత్తి వెళ్లి అయ్యవార్లను దోడ్తెచ్చి వుచితాసనమున కూర్చుండ జేసి, నతని పాదముల కడగి, వాని త్రావి, శిరముపై జల్లుకొని అయ్యవార్ల కాళ్లు పిసుగుతూ, వారు జెప్పు బోధనల సావధాన చిత్తులై వినవలయు. "బ్రాహ్మణేతరుల

ఆస్తిపై బ్రాహ్మల కధికారము కలదను" రీత్యా అయ్యవార్లు కోరి నంత ధనము, నిచ్చి సగౌరవమున సాగనంప వలయునట.

ఇట్టి సమయమున నొక క్రొత్త పెండ్లి కొడుకునకు "గర్భా దానము" జేసిరి. అంత నాతడు మూడవ దివసమున మరణించెను.

అంత అయ్యవార్లు ఆ పిల్ల తండ్రితో నిట్లు చెప్పసాగెను: "ప్రధమ మూడు దివసములు మంత్ర పూర్వకముగా కార్యము నెర వేర్చిన, యిటువంటి దోషములుండక సంపూర్ణాయుష్యవంతులై, పుత్రసంతానముకల్గి, ధన కనకవస్తు వాహనాదులు కల్గియుండెదరని" నచ్చ జెప్పె.

అజ్ఞాన ప్రజానీకమునకు దేవుడంటే సంపూర్ణ భక్తి యుండుట వలన, దేవుని మహాత్మును కొంత యాలోచించి కాని చలామణి యవుచున్న బ్రాహ్మలపైనను భక్తిగల్గి యుండుటవలన, తాము యనుభవ పూర్వకముగా మంత్రశక్తిని పరీక్షించకున్నను, బ్రాహ్మలు జెప్పెడి మాటలందు నమ్మికక యుండుటచే మంత్రములందు విశేష శక్తియున్నదని విశ్వశించిన వారగుటచే, అయ్యవార్ల తంత్రమునకు దాసోహమనిరి. ఇదే సంఘాచారముగా పరిణమించినది. అయ్యవార్లు స్వేచ్ఛగా ప్రధమమూడు దినములు నక్కాంతను చెరచి, ధనమును గైకొని దీవించెడివారు. (ఇదికొన్ని ప్రదేశములందు మాత్రమే)

ఔరా! బ్రాహ్మణ ఛండాలాధమా! సంఘాభ్యు దయమునకై పాటుపడిన బౌద్ధమతమును నశింపజేయుట మొదటితప్పు. స్వార్థమే పరమార్థముగా నెంచి ప్రజానీకమును అజ్ఞాన రొంపియందు పడ ద్రోయుట రెండవతప్పు. ప్రజాచైతన్యమును నశింపజేసి నిర్వీర్యులు, నిస్తేజులనొనరించి, మానాభిమానముల మంటగలుపుట మూడవ తప్పు.

మహమ్మదీయులే హిందూదేశమునకు రాకున్న నింకెన్ని తప్పులు జరిగెడివో? దేవతలవలె మహమ్మదీయులడ్డు పడుటచే

మూడు తప్పులతో నే సరిపెట్టుకొంటిరి. మహమ్మదీయుల హిందూ దేశముపై దండెత్తకున్న, హిందూ సంఘము యేస్థితిలో నుండెడిదో వర్ణించుటకు నొక ఆధునికకవి శిఖామణికి నక్కార్యము వదలతిని. మహమ్మదీయులు హిందూదేశముపై దండెత్తి నందుననే హిందూ సంఘము సజీవముగా నున్నదని సగర్వమున వచించుచున్నాడ. మహమ్మదీయులు దండెత్తనలసినదే. బ్రాహ్మణులను బ్రాహ్మణ మతాన్ని నామరూపాదులు లేకుండా నశింప జేయవలసినదె. మహమ్మదీయుల రాక ఆలస్యమయింది. అంతకుమున్నే హిందూదేశముపై దండెత్తి సామ్రాజ్యమును మతమును వ్యాప్తిజేయవలసినది. ఆలసించినందున బ్రాహ్మణేతరులు బ్రాహ్మణదాస్యానికి గురికావలసి వచ్చింది.

ప్రపంచమున యేజాతియు మరొకజాతిని జయించి యిట్టి ఘోర యన్యాయముల పాల్పడ జేయలేదు.

బ్రాహ్మణ మతానికి కట్టుబడి, వారి కఠిన షరతులకులోనై వారినే విశ్వసించి బ్రాహ్మణేతరులు సంఘానికి కట్టుబడి యుండిరి. అట్లు విశ్వసించిన వారిని యజ్ఞానులజేసి. అసత్యపూరిత సిద్ధాంతముల విశ్వసింపజేసి, విశేషధన సంగ్రహణజేయుచూ, వారిని నాశనము జేయుటే తమ లక్ష్యముగా గల్గిన బ్రాహ్మణులకు ధిక్కారము. మానవ నిర్మిత చట్టరీత్యా న్యాయము.

స్వార్థపరులై తమ స్వార్థమే ప్రజాభ్యుదయముగా భావించి ప్రజలను వర్ణింపరాని అధోగతిపాలు చేశారు.

ఆస్తిక సిద్ధాంతరీత్యా దేవుని కల్పించి, మహత్తుల నారోపించి దేవుని శక్తియే యీ ప్ర పం చ ము ని రి. మరిలా అన్నారు,

"దేవుని యాజ్ఞానుసారముగ ప్రపంచము, దానితో పాటు మనము క్రమబద్ధముగా జన్మిస్తున్నాము: మరణిస్తున్నాము. ఇందు

మన స్వశక్తి యేమియు లేదు. అంతా దేవుని శక్తియే. పుట్టించిన వాడు పోషించడా? యేలమీారిట్లు యాతురత జెందెదరు?

మీారు దేవుని స్మరింపక నాస్తికులైన దేవుడు కోపగించి, రుతువు లందు వర్షము లేకుండా జేస్తాడు భయంకర అంటు వ్యాధుల పంపుతాడు కాన మీారందరు మేము జెప్పెడి పురాణముల విశ్వసించి దేవుని భక్తితో ప్రతిక్షణము స్మరింపవలయు ఆనాడు మీాకష్టముల దూరము జేయును.

నాస్తికులు జీవిత కార్యముల కన్నింటికి మేమే కర్తలను చున్నారు. అట్టి బోధనలను కొన్నివేల మైళ్ల దూరములో నుంచుడు. అట్టి బోధలకు చెవి మొగ్గిరా దేవుడు సర్వనాశనము జేయును. జాగ్రత్త.

మానవునకు స్వాతంత్ర్యమే లేదు. ఏలన అతని జీవితము ప్రారబ్ధ కర్మానుసారియై యున్నది. అతడు చేయు కార్యములన్నియు ప్రారబ్ధము ననుసరించియే. అసలు ప్రారబ్ధము చేతనే జన్మము కలుగు చున్నది. కానయిందు వ్యక్తి స్వాతంత్ర్యమేమియు లేదు. గతజన్మమున జేసిన పాపపుణ్యముల వలన అధమ, మధ్యమ, వుత్తమ జన్మలు నెత్తు చున్నాడు. తద్వతుగానే కార్యములు జేయుచున్నాడు

ఈ కర్మనుండి ముక్తి పొందాలంటే, సర్వము ఈశ్వరార్పణ మని అధిక కోరికలు కోరకుండ అత్యవసర కార్యములు జేయుచూ, కర్మఫలము కోరకున్న ముక్తిలభించును.

నాస్తికులు "జీవితయాత్రార్థమై దేవునితో యనవసరమను" చుండిరి. ఆహా! ప్రపంచమును సృష్టించి, పోషించు దేవునితో యనవసరమట! సృష్టి కర్తయైన దేవుని ధిక్కరించుట కున్న దోషము కల్పనా? "ఈ ప్రపంచము. దానంతటదే సృష్టియయినదట." ఓహో హో యేమివీరి యజ్ఞానము. కుండ దానంతటదే నిర్మింప బడగలదా? యే అజ్ఞానియైన అనగలడా? ఒకవ్యక్తి నిర్మించనిదే యేకార్యము

దానంతటదే సృష్టింప బడదు. అట్టి వ్యక్తియే అనంత శక్తిగలిగిన దేవుడు. అతని చేతనే యీ ప్రపంచము సృష్టింప బడినది. పోషింప బడుచున్నది. అటువంటి సృష్టికర్తయెడ మన శక్తియెంత? మన మెంత? మనకున్న శక్తియు దేవుడిచ్చినదే. కానయీ మాయా ప్రపంచ మందలి విషయముల పరిత్యజించి దేవునియందు సర్వదా భక్తిగల్గి యుండుట ప్రతివ్యక్తికర్తవ్యమై యున్నది.

ఇవ్విధమున మానవుని జీవితమును భగవంతుని పేరిటబలి యొనర్చి, స్వాతంత్ర్యమును, శక్తిని, నశింపజేశారు.

తోలుబొమ్మలు, నాటకాలు, హరికథలు, బోధనాపేర భగవదవతారముల మహిమ బోధించుచూ వానిని పూజించుటచే ముక్తి గలుగుననిరి.

సమస్తాపదల యందు "రామా"యని వుచ్చరించిన యాపదలు నశించుననిరి. రాముని యాలయములనిర్మించిరి. రామనామమే ముక్తి దాయకమనిరి. రామనామ మందే ప్రపంచమిమిడియున్నదనిరి. అంతా "రామ" మయము. గృహతోరణాల వద్దనుండి రాజ మందిరము వరకూ అంతా 'రామ" మయము.

ఒకడు మరణిస్తూ తన కుమారుడైన రాముని "రామా! రామా" యన్నాడట. అంత మాత్రమున విష్ణుభక్తులు నాతని వైకుంఠమునకు తీసు కెళ్లిరట.

వీన తనను స్మరించినది, తన కుమారునిస్మరించినది తెలిసి కొనలేని బుద్ధిహీనుడు గాబోలు! విష్ణుమూర్తి!

ఈ కలియుగములో భక్తియే ముక్తిదాయక మనిరి. కాన రాముని భక్తితో ప్రార్థించిన ముక్తి లభించుననిరి.

కొందరు "శ్రీరామ" నామమును వ్రాయ దొడగిరి. కొన్ని టన్నులకాగితములు వ్రాసిన రామభక్తులు లేక పోలేదు. ఆహా! రామనామ మహిమ!!!

"అందిందేమి ఎందెందు వెదకిచూచిన నందందె కలఁ" ఇట్టి భక్తియునాఁ దస్థితిలో హిందూదేశము తన్మయత్వస్థితిలో మైమరచి యున్నది. ఇట్టిస్థితిలో మహమ్మదీయులు రాకున్న వున్మాదస్థితి యెట్లు పరిణమించెడిదో?

ఇట్టిస్థితిలో వున్న వున్మాదమునకు మహమ్మదీయులు కొంతవరకు చికిత్స జేశారని సగర్వమున జెప్పుచున్నాను. దరిమిలా వున్న వున్మాదమునకు ఆంగ్లేయులు నూత్న యౌషధముల కనిపెట్టి సంపూర్ణముగా నశింపజేశారు. వారి పుణ్యమా యంటూ, నేడు మానవులవలె పరిగణింప బడుచున్నాము.

## మహమ్మదీయ మహోయుగము.

అరేబియా యందు మహమ్మదు ప్రవక్త సాంఘిక పునర్నిర్మాణము గావించెనని తెలిసికొనియున్నాము. దాని ఫలితమే మహమ్మదీయమతం:

మహమ్మదీయు లైనంతమాత్రముననే తమకున్న హక్కుల నన్నియు నిచ్చెదరు. "సమానత్వము, సోదరత్వము, సౌభ్రాతృత్వము."

ఇందువలననే బ్రాహ్మణ మతాన్నుండి వేరై వున్నత స్థానాన్ని పొందింది. బ్రాహ్మణులకున్న సంకుచిత, ద్రోహబుద్ధి బ్రాహ్మణులను బ్రాహ్మణ మతాన్ని నాశనము జేసింది.

బ్రాహ్మణ మతముకన్న మహమ్మదీయ మతముత్తమమైనది. గనుకనే హిందువులు ఇస్లాము మతమును స్వీకరించిరి. బలమును వృద్ధిజేసిరి. సామ్రాజ్యముల స్థాపించిరి. ఐకమత్యమున పాలించుచుండిరి.

బ్రాహ్మణ మతమందు నమ్మినవారిని నాశనము జేయుట వారిలక్ష్య మైనందున, దాస్యప్రజానీకము బ్రాహ్మణులను, బ్రాహ్మణ

మతాన్ని అమేధ్యమువలె విసర్జించి; సమానత్వము–సోదరత్వము సౌభ్రాతృత్వము గలిగిన మహమ్మదీయ మతాన్ని హిందువులందరు స్వీకరించుట ధర్మమని నామతము

మానవునకు కావలసినదేమి? అభ్యుదయము. ఉన్నతము, స్వాతంత్ర్యము, గౌరవము.

ఇందుకు విరుద్ధముగా బ్రాహ్మణ మతము మానవుని స్వాతంత్ర్య విహీనుని జేసి, నీచాతినీచముగ జూచుచు, పెంయన్యాయ చట్టముల బంధించి, సంఘాభ్యుదయము ఖూనీజేసి సంఘానికి తీరని కష్టాలు ప్రసాదించారు. ఇట్టి బ్రాహ్మణ మతాన్నుండి ప్రతి ఒక్కరు తమ అభ్యుదయము కొరకు, స్వాతంత్రము కొరకు, గౌరవముకొరకు మహమ్మదీయ మతాన్ని స్వీకరించాల్సింది ప్రజానీకము సంపూర్ణ యజ్ఞానులైనందున, బ్రాహ్మణమతము జీర్ణించుకుపోయి, "విధి" యని సమస్త కష్టదుఃఖాలను భరించెడివారే కాని, దీనికంతకూ కారణము "బ్రాహ్మణ (ఆస్తిక) మతమే" యను దృష్టికూడనశించి, పౌరుష శౌర్యములు, జ్ఞానశక్తి నశించినందున "బ్రాహ్మణ మతమొకటి తమ నెత్తిపై యధికారము కలిగియున్నదను" విషయజ్ఞాన శూన్యులైనందున మహమ్మదీయ మతమును స్వీకరింపనొల్లరైరి.

మహమ్మదీయ మతస్తులలో "సబక్తజిన్" యను మహమ్మదీయరాజు క్రీ. శ. 980 న హిందూదేశముపై, ప్రప్రథమ దండయాత్రజేసి రాజ్యము స్థాపించినాడు

ఇతని కుమారుడు మహమ్మదు ఘజ్నీ (997–103)) సింహాసనమధిష్ఠించెను. ఇతడు అనేక రాజ్యముల జయించి "సుల్తాన్" బిరుదమును పొందెను.

దరిమిలా క్రీ. శ. 1001 లో హిందూదేశముపై దండయాత్ర జేసి జయపాలుని నోడించెను 105లో ముల్తానును వశపరచుకొనియె.

ఇట్టి సమయమున బ్రాహ్మణులు కుతంత్రముచే విగ్రహారాధన పేరున ప్రజలనుండి విశేష ధనసంగ్రహణ జేసి, దేవాలయము లందు బంగారనాణెపు రాసులు పోసుకొని కూర్చుండిరి.

ఈఘుజ్నీ 1009 లో నాగర్కోట దేవాలయముపై 1012 లో స్థానేశ్వర దేవాలయము, 1019 లో మధురానగరము, 1024 లో గుజరాత్ లోని ప్రభాసము వద్దనున్న సోమనాథదేవాలయమును కొల్లగొట్టి, బ్రాహ్మణాన్యాయ సంపాదిత బంగారురాసుల గైకొని, విగ్రహముల పగులగొట్టి, బ్రాహ్మణుల చిత్రవధజేసి తన దేశమునకు (ఘుజ్నీకి) వెళ్ళెను.

ఈఘుజ్నీ వంశస్థుల దరిమిలా "ఘోరు" వంశస్థులు సింహాసన మధిష్టించిరి. 1181లో ఘియాసుద్దీను రాజయ్యెను. ఇతని తమ్ముడు మహమ్మదుఘోరీ.

ఈఘోరీ హిందూదేశముపై దండెత్తి 1175 లో ముల్తానును పట్టుకొనెను 1187 లో పంజాబును స్వాధీనపరచుకొనియె.

ఘుజ్నీవలె హిందూ దేశమును దోచుకొని వెళ్లుటకు గాక సామ్రాజ్య స్థాపనార్థమై విశేషకృషి జేయుచుండెను ఘోరీ.

ఇట్టిసమయమున ఢిల్లీ సామ్రాజ్యమును పృథ్వీరాజు పాలించుచుండెను, ఇతడుకడు బలవంతుడు తదితరరాజులను లెక్కచేయువాడుకాడు.

కనూజ్ రాజైన జయచంద్రునకు "సంయుక్త" యను కుమారిత కలదు ఈమె అపురూప లావణ్యవతి. ఒకనాడు వుద్యానవనమున విహరింపుచుండ పృథ్వీరాజు బలాత్కారమున గైకొని వెళ్లెను.

అంత జయచంద్రుడు భరింపరాని ఆగ్రహముకలవాడై, పగ సాధించుకొనుటకు మార్గమేమని ఘోరీకి యీ యుందంతము తెలిపి పృథ్వీరాజుపై దండెత్తుటకు సంసిద్ధులైరి.

"వెతుకబోయిన తీగె కాలికి దగిలెనన్నట్లు" ఘోరీయపరిమి తానందమున్న జయచంద్రుని సాయమున, స్థానేశ్వరసమీపమున టరైన్ ప్రదేశమున 1191 లో పృథ్వీరాజుపై దండెత్తెను.

పృథ్వీరాజునకు సహాయముగా మరికొందరు రాజులు వచ్చి నందున ఘోరిపరాజితుడయ్యె.

1192 పునః యుద్ధమారంభమయ్యె. సైనికవ్యూహ తంత్రముచే పృథ్వీరాజు ఖ్రోడింపబడి బంధింపబడెను. అంత అజ్మీరును, ఢిల్లీని స్వాధీన పరచుకొనియె.

1193 న జయచంద్రుడు పరాజితుడై గంగానదిలో అంతర్ధానమొందె. 1206న ఘోరీగక్కరులచే హత్యజేయబడె.

ఇతని ప్రతినిధి "కుతుబుద్దీన్" స్వతంత్రుడై ఢిల్లీ సింహాసనమధిష్ఠించి బానిస వంశమునకు మూలపురుషుడయ్యె.

## బానిస వంశము

| | | | | | |
|---|---|---|---|---|---|
| కుతుబుద్దీన్ | క్రీ. శ. | 1206 | నుండి | 1211 | వరకు |
| ఆల్తమసు | | 1212 | ,, | 1236 | ,, |
| రిజియా | | 1236 | ,, | 1239 | ,, |
| నాజరుద్దీన్ | | 1246 | ,, | 1266 | ,, |
| బాల్బను | | 1266 | ,, | 1287 | ,, |
| కైకుబాదు | | 1287 | ,, | 1288 | ,, |

## ఖిల్జి వంశము

| | | | | |
|---|---|---|---|---|
| జలాలుద్దీన్ | 1288 | ,, | 1296 | ,, |
| అల్లాయుద్దీన్ | 1296 | ;, | 1316 | ,, |
| గయాజుద్దీన్ (తుగ్లకు) | 1320 | ,, | 1324 | ,, |
| మహమ్మదుబిన్‌తుగ్లకు | 1324 | ,, | 1351 | ,, |
| ఫిరోజషా | 1351 | ,, | 13:8 | ', |

సయ్యదు వంశము

ఖిజరుఖాను 1414 ,, 1450 ,,

లోడీ వంశము

1450 ,, 1526 ,,

మొగలాయీ సామ్రాజ్యము.

బాబరు 1483ని జన్మించి మొగల్ సామ్రాజ్యము స్థాపించి 1530లో కాలము జేసెను.

ఇతని కుమారుడు హుమాయూన్ (1530–1556)న మేడమెట్లు దిగుచుండ, ప్రార్థనకై పిలచు గంట శబ్దము వినబడుటచే, త్వరగాదిగుచుండ చేతికర్రజారి క్రిందపడి మరణించెను.

అక్బరు

ఇతని కుమారుడు అక్బరు. 1556న ఢిల్లీసింహాసన మధిష్టించెను. ఇతడును కొంతసామ్రాజ్యమును వ్యాప్తిజేసెను.

హిందు మహమ్మదీయుల సమదృష్టి చూచువాడు. హిందూ కన్యనుద్వాహమాడెను. హిందువులకు అనేక వున్నతవుద్యోగముల నిచ్చెను.

ఇందువలన యీతనియుద్దేశ్యము చాలాగొప్పదని చరిత్రకారులు పేర్కొనుచున్నారు, హిందువులను హింసింపకుండ యాదరించుటవలన యింతటి వాడు, అంతటివాడని పేర్కొను చున్నారు. అక్బరు యుద్దేశ్యము తెలియక మహమ్మదీయ ప్రభువులలో శ్రేష్టుడని బ్రాహ్మణులు పొగడుచున్నారు.

హిందూ సంఘములోవున్న చెట్టుపుట్ట, రాయిరప్ప, కుక్కనక్క మున్నగు వానిని పూజించు వివిధోపాసనలు, మహమ్మదీయులకు హిందులపైయమిత ద్వేష కారణమైనది. ఇటువంటి యజ్ఞానము నుండి హిందువులను రక్షించ వలయునని మహమ్మదీయ ప్రభువులభి

సయ్యదు వంశము

ఖిజరుఖాను 1414 ,, 1450 ,,

లోడీ వంశము

1450 ,, 1526 ,,

మొగలాయీ సామ్రాజ్యము.

బాబరు 1483ని జన్మించి మొగల్ సామ్రాజ్యము స్థాపించి 1530లో కాలము జేసెను.

ఇతని కుమారుడు హుమాయూన్ (1530–1556)న మేడ మెట్లు దిగుచుండ, ప్రార్థనకై పిలచు గంట శబ్దము వినబడుటచే, త్వరగాదిగు చుండ చేతికర్రజారి క్రిందపడి మరణించెను.

అక్బరు

ఇతని కుమారుడు అక్బరు. 1556న ఢిల్లీసింహాసన మధిష్టించెను. ఇతడును కొంతసామ్రాజ్యమును వ్యాప్తిజేసెను.

హిందు మహమ్మదీయుల సమదృష్టి చూచువాడు. హిందూ కన్యనుద్వాహామాడెను. హిందువులకు అనేక వున్నతవుద్యోగముల నిచ్చెను.

ఇందువలన యీతనియుద్దేశ్యము చాలాగొప్పదని చరిత్ర కారులు పేర్కొను చున్నారు, హిందువులను హింసింపకుండ యాదరించుటవలన యింతటి వాడు, అంతటివాడని పేర్కొను చున్నారు. అక్బరు యుద్దేశ్యము తెలియక మహమ్మదీయ ప్రభువులలో శ్రేష్టుడని బ్రాహ్మణులు పొగడుచున్నారు.

హిందూ సంఘములోవున్న చెట్టుపుట్ట, రాయిరప్ప, కుక్క నక్క మున్నగు వానిని పూజించు వివిధోపాసనలు, మహమ్మదీయులకు హిందులపైయమితద్వేష కారణమైనది. ఇటువంటి యజ్ఞానము నుండి హిందువులను రక్షించ వలయునని మహమ్మదీయ ప్రభువులభి

ప్రాయము. మహమ్మదీయ లేకేశ్వరోపాసన యని తెలిసి కొంతరి ఇవ్విధమునసే హిందువులకును ఏకేశ్వరోపాసన కలుగజేయవలయునని యెంతో శ్రమపడిరి. కాని ఫలించలేదు. సద్బోధలెవరికి నచ్చవు. దుర్బోధల త్వరగా గ్రహించెదరు. అందువలన బ్రాహ్మణ దుర్బోధనలే జీర్ణించుకొనినందున సద్బోధనల గ్రహించలేక పోయారు. బ్రాహ్మణమత దాస్యమ్నుండి ముక్తిపొందలేక పోయారు.

అట్లు హిందువులకు ముక్తిని ప్రసాందిచుటకై అనేక మహమ్మదీయ ప్రభువులు ప్రయత్నించారు. అట్టివారిలో అక్బరొకడు.

హిందువులను బలవంతముగా సన్మార్గుల జేయుట కష్టమని, దయతో ప్రార్థనా పూర్వకముగా వారిని సన్మార్గుల జేయుట సులభమని, హిందూకన్యను వివాహమాడె. కఠినపరతుల నిషేధించె. అనేకవున్నతో ద్యోగములనిచ్చె. అందుకు హిందువులు సంతోషపడిరేగాని మతముమార్చుకోవాల్సిన యావశ్యకత కలుగలేదు. అందువలన అక్బరు వుద్దేశ్యము విఫలమయింది.

ఇతని కుమారుడు సలీమ్ "జహంగీరను" నామముతో సింహాసన మెక్కెను. (1605–1627)

పర్షియా దేశస్తుడు కుటుంబసహితముగా హిందూదేశము వచ్చుచుండ మార్గమధ్యమున "మిహిరు వున్నీసా" యనుకుమార్తె కలిగెను.

ఈపర్షియా దేశస్థుడు అక్బరు ఆస్థానమున నుద్యోగిగా యుండెను. మిహిరు వున్నీసాకు యుక్తవయస్సు వచ్చినది. ఒకనాడు యంతఃపురమునకు రాగా జహంగీరు ఆమెయావ్వన సౌందర్యములకు ముగ్ధుడై వివాహమాడ దలంచెను.

ఈవిషయము తండ్రియైన అక్బరు గ్రహించి, ఆమె పేద కుటుంబమునకు చెందియుండుటచే తమరాజగౌరవము నకు భంగమని,

మిహిరున్నీసాను, షేర్ ఆఫ్ఘను అనువానికి వివాహము జేసి బర్ద్వాను జాగీరునకు పంపెను.

జహాంగీరు సింహాసనమధిష్టించి, షేర్ ఆఫ్ఘన్ను హత్యజేయించి మిహిరున్నీసాను వివాహమాడెను. ఈమె "నూర్జహాన్" పేరున 1611న జహాంగీరు అర్ధాంగియయ్యె.

జహాంగీరునకు నూర్జహానుకుపూర్వమే,యిద్దరుకుమారులుండిరి షహారియారు. షాజహాన్.

నూర్జహానుకు షేర్ఆఫ్ఘను వలన ఒక కుమారిత కలదు. నూర్జహాను తనకుమారితను జహాంగీరు కుమారుడైన షహారియారునికిచ్చి వివాహము జేసెను. జహాంగీరు యనంతరము తనయల్లునకు రాజ్యము సంక్రమింప వలయునని ప్రయత్నించు చుండెను.

నూర్జహాన్ అన్న అసఫ్ఖాన్, తనకుమార్తెను జహాంగీరు కుమారుడైన షాజహానుకిచ్చి వివాహము జేసెను. జహాంగీరు యనంతరము తనయల్లునకా రాజ్యము సంక్రమింపవలయునని ప్రయత్నించుచుండె.

ఈవిషయము షాజహాను గ్రహించి, ప్రతి వారసుల బంధించి సింహాసన మధిష్ఠించెను. (1627 – 1658)

ఇతడు యనేక యుద్ధములు జేయవలసి వచ్చినది. ఇతనిభార్య ముంతాజ్మహల్. ఈమె 1631 లో ప్రసవించి మరణించెను. ఈమె స్మృతి చిహ్నముగ సమాధిపై "తాజమహాలు"ను నిర్మించెను. ఢిల్లీలోని జుమామసీదును, ఆగ్రాలోని మోతీమసీదును యితడు నిర్మించినవే. ఇందువలన షాజహానుకు "ప్రాసాదనిర్మాత"యను బిరుదము కలిగెను.

## ఔరంగజేబు

ఇతని యనంతరము ఔరంగజేబు 1658 న సింహాంసన మలంకరించెను. ఇతడు బ్రాహ్మణదాస్యాన్నుండి హిందువులకు ముక్తికలిగి

స్తున్న కారణమున, బ్రాహ్మణులు, యితనంత పరమదుర్మార్గుడు లేడని పేర్కొనుచున్నారు. ఏతత్కారణంబున ఔరంగజేబు దుర్మార్గుడు కాడని తెల్లంబయ్యెడిని!

ఔరంగజేబు న్యాయవంతుడు, రాజబొక్కసములోని దమ్మిడీయైనను తనఖర్చుక్రింద వాడెడివాడు కాడు.

టోపీలను కుట్టి యమ్ముకొని జీవించెడువాడు. ఖురాను వ్రాత ప్రతులను వ్రాసి అమ్ముకొని జీవించెడివాడు. ఆడంబరములకు పోవువాడు కాదు. సర్వదా రాచకార్యములందే నిమగ్నుడై యుండెడివాడు. ప్రజాసేవయే తన కర్తవ్యముగా నెంచి పాలించిన పవిత్ర మూర్తి ఔరంగజేబు.

ప్రజలు అన్యాయమున ప్రవర్తించుట అతనికి ప్రబల క్రోధ కారణమయ్యెడిని. బ్రాహ్మణులు హిందువులపై చలాయించుచున్న అన్యాయముల (విగ్రహారాధన, అస్పృశ్యత, అజ్ఞానము) వీక్షించి విశేష విచారవంతుడయ్యె. బ్రాహ్మలు సోమరులై అన్యాయముగా ప్రజల నుండి మతము పేరిట ధన సంగ్రహణ జేయుట కంటే యన్యాయము మరొకటి లేదని భావించె.

బ్రాహ్మణ వేద పాఠశాలలను మూయించె. ప్రజలను బ్రాహ్మణ దాస్యమ్నుండి ముక్తి కలిగించాలని తన జీవిత మంతయు త్యాగము జేసిన త్యాగమూర్తి ఔరంగ జేబు. హిందువులకు ఒక యవతార పురుషుడయ్యె.

ప్రజలను విగ్రహారాధన జేయుట మాన్పించి విజ్ఞానుల జేయుటకై అనేక దేవాలయముల పడగొట్టించెను. హిందువులకు విగ్రహములందు విశేష భక్తియుండుటచే, అవే తమ జీవిత కష్టాలను దూర మొనరించునను విశ్వాసముండుటచే, ఇట్టువంటి యమాయక విశ్వాసమును ప్రజల నుండి దూరము జేయుటకై, విగ్రహముల పడ

గొట్టి మసీదు మెట్లగా నిర్మించి మహమ్మదీయు లందరు త్రొక్కు చుండిరి.

ఇప్పటికిని హిందువులు మూఢ విశ్వాసముల విసర్జింపకైరి. రాళ్లకు మ్రొక్కుట మానవున కెంత యవమానమో గ్రహించ లేకున్నారని ఔరంగజేబు దుఃఖించాడు.

హిందూ సంఘములోవున్న మూఢ విశ్వాసములను. మూఢ ఆచారములను, అజ్ఞానమును, సామదాన భేద దండోపాయముల వలన నశింపజేసి ప్రజల విజ్ఞానులజేసి, సుఖవంతులజేసి, బ్రాహ్మణుల చిత్రవధ జేయుటే ఔరంగ జేబు యుద్దేశ్యము.

బ్రాహ్మణులు యీ యుద్దేశ్యమును గ్రహించినవారై, ఔరంగ జేబు మీద ప్రజలకు ద్వేషము కలుగునట్లుగా అనేక అసత్యవార్తల 24 గంట లుపన్యసించు చుండిరి. ప్రజలకు ద్వేషము కలిగినది.

వీరు బౌద్ధ మతాన్ని నాశనము జేసి అనేక రాజకీయో ద్యోగ ములందు ప్రవేశించిరి. మంత్రులునయిరి.

వీరు రాజపుత్రుల, మహారాష్ట్రుల రెచ్చగొట్టి ఔరంగజేబు మీద దండెత్తునట్లు జేసిరి.

ప్రజాభ్యుదయమునకు పాటుపడుచున్న ఔరంగజేబునకు యీ కుతంత్రము తెలియదు

ప్రజలను సన్మార్గుల జేయుటకై సామమున నెన్ని బోధించి నను తలకెక్కించు కొనక పోవుటచే వీరికి గ్రహించు బుద్ధిలేదని, విసిగి, సమానత్వము, సోదరత్వము, సౌభ్రాతృత్వము, యేకేశ్వరోపా సన కలిగిన తమ మతమును స్వీకరింప జేయుటకై దండనోపాయ మారంభించె.

విద్యార్థి వున్నతముకై, వుపాధ్యాయులు దండించుట న్యాయ మగునట్లే, అజ్ఞాన ప్రజానీక సంరక్షణార్థమై దండించుట న్యాయము కదా.

మహామ్మదీయ మతమును స్వీకరింపని వానికి అనేక దండనలు విధించె. కనుపించనట్లు యితని వుద్యోగులు; బ్రాహ్మణులు హిందూ సంఘాన్ని యెలానాశనము జేస్తుంది విశదముగ నచ్చజెప్పి తమ మతమును స్వీకరింప జేసెడివారు.

ధనమును కూడా యిచ్చుచుండిరి. ధనము పోయినను హిందువుల యజ్ఞానము నశించిన నంతియే చాలునని ఔరంగజేబు తలంచె.

ధనాశచే నిరుపేదలు, సమానత్వము కొరకు అస్పృశ్యులు, వున్నతోద్యోగముల కొరకు విద్యావంతులు, మనఃపూర్వకముగా మహామ్మదీయ మతాన్ని స్వీకరించారు. మరికొందరు బ్రాహ్మణ మత వ్యవస్థ, మహామ్మదీయ మతవ్యవస్థ భేదము గమనించి మహమ్మదీయ మతాన్ని స్వీకరించారు. అనేకమంది బలవంతముగా స్వీకరించారు. ఇవ్విధమున క్రమేపీ హిందూ దాస్య శృంఖలములు విడిపోనారంభించినాయి.

ఇది సహించలేక బ్రాహ్మణులు, అజ్మీర్, మేవాడ్ నుండి రాజ పుత్రులకు అప్రతిహత ద్వేషము రెచ్చగొట్టి ఔరంగజేబు మీాద యుద్ధమునకు సంసిద్ధుల జేసిరి.

ఔరంగజేబు వీరిని యెదుర్కొనుటలో నిమగ్నుడయ్యె.

అంత దక్కను మహారాష్ట్రులకు ఔరంగజేబుమీాదఅప్రతిహత ద్వేషమును రెచ్చగొట్టి యుద్ధమునకు రెచ్చగొట్టిరి.

ఈమహారాష్ట్రుల నాయకుడు శివాజీ. ఇతడు బ్రాహ్మణతొత్తు. ఇతడు శూద్రుడైనందున బ్రాహ్మణులు జంధ్యమువేసి సంస్కరించిరి. తమచేతిలో లు బొమ్మగానుంచు కొనిరి. ఆతనికి వ్రాయను, చదువను తెలియనందున రాచకార్యము లన్నియు బ్రాహ్మణాధీనమయ్యె. బ్రాహ్మణ కుతంత్రములకు దాసుడయ్యె. ఔరంగ జేబును సంహరించుటే తన కర్తవ్యమని భావించు పరమ మూఢుడు.

ఇతడు ఔరంగ జేబుపై కయ్యమునకు కాలుద్రవ్వి ఔరంగ జేబుపై దండెత్తెను. ఔరంగజేబునకు విశేష కార్యము లుంటజేసి దక్కను ప్రతినిధియైన సైస్థఖానును శివాజీపైకి పంపెను.

ఇతడు శివాజీని పూర్తిగా ఓడించెను. పూనాయందు మకాము వేయవలసి వచ్చెను. రహస్యముగా శివాజీ సైస్థఖానును హత్యజేయ ప్రయత్నించి, విఫలుడయ్యె.

ఔరంగజేబు సైస్థఖానును తొలగించి తన కుమారుడైన ముఅజ్జముని డక్కను ప్రతినిధిగా నియమించెను. ఇతనికి శివాజీ దాసోహమనియె.

దరిమిలా విజృంభించి 1671 న సూరత్‌ను కొల్లగొట్టి, 1674 రామగడము పట్టాభిషిక్తుడయ్యె, మహమ్మదీయులచే ఘోరపరాభవ ముల పొందుచుండె.

ఔరంగజేబును సంహరించుటకు బదులుగా, ఔరంగజేబునకు ముందుగానే, తన 53 యేట దేహయాత్ర చాలించాడు శివాజీ.

ఇతని కుమారుడు శంభాజీ. 1680 న సింహాసనమధిష్ఠించెను. ఇతడు బాల్యమునుండియు బ్రాహ్మణులు జేయు కుతంత్రములు యెరిగిన వాడగుటచే తాను రాజైన తక్షణమే ఆస్థానమునుండి బ్రాహ్మణుల పారద్రోలెను. ఇందుపై బ్రాహ్మణులు యీతనిని హత్యజేయుటకై ప్రయత్నించుచుండిరి.

తండ్రికంటెను యితడు కడుసమర్థుడు,, వివేకి ఐనందున తానొక్కడే స్వతంత్రముగా పాలించుచుండెను.

అటు ముసల్మానులతో విరోధము, ఇటు బ్రాహ్మణులతో విరోధం. ఎన్ని విరోధములనైనను లెక్కచేయక అనేక యుద్ధములు జేయుచు పాలించుచుండెను. ఇతనికి బ్రాహ్మణులన్న, బ్రాహ్మణ మతమన్న పరమద్వేషము. అందువలన బ్రాహ్మణులను నీచాతి నీచ ముగా చూచెడివాడు.

ఏ తత్కారణంబున బ్రాహ్మణులు శంభాజీని సంహరించుటకై ఔరంగజేబుతో రహస్యకుతంత్రము జేసిరి.

ఒకనాడు శంభాజీ, తనమిత్రుడైన కవికులేశునితోడ వుద్యాన వనమున విహరింపుచుండ, బ్రాహ్మణులచే పంపబడిన ముసల్మానులు యిద్దరిని బంధించి గైకొని వెళ్ళిరి.

శంభాజీ బ్రాహ్మణమతద్వేషియని ఔరంగజేబు యెరిగిన వాడై, మహమ్మదీయ మతమును స్వీకరించి, నీరాజ్యమును నీవు పాలించుకొమ్మనియె. అంతశంభాజీ "చక్రవర్తి తనకుమారితను నాకు వివాహము జేసిన ముసల్మాను నయ్యెదను." అనెను. అందుకు చక్రవర్తి కోపించి బంధించె.

పునః బ్రాహ్మణులు పీష్వా (ప్రధానిమంత్రి)లై పాలించుచుండిరి. బాలాజీ విశ్వనాథ్‌యను పీష్వా (1714-1720) స్వతంత్రుడై మహారాష్ట్రమును పాలించుచుండెను.

ఔరంగజేబు 90 వత్సరముల వయస్సుగల వాడై నప్పటికి యువకునివలె రాచకార్యములు నిర్వహించువాడు. 1705 లో వృద్ధాప్య బలహీనతచే 1707 లో మరణించెను.

ఇతని వుద్దేశ్యములన్నియు నెరవేరలేదు. బ్రాహ్మణ కుతంత్రములచే భగ్నమొనరింపబడినవి. ఐనను హిందూసంఘము కొంత వరకూ ముక్తిచెందినది. ఇతని కాలముననే విశేష సంఖ్యాకులైన హిందువులు మహమ్మదీయ మతాన్ని స్వీకరించారు. బ్రాహ్మణ దాస్యాన్నుండి ముక్తులయ్యారు. వారేధన్యులు. అదృష్టవంతులు. దరిమిలా మహమ్మదీయ రాజులతో బ్రాహ్మణమతాన్ని నాశనము జేసిన వారులేరు. అమాయిక పౌరుషవంతులైన రాజపుత్రుల మహారాష్ట్రీల ప్రతిఘటనచే బ్రాహ్మణమతము సుస్థిరమున నిలచినది. విప్లవరహితమై అజ్ఞానావస్థలోనే యుండిపోయినది. హిందూసంఘము

బ్రాహ్మణ దాస్యానికిగురి యైనది. ఔరంగజేబు హిందూస్థానానికి కొంతవరకూ ముక్తి కలిగించినప్పటికి, సంపూర్ణముక్తి లభింపలేదు. పునః హిందూ సంఘము మూఢాచారములకు, మూఢభావాలకు గురియై, అజ్ఞానావస్థలోనే యుండి పోయింది బ్రాహ్మణాధికారము సురక్షితముగా చలామణి యవుచూనే యున్నది.

## బ్రిటిషు మహాయుగము.

ఇంగ్లీషువారు క్రీస్తు మతాన్ని స్వీకరించి అజ్ఞానమునుండి ముక్తి జెంది విజ్ఞానులైరి. విశేష ప్రకృతిజ్ఞాన సముపార్జనచే, ప్రకృతి కష్టముల దూర మొనరించుకొనిరి. వర్తక నిమిత్తమై హిందూదేశము జొచ్చిరి.

అట్టిసమయమున హిందూదేశము పరస్పర ద్వేషయుతులగు హిందూ మహమ్మదీయుల పాలన మందుండె. ఈ యవకాశమును ఇంగ్లీషువారు వినియోగించుకొని మహమ్మదీయ పక్షము వహించి హిందువులను, హిందువుల పక్షము వహించిన మహమ్మదీయులను జయించిరి.

ఇవ్విధమున ఆంగ్లేయులు వర్తక నిమిత్తమైవచ్చి రాజ్యములనే స్థాపింప జొచ్చిరి. క్రమేపీ సంపూర్ణ హిందూదేశము ఆంగ్లేయుల పాలన క్రిందకు వచ్చెను.

హిందువులకు యిదొక యదృష్టమే. ఆంగ్లేయులు క్రైస్తవ మత ప్రచార మొనరించుచుండిరి. వీరి మత మందును, సమానత్వం సోదరత్వము, సౌభ్రాతృత్వము కలవు. మత ప్రచారమునకై విశేష ధనమును వ్యయము చేయుచుండిరి.

బ్రాహ్మణులచే నీచాతి నీచముగ చూడ బడుచున్న హరి జనుల నాదరించి వుచితమున విద్యజెప్పుతూ తమమతమున విశేష

గౌరవ మిచ్చుచుండిరి. వీరును మహమ్మదీయులవలె హిందూ సంఘ యజ్ఞానమును నశింపజేయుటకు విశేష ప్రయత్నించుచుండిరి.

ఇందులకు బ్రాహ్మలు వ్యతిరేక ప్రచార మొనరించిరి. అందులకు ఆంగ్లేయులు భయపడి "మామతమును ప్రచార మొనరింపము. మీమత జోక్యము కలిగించుకొనము. మాకు రాజ్యపాలన జాలు ననిరి." దీనితో సామాన్య ప్రజానీకము అలాగే నేటికిని బ్రాహ్మణ దాస్యాన్ని యనుభవించుచునే యున్నది.

## హిందూదేశమున రాజప్రతినిధుల పరిపాలన.

(బెంగాల్ గవర్నరు జనరల్ హోదాలో.)

| | |
|---|---|
| క్రీ. శ. 1774 | వారెన్ హేస్టింగ్ |
| 1785 | ఆర్. జె. మాక్‌సర్‌సన్ |
| 1786 | ఎరల్ కారన్ వాలీస్ |
| 1798 | సర్. జాన్. షోర్ |
| 1798 | సర్. ఆల్‌ఫ్రెడ్ క్లారక్ |
| 1798 | లార్డు వెలెస్లీ |
| 1805 | లార్డు కారస్ వాలీస్ (2వ సారి) |
| 1805 | సర్. జార్జి బారవో |
| 1807 | ఎరల్ ఆఫ్ మింటో |
| 1813 | లార్డు హేస్టింగ్సు |
| 1823 | జాన్ ఆడమ్ |
| 1823 | ఎరల్ అమ్ హర్ట్సు |
| 1828 | డబ్ల్యూ. బి. బెయిలీ |
| 1828 | లార్డు. డబ్ల్యూ–కవాన్‌డిష్ బెన్‌టిక్ |

(గవర్నర్ జనరల్ ఆఫ్ ఇండియా హోదాల్)

1833 లార్డు. డబ్ల్యు. కవాణిష్ బెన్టిక్
1835 సర్ చార్లెస్ మెట్కాఫ్
1836 లార్డు ఆక్లెండ్
1842 లార్డు ఎల్లెన్బర్
1844 సర్ హెన్రీహార్డింజ్
1848 ఎరల్ ఆఫ్ డల్హౌసీ
1856 లార్డు కానిన్గ్
1862 ఎరల్ ఆఫ్ ఎల్గిన్
1363 సర్. రాబర్టు నేపియర్
1863 సర్. విలియండెనిసన్
1364 సర్. జాన్వారెన్సు
1869 ఎరల్ ఆఫ్ మేయో
1872 సర్. జాన్స్ట్రాచీ
1872 లార్డు నాపియర్
1872 లార్డు నార్తుబ్రూక్
1875 ఎరల్ ఆఫ్ లిట్టన్
1880 లార్డు రైఫన్
1884 ఎరల్ ఆఫ్ డఫెరిన్
1888 లార్డు లాణ్ సదాణ్
1894 ఎరల్ ఆఫ్ ఎల్గిణ (2వసారి)
1899 లార్డు కర్జను
1904 లార్డు యాంప్టిల్
1904 లార్డు కర్టను
1905 ఎరల్ ఆఫ్ మిణ్టో (2వసారి)
1910 లార్డు హార్డింజ్
1916 ,, చేమ్సుఫర్డు



| | | |
|---|---|---|
| 1921 | ,, | రీడింగ్ |
| 1926 | ,, | ఇర్విన్ |
| 1929 | ,, | గోస్చెను |
| 1931 | ,, | వెల్లింగ్టను |
| 1936 | ,, | లిన్‌లిత్ గో |

పై జెప్పబడిన ఇండియా రాజప్రతినిధులు రాజకీయంగా అపూర్వ సంస్కరణలు జేశారు,

అనేక ఆనకట్టలు నిర్మించి తద్వారా మెట్టభూముల మాగాణి యొనర్చి రైతుల కష్టములు దూరము జేశారు.

రైలు మార్గముల నిర్మించి ప్రయాణ సౌకర్యము కలిగించారు. తద్వారా ప్రజలు విశేష నాగరికత పొందారు. మరియు అనేక యంత్రముల నెలకొల్పిరి. తంతితపాలా నిర్మించి ప్రజలకు విశేష సాయపడిరి.

విశేష పాఠశాలల నెలకొల్పి ప్రపంచ జ్ఞానము బోధించిరి. ప్రజలందు విద్యావ్యాప్తి కలిగించిరి. అజ్ఞానము దూరమగు చుండెను.

## కాంగ్రెసు

ప్రజలు విద్యావంతులగుట బ్రాహ్మణులకు ప్రాణాపాయముగ గన్పట్టినది. బ్రాహ్మణ అధికారము, గౌరవము తగ్గినది. బ్రాహ్మణేతరులు, బ్రాహ్మణులను, బ్రాహ్మణ మతమును విమర్శింప సాగిరి.

బ్రిటిషువారే హిందూదేశము పాలించుచున్న ప్రజలు, విశేష విజ్ఞానవంతులై తమను పూర్తిగా ధిక్కరించెదరని విచారింపదొడగిరి. ఇందుకు ఒక్కటే యుపాయము. బ్రిటిషు వారిని యీ దేశమునుండి వెళ్లగొట్టి, అధికారము సంపాదించి, ప్రజలను అజ్ఞానమునందే యుంచి

తమ యధికారమును సుస్థిరము జేసుకొన వలయునను యాశతో, బ్రిటిషువారిపై వ్యతిరేక ప్రచారము జేయ నారంభించారు.

అనేక అసత్యముల కల్పించి బ్రిటిషు వారిని దుయ్యబట్ట సాగారు. వేయేల "వీరుహిందూదేశమును సర్వనాశనము జేయు చుంటిరి. ప్రజల్లారా! కళ్లుతెరవండి! మనదేశమును పాలించుకొను హక్కు మనకేగాని విదేశీయులు పాలించుట కధికారము లేదు.

ఐన బ్రాహ్మణేతరులపాలించుట కధికారము బ్రాహ్మలకు కలదా? ఇవ్విధమున స్వరాజ్య బీజాలు అంకురించినాయి. స్వరాజ్య నినాదము ప్రబలమయింది. దీనితోపాటు బ్రాహ్మణేతరులనన్యా యము జేయుచున్నారని "బ్రాహ్మణేతరోద్యమము" బయలుదేరింది. ఇట్టిపుద్యమ కర్తలు స్వల్పసంఖ్యాకులైన విద్యావంతు లగుటచేత, వీరికి బ్రాహ్మలు "అందరము కలసి స్వరాజ్యము తెచ్చిన దరిమిలా న్యాయము కలుగ జేసెదమని" చిలుక పలుకులు పలికి బ్రాహ్మణేత రోద్యమము నాశనము జేశారు.

దరిమిలా కాంగ్రెసు సంస్థను బలీయమొనర్చి విశేష ప్రచారము జేయుచుండిరి. నాయకులు అనేకసభల నేర్పాటుజేసి స్వరాజ్య విప్ల వమును ప్రజలందు కలుగ జేయుచుండిరి. వీరికి ప్రజలందు విప్లవశక్తి కలుగ చేయుట ప్రధాన కారణముకాదు. అందుకు వీరిని వినియో గించుకొని, స్వరాజ్యము లభించిన పిమ్మట పదవులు వచ్చునను యుద్దేశ్యముతో ప్రజలందు విప్లవశక్తి గలిగించుచుండిరి.

భారత జాతీయ మహాసభలు.

| వ॥ స॥ | ప్రదేశము | ప్రెశిడెంటు | సంవత్సరం |
|---|---|---|---|
| 1 | బొంబాయి | డబ్ల్యు. సి. బెనర్జి | 1885 |
| 2 | కలకత్తా | దాదాభాయ్‌నౌరోజీ | 1886 |
| 3 | మద్రాస్ | బదురుద్దీన్ తయాబ్జీ | 1887 |
| 4 | అలహాబాద్ | జివుల్ | 18:8 |

| వ॥ స॥ | ప్రదేశము | ప్రెశిడెంట్ | సంవత్సరం |
|---|---|---|---|
| 5 | బొంబాయి | సర్. డబ్ల్యు. వెడ్డరుబరన్ | 1889 |
| 6 | కలకత్తా | సర్. ఫిరోజిషా మెహతా | 1890 |
| 7 | నాగపూరు | పి. ఆనందాచార్యులు (?) | 1891 |
| 8 | అలహాబాద్ | డబ్ల్యు. సి. బెనర్జీ | 1892 |
| 9 | లాహోరు | దాదాభాయినౌరోజీ | 1893 |
| 10 | మద్రాస్ | ఎవెబ్ | 1894 |
| 11 | పూనా | ఎస్. ఎన్. బెనర్జీ | 1895 |
| 12 | కలకత్తా | ఆర్. ఎం. సియాని | 1896 |
| 13 | అమరావతి | సి. శంకరన్ నాయరు | 1897 |
| 14 | మద్రాసు | ఎ. ఎం, బోస్ | 1898 |
| 15 | లక్నో | ఆర్. సి. దత్తు | 1898 |
| 16 | లాహోర్ | ఎన్. జి. చంద్రావర్కరు | 1000 |
| 17 | కలకత్తా | డి. వాచా | 1901 |
| 18 | అహమ్మదాబాద్ | ఎస్. ఎన్. బెనర్జీ | 1902 |
| 19 | మద్రాసు | వాల్ మోహన్ ఘోష్ | 1903 |
| 20 | బొంబాయి | సర్. హెన్రీకాటన్ | 1904 |
| 21 | బెనారస్ (కాశీ) | గోపాలకృష్ణగోఖలే | 1905 |
| 22 | కలకత్తా | దాదాభాయినౌరోజీ | 1906 |
| 23 | సూరత్ | రాస్ బిహారీఘోష్ | 1907 |
| | మద్రాసు | | 1908 |
| 24 | లాహోరు | మాలవ్యా | 1909 |
| 25 | అలహాబాద్ | సర్. డబ్ల్యు. వెడ్డరుబరన్ | 1910 |
| 26 | కలకత్తా | బిషెన్ యన్. దారు | 1911 |
| 27 | పాట్నా | ఆర్. యన్. మదోల్కరు | 1912 |
| 28 | కరాచి | సయ్యద్ మహమ్మదు | 1913 |
| 29 | మద్రాసు | భూపేంద్రనాద్ బోస్ | 1914 |

| వ॥ స॥ | ప్రదేశము | ప్రెశిడెంటు | సంవత్సరం |
|---|---|---|---|
| 30 | బొంబాయి | ఎస్. పి. సిన్హా | 1915 |
| 31 | లక్నో | ఆర్. సి. మజుందార్ | 1916 |
| 32 | కలకత్తా | అనీబి సెంట్ | 1917 |
| 33 | ఢిల్లీ | హసన్ ఇమామ్ | 1918 |
| | (బొంబాయి అవసరసభ) | మాలవ్యా | 1918 |
| 34 | అమృతసర్ | మోతీలాల్ నెహ్రూ | 1919 |
| 35 | నాగపూరు | సి. విజయరాఘవాచారియర్ | 1920 |
| | కలకత్తా (అవసరసభ) | లాలాలజపతిరాయ్ | 1920 |
| 36 | అహమ్మదాబాద్ | హకీమ్ అజ్మల్ ఖాన్ | 1921 |
| 37 | గయ | చిత్తరంజన దాసు | 1922 |
| 38 | కాకినాడ | మౌలానా మహమ్మదాలీ | 1923 |
| | ఢిల్లీ (అవసరసభ) | అబ్దుల్ కలామ్ అజాద్ | 1924 |
| 39 | బెల్గాం | మహాత్మా గాంధీ | 1924 |
| 40 | కాన్పూరు | సరోజినీ నాయుడు | 1925 |
| 41 | గౌహతి | శ్రీనివాస అయ్యంగారు | 1926 |
| 42 | మద్రాసు | ఎం. కె. అన్సారీ | 1927 |
| 43 | కలకత్తా | మోతీలాల్ నెహ్రూ | 1928 |
| 44 | లాహోరు | జవహరీలాల్ నెహ్రూ | 1929 |
| 45 | కరాచి | వల్లభాయి పటేలు | 1931 |
| 46 | ఢిల్లీ | సేట్ రనఛోడ్ లాల్ | 1932 |
| 47 | కలకత్తా | మాలవ్యా | 1933 |
| 48 | బొంబాయి | రాజేంద్ర ప్రసాద్ | 1934 |
| 49 | లక్నో | జవహరీలాల్ నెహ్రూ | 1935 |
| 50 | ఫెయిజ్‌పూర్ | ,, ,, | 1937 |

| వ॥ సం॥ | ప్రదేశము | ప్రెశిడెంటు | సంవత్సరం |
|---|---|---|---|
| 51 | హరిపుర(గుజరాత్) | సుభాస్ చంద్రబోసు | 1938 |
| 52 | త్రిపురి | ,, | |
| | (రాజీనామాయిచ్చిన పిమ్మట) | రాజేంద్ర ప్రసాదు. | 1939 |
| 53 | రామ్‌ఘర్ | అబ్దుల్‌కలామ్ అజాద్ | 19.0 |

ఇవిధముగ కాంగ్రెసు వుద్యమము నడచుచుండ గాంధీ కొన్ని సాహస కృత్యములకొనర్చెను.

ఉపవాసత్యాగ్రహము:— ప్రతివ్యక్తి వుపవాసము నుపయోగించును గాన అధికారులను తగ్గించుటకై గాంధీగారు వుపవాస సత్యాగ్రహము జేశారు.

ఈస్వరాజ్య వుద్యమ సమయమున యిదొక విరోధకారణముగ పరిగణింపబడి స్వరాజ్య వుద్యమమునకు బలము చేకూర్చునని గాంధీగారు చెప్పినట్లే యొనర్చిరి,

సత్యాగ్రహము:—దౌర్జన్య రహితమై ప్రార్థనా పూర్వక సాధనము, అంటె హఠము.

ఈసత్యాగ్రహరీత్యా గాంధీగారు జైళ్ళకు వెళ్లు చుండిరి. వీరితోపాటు మరికొందరు. వీరినిజూచి ప్రజలు. అహింస—హింసా పూర్వకముగా స్వరాజ్యము సాధింపరాదట. అహింసా పూర్వకముగ లభించాలి. లభింపక పోయిన లభించినంతకాలము వేచియుండాలి. ఇందుకు సుబాస్ చంద్రబోస్ వ్యతిరేకియై "గాంధీ స్వరాజ్యము తెచ్చునా స్వప్నవార్త" యని కాంగ్రెసుకు రాజీనామా యిచ్చిరి,

వీరు యుద్ధముజేసిననె స్వరాజ్యము లభించుగాని ప్రార్థించిన స్వరాజ్యము లభింపదనిరి.

దరిమిలా గాంధీగారి ప్రభావము పూర్తిగా సాగింది. కాంగ్రెసులో పలుకుబడి హెచ్చింది. ప్రజల్లోను పలుకుబడి హెచ్చింది.

విదేశవస్తు బహిష్కరణ, యంత్రబహిష్కరణ మున్నగు నినాదములతో చేతివృత్తుల స్థాపనతో గాంధీ గారికి మరింత పలుకు బడి హెచ్చింది. ప్రజలు అజ్ఞానులగుటంజేసి గాంధీగారి అడుగు జాడల్లో నడచుచుండిరి.

ఇట్టి సమయమున బ్రిటిషు ప్రభుత్వము వారికి అనేక కష్టములు సంభవించినవి.

జర్మనీయందు హిట్లరు ప్రపంచము నంతయు జయింపవలెనని 1939 న బయలు దేరెను. ఇట్టిసమయమున రష్యా, బ్రిటను, అమెరికా యైక్యత జెంది హిట్లరును ప్రతిఘటించిరి.

ఇట్టిసమయమున హిందూదేశము సహాయపడిన జయించిన యనంతరము స్వరాజ్య మిచ్చెదమనిరి.

ఇంతకు పూర్వము జరిగిన ప్రథమ ప్రపంచ మహాసంగ్రామమును యిట్టిధముననే బొంకి సైన్య, ధనసహాయముల పొందిరి. దరిమిలా మీకు స్వరాజ్యము కావాలాయనిరి.

అందువలన ద్వితీయ సంగ్రామమందు బ్రిటిషువారికి సహాయ పడకూడదని సత్యాగ్రహము జేసిరి. అనేకమంది జైళ్లకు వెళ్లిరి.

దరిమిలా రష్యా, హిట్లరును పూర్తిగా యోడించెను బ్రిటను, అమెరికాలు పెట్టుబడిదారీదేశాలైనందున రష్యాకు ప్రబల విరోధులైరి.

ఇందువలన ఇండియాకు స్వరాజ్యమిచ్చి తమకష్టము అట్టి పెట్టుకొనవచ్చును గదాయనుకొనిరి. లేనియెడల రష్యాపక్షము వహించిన ప్రమాదము వాటిల్లగలదని, లేబరుప్రభుత్వ స్థాపకుడైన అట్లీ సందేశముద్వారా ఇండియాకు 15–8–1947 తారీఖున స్వరాజ్యము యిచ్చారు. మౌంట్‌బాటెన్ పదవి రాజగోపాలాచారి స్వీకరించారు. ప్రధానమంత్రిగా నెహ్రూనియమింపబడ్డారు.

గాంధీగారే జీవితమంతా త్యాగ మొనరించి స్వరాజ్యము తెచ్చారని ప్రజలు విశేషభక్తులై యింటింట గాంధీ విగ్రహపూజలే. రోడ్లన్నీ గాంధీవిగ్రహములే. గోడలన్నీ గాంధీచిత్రములే, జేబులో గాంధీ; పిన్నలో గాంధీ!! గుండీలో గాంధీ!!! అంతాగాంధీమయము. "జైమహాత్మాగాంధీకిజై" అనే నినాదాలతో ప్రతిధ్వనించింది.

# సింహావలోకనము

## పరిణామ వాదము

వానరదశలో ప్రకృతిని అర్థము జేసుకొని తన కష్టాలు సంపూర్ణముగా నివారించనందున, వానరముకన్న అధిక విజ్ఞానవంతుడైన మానవ యవతార యావశ్యకత కల్గినది.

మానవుడు ప్రకృతివైచిత్ర్యమున కాశ్చర్యవంతుడై ప్రతి విషయమును తెలుసు కోవటానికి ప్రారంభించాడు.

ఈ ప్రకృతి తనకంటె ముందుగానే యుద్భవించినది గాన దీని నెవరో సృష్టించియుండ వలెనని సిద్ధాంతము జేసుకున్నాడు.

ఈ ప్రకృతి శక్తులు క్రమబద్ధముగా నడచుటకు, యెవరో అనంతశక్తి ఆకాశముననుండి, యీ ప్రకృతి నిర్మించి నడపుచున్నాడని సిద్ధాంతము జేసుకున్నాడు

మానవుని బుద్ధిక్షణక్షణము మార్పుజెందుచూ విమర్శనా పూర్వకజ్ఞానాన్ని పొందింది.

ఎవరో అనంతశక్తి గలిగి సృష్టించి నాడంటే (దేవుడు) అతనికి మన వలెనే ప్రకృతి వుండాలి. అన సాకారుడు కావాలి ఇట్టి సాకారుడు మనవలె జనన మరణముల ననుభవించునుగాన, యితనిని సృష్టించిన దెవరు? ఆసృష్టించిన వానిని సృష్టించిన దెవరు?

ఈవిధమైన హేతువాదముతో మానవుడు క్రమేపీవిజ్ఞానము జెందుతూ అసలు ప్రకృతి సృష్టికారణము తెలుసుకోటానికి ప్రయాణము కట్టాడు.

కణాదుడు; బుద్ధుడు, భౌతిక పరిశోధనలచే కొంతవరకూ ప్రకృతి సృష్టికారణాన్ని తెలుసుకోగలిగారు.

ఈ ప్రకృతి సాకారమునుండి యుద్భవించలేదు, నిరాకారము నుండి యుద్భవించలేదు నిరాకారము నుండి నిరాకారము; సాకారమునుండి సాకారముద్భవించును. రూపగుణాదులు గలిగిన ప్రకృతికి రూపగుణాదులుగల పదార్థమే (అణువులే) కారణమన్నారు. ఈఅణువులు సంయోగము జెందుతూవుంటాయి. సంయోగము జెందినప్పుడు సృష్టికలుగుతుంది.

ఇలా హేతువాదముతో పరిశోధనలు జరుగుచుండ ప్రకృతి కారణాన్ని తెలుసుకుంటున్న సమయములో, శంకరుడు బ్రాహ్మణ మతానికి చెందినవాడగుటచే, బౌద్ధమత హేతువాదమును పరిశీలింపకపోగా, నశింపజేయుటె తనవిజ్ఞానము, ఆధిక్యతగా భావించి హేతు (భౌతిక) వాదాన్ని నామరూపాలు లేకుండా నశింపజేశాడు.

ఈ భౌతిక వాదాన్ని ఖండించి ప్రకృతిసృష్టికి కారణాన్ని చెప్పాలిసివచ్చింది. ఈవిషయము శంకరునికి అభేద్యమైంది.

నిరాకారము నుండి సాకారముద్భవించుటకు యేకారణము జెప్పినా నిలవనట్లగ పడుటచే "మాయను సృష్టించాడు. సాకారము కాదన్నాడు; నిరాకారము కాదన్నాడు మాయను మరేమిటంటే ? మరేమీ లేదంటాడు. ఇందువలన ప్రకృతి సృష్టికారణము బోధపడదు. మాయను సృష్టించి యిదేకారణ మంటాడు. ఇందువలన యిక తెలుసుకోవాల్సింది యేమీ లేదన్నారు. హేతువాదము నశించింది. ఇంతటితో హిందూదేశ హేతువాదము శంకరుని పుణ్యామా యంటూ విదేశాలకు పరుగెత్తింది.

దరిమిలా పాశ్చాతుల్యను పరిశోధనలు జరిపారు. వీరి హేతు వాదంశర వేగముగ నభివృద్ధి జెందింది. మన హేతువాదము శంకరుడు నశింప జేయకున్న నేటిపాశ్చాత్య పరిశోధన లన్నియు నాడు మన చేతనే జరిగియుండెడివి. మనమే ప్రపంచానికి మార్గదర్శకులయ్యే వారము.

అటువంటి యవకాశము పాశ్చాత్యులకు లభించినది. నేడు మనము పశువులవలె వారిదృష్టిలో కనబడుచున్నాము. దీనికంతకూ, స్వార్థపరులైన బ్రాహ్మణులు, బ్రాహ్మణ (ఆస్తిక) మతమే కారణము. ప్రకృతి సృష్టికి అణువులు కారణము. అణువుల సంయోగ శక్తికి మరొక శక్తి కారణమన్నాడు కపిలుడు

నేడు పాశ్చాత్యుల పరిశోధనవలన, అణువుల సంయోగమునకు మరొకశక్తి అవసమన్నారు. అణువులు పరస్పరం సంయోగము జెందే శక్తి (అణుపరస్పర సంయోగశక్తి) అణువుల్లోనేవున్న దన్నారు.

ఈవాదముతో అనంతశక్తి (దేవుడు) అగమ్య శక్తి అనవసరమయింది. దీనితోపాటు అజ్ఞానదశలో యుద్భవించిన దేవుడు అజ్ఞాన దశాంతమందు అజ్ఞానమందే లీనమయ్యాడు. ఇక దేవునితో అవసరము తీరింది. ఇక ఆపూజే పనికిరాదు.

ఆదిలో జీవులు లేక పదార్థమేవున్న జీవులెట్లుత్పన్నమయ్యెను?

జర్మను శాస్త్రజ్ఞుడైన "హేగెల్" యీవిధముగా సమాధానము జెప్పాడు. "లేనిదాన్నుంచి యేదీవుద్భవించదు." అణుసిద్ధాంతరీత్యా వున్నది పదార్థము కాన యేది వుద్భవించాలన్నా పదార్థమునుండే వుద్భవించాలి.

జడపదార్థము నుండి చేతనమగుప్రాణి యుద్భవించుటెట్లు ! లేనిదాన్నుండి యేదీ వుద్భవించదుగాన జడపదార్థము నుండియే

ప్రాణియుద్భవించినది. ప్రాణియంటె చేతనమయినది. ఈ చేతనము ప్రాణికి యెక్కడనుండి వచ్చినది? "లేనిదాన్నుండి యేదీవ్భుదవించదు." కాన పదార్థములో వున్న చేతనావస్తే పరివర్తన జెంది చేతనయుత మగు ప్రాణియైనది. దీనికి "ప్రాటోప్లాజమ్" (వికారిణి) యని పేరు.

ఈఅనాదిప్రాణి ఆకారం లేకుండా సూక్ష్మతరమైన, ఒకే అణు పదార్థము. ఇవిశరీర రహితంగా సముద్రములో తేలుతూ వుంటాయి.

ఇవ్విధమున ప్రాణియాత్రారంభ మైనది ప్రాణి తనరక్షణకై ప్రకృతి స్వరూపాన్ని వీక్షించాలసిన యవసర మేర్పడ కన్నును, వినటానికి చెవును- ఇవ్విధమున క్రమేపీ సర్వావయములు కలిగి సమస్త విజ్ఞానాన్ని కలిగిన మానవజన్మ వరకూ, ఒక్కొకయవయవాలాన్ని సృష్టించుకుంటో, దానితోపాటు కొంతజ్ఞానాన్ని పొందుతూ పరివర్తన జెంది మానవ దశయయ్యినది.

కోతిదశనుండి మానవుడుద్భవించిన నేటి కోతులును యేల మానవత్వము జెందుట లేదు?

వికారిణి క్షణక్షణము పరివర్తన జెందుతూ సమస్తావయమున వములు, విజ్ఞానము కలిగిన దశకావలయునని ముందు చూపుతో అనేక దశలు పరివర్తన జెందినది. ఇట్లు పరివర్తన జెందునపుడు ముందుబయలు దేరిన వికారిణి మరొకదశ జేరును. వెనుకటి వాని కన్నయిది ఒకదశ వున్నత స్థానమున నున్నది. వున్నతదశలో నున్న వానికి వెనుకటి వానితలంపు వుండదు. ప్రతిక్షణము వున్నతదశ జెందుటయే దీనిలక్ష్యము.

ఒకప్రాణికి పదిమంది సంతానము కలదు. అందుప్రథమ జన్మించినవే వున్నతదశ జేరుటకు చురుకు, బలము, జ్ఞానము కలిగినవిగా నుండును. అదనపు సంతానము క్రమేపీ శక్తిజ్ఞాన రహితము

లగును. అందువలన యివిమరొక దశ జెందుట కనర్హాములు. అవి ఆదశ యందే సంతోనముకనుచూ ఆలాగే యుండిపోవును.

ఈ సూత్రమే మానవులందును వర్తిస్తుంది. జ్యేష్టపుత్రుడే వంశకర్తగాని అదనపు సంతనము వంశకర్తలుగారు.

మానవదశకు పూర్వమే, యీవికారిణి దశలు గతించగా వీనిని మానవుడెట్లు తెలుసుకొనెను?

నాడు వికారిణి యెన్నిదశలను పొంది మానవదశ పొందినదో, నేడును గర్భాంతర్గత వికారిణి (ఏకకణజీవి) ఆయాదశల సంధిరూప ముల పొందియే మానవదశను పొందుచున్నది. ఈ పరిణామ వాద మును ప్రత్యక్షముగ బలపరచునది పిండశాస్త్రము. దీని నభ్యసించిన మీాసందేహములు నిస్సందేహములగును.

నాడుభూమి వృష్ణముగావుండ వర్షపాతములు సంభవించిన దరిమిలా భూమిచల్లనై సముద్రము లేర్పడుసమయమున, పుపరితలము నుండి ప్రవహించు బురదనీరు సముద్రమున లేక మరికొన్ని పల్లపు ప్రదేశముల ప్రవహించునపుడు, బురదతోపాటు జంతువుల అస్థిపంజ రములు కొట్టుకొని వచ్చేడివి. ఆబురద పొరగా బీటువేయును. అందు ఆబురదతో వచ్చిన అస్థిపంజరములు ఆపొరయందుండును. ఇట్లే కాలాతీతమగు కొలది అనేకపొరలుగా పరివర్తన జెందినది. నేడు ఆపొరలను త్రవ్విచూడగా ఆనాటి జీవవిశేషములు తెలియు వచ్చుచున్నవి. ఎంతటి అడుగుపొరలైన సంతటి పురాతన కాలముగా లెక్కించి వాని కాలప్రమాణమును నిర్ణయించుచున్నారు.

## ద్రావిడులు

వానరదశ వీడి మానవదశ ననుభవించుచూ హిందూదేశ మున వుత్తర భాగమున నివసించు నాదిమ జనులకు ద్రావిడులని పేరు.

క్రీ. పూ పదివేల వత్సరము లుండి యీ ద్రావిడులు న్నాగరికతాభివృద్ధి జేసిరి. విశేష మేథా సంపన్నులైనందున అచిరకాలములోనే విశేష నాగరీకులైరి.

తమనాగరికతను ప్రపంచమునకు చాటి మార్గదర్శకులయ్యారు. పరిపాలా వర్తకము జేయుచూ విశేష ధనవంతులవ్వారు. ఈ ద్రావిడులే విదేశములకు పోయినట్లుగా గాన నచ్చుచున్నదిగాని, విదేశీయులెవ్వరూ హిందూదేశమునకు వర్తక నిమిత్తమై వచ్చినట్లుగ పడుటలేదు. నాటి ప్రకృతి భీభత్సము విపరీతముగా నుండెడిది. అట్టి విషమపరిస్థితుల్లో నేనో చిన్న పడవల సహాయమున సముద్రములపై విదేశములకు పోయెడి వారన్న, వారి ధైర్యమును వర్ణింప సాధ్యమా?

అట్టి ద్రావిడులు వుత్తర హిందూస్థానమున నివశించుచూ విశేష నాగరీకులై యుండిరి,

ఇట్టి సమయమున అనాగరిక దేశ ద్రిమ్మరజాతి (నోమాడ్సు) యొకటి ద్రావిడులపై బడి ద్రావిడ నాగరికతను మట్టిపాలు జేశింది. ద్రావిడ నాగరికతా సర్వము మట్టి పాలయింది. ఏలన ద్రావిడులపై బడిన అనాగరిక జాతి (ఆర్యులు—బ్రాహ్మణులు) ద్రావిడ నాగరికతను తెలిసి కొనలేనందున ద్రావిడనాగరికత మట్టిపాలు కావలసి వచ్చినది. పరిపాలా కొంతకాలమునకు అగ్ని పర్వతముల వలననో, సింధునది వరదల వలననో పూర్తిగా భూగర్భస్థమయినది.

నేడు త్రవ్విపరిశోధించగా 'మహంజదారో' యనుశిథిల నగరము బయటపడినది. 'హారప్పా' యనుమరొక శిథిలనగరమున్నూ బయట పడినది. వీనియందులభించిన సీళ్లనుబట్టి వీరికి వ్రాత తెలియునని తెలిసికొను చున్నాము. ఈసీళ్లమీద వ్రాతకుడి నుండి యెడమకు వ్రాయబడినది. అట్టివి 247 సీళ్లు లభించినవి. ఈ 'మహంజదారో' వ్రాతస్పష్టముగా ద్రావిడుల వ్రాతయని హెరాస్ పండితుడు వచించుచున్నాడు.

ఈమహాంజదారోలో సీళ్ళవ్రాతనుండియే బ్రాహ్మీలిపి కల్గినదని "లాంగ్డన్" "హంటర్" "హెరాస్" మున్నగు విద్వాంసుల యభిప్రాయము.

## ఆ ర్యు లు

ఆర్యుల ప్రప్రథమ నివాసమెచ్చటని చరిత్ర కారులందు వాదోపవాదములు కలవు. అందు ఆర్యావర్త వాదము, మధ్యాసియా వాదము, ఐరోపాఖండ వాదము, ఉత్తరధృవమండల వాదము అను నాల్గు వాదములు కలవు.

## ఆ ర్యా వ ర్త వా ద ము

ఆర్యుల జననభూమి హిందూదేశమని కొందరు చరిత్రకారులు చెప్పుచున్నారు. ఈ వాదమును సమర్థించు గ్రంథము "ఋగ్వేదీయ హిందూదేశము."

ఇట్లు చెప్పుచున్న బ్రాహ్మణుల యాధిక్యతకు భంగము కలుగు చున్నది. ఏలన, ద్రావిడుల జయించి, నాశన మొనరించి. అధికారము జేయుచుండిరని చెప్పిన, బ్రాహ్మణేతరులునూ నవ్విధముననే బ్రాహ్మణుల జయించి అధికారులు కాగలరను నవకాశము నునశింప జేయుటకు, ఆర్యులు, ద్రావిడులు హిందూదేశమున జన్మించినవారేయని చెప్పుచుంటిరి. ఈ ఆర్యావర్త వాదమంత యసత్యపూరిత వాదము మరొండు లేదు.

ఆర్యులు మధ్య ఆసియానుండి హిందూదేశమునకు వలసవచ్చినటుల "వాసెన్" ప్రతిపాదించుచున్నాడు. ఇతనినే "షేగెల్" అనుసరించాడు. "మార్గోనాలు" "గోవెన్" బలపరచారు.

## ఐరోపా ఖండ వాదము

వాస్‌లోయరు జర్మనీయనియు, పెంకా పండితుడు స్కాండినేవియా, "కూన్, ముల్లర్," వుత్తర యూరప్, పోషే "రాకిటిన్

భాడువా ప్రదేశమనియు పలువురు పలువిధములుగా ప్రతిపాదించారు

## ఉత్తర ధ్రువమండల వాదము

డాక్టరు వారెన్ సూచించిన వుత్తర ధృవవాదము తిలకు గారివలన వృద్ధి జెందింది. వీరు "ఆర్కిటిక్ హోమ్ యిన్‌దివేదాస్" అను గ్రంథమును ఆంగ్లమున రచించిరి. ఇందువుత్తర ధృవవాదము సిద్ధాంతము జేయబడినది.

"ఉత్తర ధృవమునకు వుత్తరమున నొకనక్షత్రము కలదు. అదియే ధృవనక్షత్రము. ఉత్తర ధృవమునకు వెళ్లిచూచిన ఆధృవ నక్షత్రము నెత్తిమీదకుండును. తక్కిన నక్షత్రములు దానిచుట్టును కుమ్మరిసారె వలెతిరుగు చున్నట్లగపడును. అచ్చట ఖగోళ వుత్తరార్థ గోళమేకనపడును. ఆరునెలలు రాత్రి. ఆరునెలలు పగలు. ఇట్టి దీనినె యార్యులు మేరుపర్వతమని వర్ణించిరి.

ఆర్యులు వుత్తర ధృవమున నివశించినట్లుగా నచ్చటి వర్ణనలు వేదములందున్నవి. కాన ఆర్యులు వుత్తర ధృవమునుండి మధ్య ఆసియాకు, అనంతరము ఇండియాకు వచ్చినటుల విశ్వశింపవలయును.

హిందూ దేశముపై ఆర్యులు క్రీ. పూ 4 వశతాబ్దమున దండయాత్ర జేసి నట్లగపడు చున్నది వీరికి సాయమున పారశీకులు వచ్చిరి.

పారశీక భాషయందు "స" కారమును "హ" కారముగా వుచ్చరింతురు. అందువలన "సింధు" నదిని "హిందు" నది యనియు, "సింధు" దేశమును "హిందు" దేశమనియు పేర్కొనిరి. కాన నచ్చటి నివాసకులు హిందువులైరి. ఆర్యులును నట్లేపిలచిరి. ఆర్య గ్రంథములందు "హిందూ" శబ్దమే కాన్పింపదు. భరత ఖండము, భారతవర్షము, ఆర్యావర్తము, బ్రహ్మావర్తము, మున్నగు నామములతో హిందూదేశమును పిలచెడివారేకాని హిందూదేశమని పేర్కొ

నరు. ఏలన హిందువులన్నను, హిందూదేశమన్నను, ద్రావిడులకు, ద్రావిడ దేశమునకు చెందియున్నది. కాన హిందువులన్న ద్రావిడులు హిందూదేశమన ద్రావిడుల నివాసభూమి. కాన హిందూ మతమన్న ద్రావిడ (నాస్తిక) మతము.

ఆర్యులు ద్రావిడులను పూర్తిగా జయించిరి. ద్రావిడులు దక్షిణాపథము జొచ్చిరి.

ఆర్యులు మాంసభక్షకులు, సురాపానమును గ్రోలువారు, వారి పవిత్ర గ్రంథములైన వేదములందే యీవిషయము సుబోధకము. వేదములందును, స్మృతులందును ఆర్యులు మాంస భక్షకులైనట్లు జెప్పుకొను చున్నారు. మరియు ఇందుకు ద్రావిడులు నిరోధించు వారున్నా, అన ద్రావిడులు మాంసభక్షకులు కారు. మాంస భక్షకులైన ఆర్యులను తినరాదని నిరోధించెడివారట.

ఆర్యులు దేశ ద్రిమ్మరులైనందున విశేష అనాగరీకులుగా నుండిరి. పచ్చి మాంసమును భక్షించుచూ మృగములవలె, శిరమున వెంట్రుకలు పెంచుకొని పిశాచముల వతు భయంకరముగ గన్పట్టెడి వారు. అందు వలన వీరు ద్రావిడుల జయించి, ద్రావిడుల నాగరికత గ్రహించక పోగా సర్వనాశనము జేసిరి. ద్రావిడులను దక్షిణాపథము నకు తరిమిరి.

మరి కొంత కాలమునకు ద్రావిడుల నందరిని జయించి యెవ రెట్లు నడచుకొన వలసినది కొన్ని ధర్మముల శాసించిరి. మనుస్మృతి నుండి వానినిట వుదాహరితము,

శూద్రులు స్మృతి చదువరాదు. (2–16)
శూద్రునకు నీచమైన పేరులుంచ వలయును. (2–31)
శూద్రుడు ద్విజుని తిట్టిన నాలుక కోయ వలయును. (8–270)

బ్రాహ్మణుడు దుర్మార్గుడైనప్పటికి "నీవు చెడ్డ బాపన వాడవు యని సంబోధించిన బగబగ మండు పది యంగుళముల కర్రను నాలుకపై వుంచ వలయును" (8–271)

"బ్రాహ్మడు తన విధ్యుక్త ధర్మములనేల యాచరింపడు?" యనిన శూద్రునకు చెవి యందును, నోటను కాచిన తైలమును రాజు పోయింప వలయును (8_72)

శూద్రునకు బ్రాహ్మడు అపకారము జేసినప్పటికి ఆతనిని దండింపరాదు. దండించెనేని చేతితో కొట్టిన చేతిని నరుక వలయును, కాలితో తన్నిన కాలిని నరుక వలయును. (8-279, 280)

బ్రాహ్మణునితో సమానాసనమున శూద్రుని నింకైనా శూద్రుడు కూర్చున్న నాతని పిర్రలు కోయవలెను. (8-281)

బ్రాహ్మడు కనుపించు ప్రదేశము నందెల్లను ఉమ్మివేయరాదు. మూత్రవిసర్జన చేయరాదు. మలవిసర్జన చేయరాదు. చేసిన వాని పెదలు కోయవలెను, శిశ్నము నరుకవలయును. గుదమును కోయ వలెను. (8-282)

బ్రాహ్మణుడు చేసిన ప్రబల దోషమునకు, రాజు మరణశిక్ష విధించక వాని తల బోడిగ గొరిగినచాలు, మిగతా వారిని ప్రాణము తీయుటె ధర్మము (8-379)

సకల పాపకారియైనను బ్రాహ్మణుని దండింపరాదు. సురక్షితముగా మరొక దేశమున దిగ విడువవలయును, (8-380)

ప్రపంచమున బ్రాహ్మణుని కన్న మించిన వధ వేరొండు లేదు. కాన ప్రజలు మొదలుకొని రాజు వరకూ బ్రాహ్మణుని వధింప లేదు. (8-381)

శూద్రుని ధనము బ్రాహ్మణునిదే! (8-471)

బ్రహ్మ, శూద్రుని, దాస్యము కొరకే పుట్టించినాడు (8-413)

బ్రాహ్మణుడు మూర్ఖుడైనను, నీచుడైనను ముఖ్యదైవము (9-317)

చండాలురకు పీనుగమీాది బట్టలు, కుండ పెంకులతో అన్నము, ఇనుపముక్కల నగలు (10-24)

స్వర్గలోక ప్రాప్తికొరకు, జీవికకూ బ్రాహ్మణే తరులు బ్రాహ్మణ శుశ్రూష యొనరింపవలెను. బ్రాహ్మణ శుశ్రూషకుడను పేరు వడయుటే శూద్రునకు జన్మ సాఫల్యము. (10-122)

కాన శూద్రులు యితర వృత్తుల జేసి జీవించిన నేమిలాభము? బ్రాహ్మణ శుశ్రూషయే శూద్రులకు మోక్షము (10-123)

అట్లు యొనర్చు శూద్రులకు జీర్ణ వస్త్రములు, యెంగిలి అన్నము నొసంగ వలయును

బ్రాహ్మణుని "నీకేమి తెలియునవిన" శూద్రుడు ఆదినము నుండి బ్రాహ్మణుని కాళ్లు పట్టుకొన వలయును, (10-204)

ఇవ్విధమున ఆర్యులు ద్రావిడ సంఘమును ఘోర అన్యాయ చట్టముల బంధించిరి. నాటినుండి నేటివరకూ నవే అమలు నందున్నవి.

ఇట్టి వ్యవస్థ యందు ఆర్యులపై ప్రప్రథమమున దండయాత్ర జేసిన వాడు చార్వాకుడు. ఇతడు ఆర్యులు తదితరులకు చేయు అన్యాయములను ప్రజలందు ప్రచారము చేసెను. విప్లవ కర్తయై సంఘాన్ని పునః అభ్యుదయ పథానికి తీసుకెళ్లుటకు తన జీవిత మంతయు త్యాగ మొనరించిన త్యాగమూర్తి చార్వాకుడు.

ఆర్యులు (బ్రాహ్మలు) స్వర్గ, మోక్షాదులు తద్వారా ముక్తి గలిగిస్తామని ధన సంగ్రహణ, సేవ జేయించుకొనుట మున్నగు వానిని పూర్తిగ ప్రతిఘటించి ఆర్యుల అన్యాయము నుండి ద్రావిడులకు (హిందువులకు) న్యాయము కలుగ జేయుటకై ఆర్యుల కుతంత్రమంతయు ప్రజలకు బోధించె.

స్వర్గ నరకాదులు, మోక్షము వున్నవని రార్యులు, అటు వంటి మోసపు మాటలచే యాశ కలిగించి ధన సంగ్రహణ జేయుటె గాని ఫలితము శూన్యమని ప్రజలకు తెలియ జెప్పాడు చార్వాక మహాశయుడు. ఇతడు పరలోకాదుల విశ్వసింప నందున నాస్తికుడన బరగె. వున్నవని యార్యులని నందున "ఆస్తికు"లైరి.

ఆస్తికుల జీవనోపాధికి యడ్డువచ్చిన నాస్తికుల దూషించుటయే ఆస్తికుల కర్తవ్యమైనది. ఆస్తికు లధికారులైనందున నాస్తిక ప్రచారము నిరోధింప బడినది.

## బౌద్ధ విప్లవము

ఆర్యులందున్న అవినీతి, అసభ్యత, అన్యాయము, అధర్మము, స్వార్థము, సంకుచితబుద్ధి, ఇంత మంది విప్లవ కర్త బుద్ధుడుపవమునకు కారణమయ్యెడిని. న్యాయము కొరకు ఆర్యులపై దండెత్త వలసి వచ్చెడిని.

నాస్తికులే బౌద్ధ విప్లవకారకులు. ఈ బౌద్ధవిప్లవము ఒక వెయ్యి వత్సరములు సజీవముగా నుండి హిందూదేశ చరిత్రమును పవిత్ర మొనరించి ప్రపంచమునకు జ్ఞానజ్యోతిని ప్రసాదించింది,

గౌతముడు పాఠశాలకు వెళ్లినటుల, విద్యాభ్యాస మొనరించి నటుల, "లలితవిస్తారమను" గ్రంధము చెప్పుచున్నది.

బుద్ధుని చేతిలో 'ఉరగసార చందనపు కొయ్యపలక,' రత్నములచే పొదగబడిన బంగారుకలము; మంచిసిరా కలదు. అట్లు బుద్ధుడు విశ్వామిత్రుడను గురువు చెంతకు వెళ్లెను. అంతె బుద్ధుడు విశ్వామిత్రునితో నిట్లనియె. గురువర్యా! నాకుబోధింప వలసిన వర్ణ మాల యెద్ది? బ్రాహ్మిలిపియా? ఖరోష్టిలిపియా!" యని 64 లిపుల పేరులను పేర్కొనెను. ఇన్ని లిపుల పేర్లు బుద్ధున కప్పుడు తెలియవు కాన లలిత విస్తారగ్రంథరచనా కాలమునకు లలిత విస్తార గ్రంథకర్తకు తెలియునని మనము తెలియవలెను.

బ్రాహ్మిలిపి ఆర్యులకు తెలిసినప్పటికి వుపయోగించక, వేదమంత్రములను పారంపర్యముగా వల్లించెడివారు. వీరుయిట్లు గుప్తులకాలము వరకూ లిపిని విసర్జించి జ్ఞప్తిచేతనే సమస్తకార్యములు నిర్వహించెడివారు. అందువలన ఆర్యులు లిపికొరకు ప్రయత్నింపక

పోగా తెలిసిన లిపిని కొళ్ళనన్ని నోటితోనే బుక్కులను వల్లించెడి వారు.

ఆర్యులు హిందూదేశమునకు రాకపూర్వము ద్రావిడులకు చిత్రలిపి తెలియును. ఈ ద్రావిడులు వర్తకము చేయు విదేశముల కన్నింటికి చిత్రలిపిని నేర్పిరి.

ఐరియిలా ద్రావిడులు యీ చిత్రలిపి అనేక చిహ్నలుగా నున్నందున వీనిని బట్టి వున్నత లిపిని కనిపెట్టిరి.

అట్టి సమయమున ఆర్యులు హిందూదేశముపై దండెత్తి, ద్రావిడ నాగరికతను మట్టిపాలు జేశారు. అంత ద్రావిడులు దక్షిణ దేశమునకు వెళ్లారు.

చిత్రలిపిని ద్రావిడులు, పొనీషియనులకు నేర్పినందున-వీరు 22 అక్షరముల వర్ణమాలను గనిపెట్టి కుడినుండి యెడమకు వ్రాయు చుండిరి వీరి నుండి బాబిలోని యనులేగాక, క్రీ. పూ. 8 వ శతాబ్ద ములో గ్రీకులును నేర్చుకొనిరి. గ్రీకులనుండి రోమనులు యీ అక్షర మాలను నేర్చుకొనిరి. బాబిలోనియనులనుండి ద్రావిడ వర్తకులు యీ లిపిని హిందూదేశమునకు తెచ్చినటుల గాన్పించుచున్నది.

పొనీషియనుల 22 అక్షరములు 22 ధ్వనులుగా నున్నందున యందరును తమ భాషకనుకూలముగ మార్చుకొనుచుండిరి, ద్రావిడ వర్తకులు మెసపటో మియానుండి క్రీ పూ, 800 ప్రాంతమున నిటకు తెచ్చిన పిమ్మట బ్రాహ్మలు, విదేశీయాక్షరములని యెరుంగకుండ మార్చి యెడమనుండి కుడికి వ్రాయుట క్రీ. పూ. 500 నుండి ప్రారం భించిరని "బుహ్లారు" అభిప్రాయము

హిందూదేశములో వున్న సంస్కృతలిపి వేలకొలది యేండ్ల నుండి కలదని కొందర జ్ఞానులు తలంచుచున్నారు.

ఆర్యులకు లిపితెలియదనియు, పొనీషియా వర్తకులు బాబి లోనియా చనిరనియు, ఆ లిపిని బాబిలోనియనులు గ్రహించి

ద్రావిడ వర్తకుల కొసంగిరనియు క్రీ. పూ. పదియవ శతాబ్దము నుండి యీలిపి హిందూ దేశములో వర్తక వ్యవహారములకు గాను వుపయోగించు చుండిరనియు, దీని నుండియే బ్రాహ్మిలిపి కలిగిన దనియు, యింతకు పూర్వము ఆర్యులకు లిపి తెలియదనియు బహ్లారు, వీబరు, మెక్డ్సనాలు, వింటర్ నిట్జ్, రైస్ డేవిడ్సు మున్నగు చారిత్రిక పరిశోధక విద్వాంసుల యభిప్రాయమై వొప్పెడిని.

అప్పటికిని ఆర్యులు లిపిని వుపయోగించనందున బౌద్ధులే పాళీ సారస్వతాభివృద్ధిజేసిరి. దీనితోపాటు సంస్కృతమునూ నభి వృద్ధిపరచిరి. సంస్కృతమున బౌద్ధులు అనేక గ్రంథములు రచించిరి. వ్యాకరణము — శాకటాయనము. శాకటాయనుడు జైనపండితుడు. ఈశాకటాయన వ్యాకరణ మభ్యసించిన తమగౌరవమునకు భంగము కలుగునని నిషేధించిరి. దీనికే పాణినీయమను నామముంచి పరిగ్ర హించి రార్యులు. జైనేంద్ర వ్యాకరణము, కాతంత్ర వ్యాకరణము, సారస్వత వ్యాకరణము, చాంద్ర వ్యాకరణము మున్నగు సంస్కృత వ్యాకరణములు బౌద్ధులచే లిఖింపబడినవి. వీరు గ్రీకులనుండి పద్ధతిని గ్రహించిరి. కావ్యాలంకారము — కర్త భామహుడు, ఇతడుబౌద్ధుడు కావ్యములు—బుద్ధ చరిత్ర కర్త అశ్వఘోషుడు, పద్య చూడా మణియు నితనిచే రచింపబడినదే.

అమరకోశ నిఘంటువు. — కర్త. అమరసింహుడు. బౌద్ధుడు. ఇంకను అనేకనిఘంటువులు బౌద్ధులు నిర్మించిరి.

ఇవ్విధమున సంస్కృతమున బౌద్ధులు బెక్కు గ్రంథముల రచించి సంస్కృత భాషకు మహోపకారము జేసిరి.

బౌద్ధయుగమునకు పూర్వము ప్రపంచమున చిత్రకళయే లేదు. బౌద్ధులేతత్సామగ్రిని, తచ్ఛాస్త్రమును పరిశోధించి వ్యాప్తిజేసిరి.

సాంచి, సారనాథ్, అమరావతి, అజంతాగుహలే యిందుకు నిదర్శనము. వీనినెంతటి కఠినశ్రమకులోనై తొలచిరో ! శిలలపై నెన్నిచిత్రముల లిఖించిరో ? ఆహా ! బౌద్ధుల చిత్రకళా ప్రావీణ్యత.

హిందూ దేశమున బౌద్ధవిప్లవసేవ అపారము. నాగార్జునుడు బుద్ధధర్మమును ప్రచారము జేయుచూ అనేక వైద్య గ్రంథముల లిఖించెను. రసవిద్యలను పరిశోధించెను. అనేక అద్భుత పరిశోధనలు గావించెను. ఆహా ! బౌద్ధుల కార్యదీక్ష !!!

ఇట్లు దిన దినము ప్రవర్ధమై బౌద్ధవిప్లవము ప్రపంచమునకు మార్గదర్శక మయినది. ఆర్యులు బౌద్ధమతమును నాశనము జేయకున్న నేటి పాశ్చాత్య పరిశోధనలన్నియు నాడు బౌద్ధులే కనిపెట్టెడివారు. నేడు అమెరికా పొందుచున్న ధన, బల, గౌరవాదులు హిందూ దేశమను భవించెడిది.

ఇట్లు న్నతి పొందెడు బౌద్ధ విప్లవమును ఆర్యులు, గుప్తులను పేర యధికారులై నాశనము జేసిరి బ్రాహ్మణ (ఆస్తిక) మతమును పున రుద్ధరించుకొనిరి.

కాళిదాసు యీ నాటివాడే. ఇతనిచే రచింప బడిన గ్రంథములు పరిశోధించిన బౌద్ధయుగములోని వర్ణములనేకములు కలవు. ఇతడు సమస్త సంస్కృత కవులలో "చక్రవర్తి" బిరుదమును పొందిన వాడు. ఇతడు ఆర్యేతరుడు (శూద్రుడు). ఇతని నిజనామము మనకు తెలుపుట లేదు. కాళి యనుగ్రహము పొందిన వాడు శూద్రుడు. కాన "కాళిదాస"య్యె.

ఇతని యాధిక్యతను ఆనందవర్ధనాచార్యుడు యిలా తెలుపుచున్నాడు. గ్రంథములు రచించిన వారందరూ కవులు గారు. కవి వ్రాసిన దంతయు కవిత్వముగాదు. "యేనాస్మిన్నతి విచిత్ర కవి పరమ్పరా వాహిని సంసారే కాళిదాస ప్రభృతయో ద్విత్రాః పఞ్చషావా మహాకవయ ఇతిగణ్యన్తే" మహా కవులుగాగణింపదగిన వారు కాళిదాసు అతని యంత గొప్పవారెవరైనా యిద్దరో ఐదుగురో వున్న వారును, కాళిదాసంతటి వాడు మరెవ్వడు లేడుకాన కాళిదాసొక్కడే కవి. మిగతా వారందరూ కుకవులేయని యానందవర్ధనాచార్యుని భావము.

ఈ కాళిదాసే రామాయణ కర్త. అందు నిమిత్తమై శ్లోయ వాల్మీకియై రామాయణము రచించినట్లు తెలుపుచున్నారు.

ఇతి హాస త్రయము గుప్తుల కాలములో రచింప బడినవి. అందుకు ఆగ్రంథములే సాక్ష్యము.

బుద్ధునిచే మాంసభక్షణ నిషేధింపబడినది. అందునిమిత్తమై మాంసభక్షణ మహాపాపమని భాగవత భారత రామాయణాదు లందు చెప్పబడినది.

ఈ మూడును ఒక్కసారి రచింపబడినవే. పెక్కురుషులచే కథలు కల్పింపబడినందున ననేక పరస్పర విరుద్ధము లగపడుచున్నవి. "అసత్యం జనరంజక." యనురీత్యా అంతయు ప్రకృతివిరుద్ధములనే జొప్పించిరి.

భాగవతమున ఋషులు విష్ణుసాన్నిధ్యము నకు పోవుచుండ ద్వారపాలకు లడ్డగించ ఋషులు శపించిరి. అందువలన ఆద్వార పాలకులు భూలోకమున జన్మించి విష్ణువుకు విరోధులై మూడుజన్మ లలో ముక్తి పొందిరట

ఇట్లు కథ నుపక్రమింపజేసి ఆర్యద్రావిడ యుద్ధమును కథా మాతృకగా గ్రహించి భారతమును, దరిమిలావున్న ద్రావిడులను జయించుటకు ఆర్యులు పడిన అగచాట్లను "రామాయణముగా" రచించిరి. ఇందులెక్కకు మిక్కుటముగా కల్పితములే.

కాన భాగవత మాదిగ్రంథము. దరిమిలా భారతము. ఆపైన రామాయణగాథ. ఇట్లున్న రామాయణమును తలక్రిందులుజేసి ఆది గ్రంథముగా పేర్కొనిరి. రామాయణగాథయే ముందుగా జరిగినట్లు చెప్పబడినది. ఇట్లు అనేక పరస్పర విరుద్ధములగపడుచున్నవి.

అన్నిటికంటె ప్రబలనిదర్శనమేమన బుద్ధుని కూడా ఒక యవతారముగా పేర్కొన్నారు. లేనియెడల వారు చెప్పునది ప్రజల కాకర్షణీయము కాదని బుద్ధుని, బుద్ధధర్మములను పూర్తిగా వారి గ్రంథములందు జొప్పించి అవిసూతన ధర్మములైనట్లును చెప్పుకొనిరి.

బౌద్ధవిప్లవమున ప్రజలు బౌద్ధధర్మముల నాచరించుటచే, బౌద్ధధర్మములు తమ ధర్మములగ జెప్పకొని, వీరి మాంస భక్ష ణాదులు, ద్రావిడులకు కల్పించారు. సంఘమందు తమపై గౌరవము కలుగునట్లు, ద్రావిడులపై ద్వేషము కలుగునట్లు గ్రంథము లన్నియు తమ పరముగా సృష్టించుకొనిరి

అందువలననే బౌద్ధయుగమునుండి బ్రాహ్మణులు మాంస భక్షణ పూర్తిగా మానివేసిరి. పైగాతినువాడు నీచుడనిచెప్ప మొద లిడిరి. నేటికిని విశేషసంఖ్యాకులైన బ్రాహ్మలు మాంసభక్షకులే.

గుప్తులు బౌద్ధుల నాశనము జేయుచుండ ఆర్యులు కల్పిత గాధల సృష్టించు చుండిరి. జయవిజయుల యవతారములనే కథావస్తు వులుగా గైకొని తత్పూర్వము జరిగిన ఆర్యద్రావిడ యుద్ధము భార తముగా ఒకడు కల్పితగాధలతో సృష్టించె. మరి యొకడు దరిమిలా సింహళముననున్న ద్రావిడుల వశపరచుకొన్న గాధను రామాయణ ముగా సృష్టించె. ఆదిగ్రంథము భాగవతమయ్యె. వీనిని కాళిదాసు శ్లోకరూపమిచ్చి సంస్కృతమున రచించె. కానసామాన్య జనులెవ్వరూ వీటిని చూడరుగదాయని వారిపుర్రెకు పుట్టిన బుద్ధినంతయు వినియో గించిరి. బౌద్ధమతాన్ని నాశనముజేసి, తమగ్రంథముల ప్రచారము లోనికి తేవలయునని ఆతురతతో కల్పింపబడి నదిగాన అనేక పరస్పర విరుద్ధములు, ప్రకృతి విరుద్ధము లగపడు చున్నవి.

(1) "కర్ణుడు సద్యోగర్భమని (భార. ఆది 5-25)
కర్ణుని పదినెలలు మోసి ప్రసవించినట్లు (భార. అర 7-339)

(2) 'ష్మడు ధర్మరాజుతో శుకనిర్యాణమును చెప్పెను (భార. శాంతి. 332)

'ష్మమరణా నంతరం జన్మించిన పరీక్షిత్తుకు శుకుడు భాగ వతమును చెప్పెను.

(3) త్రేతాయుగములోని వశిష్ఠ విశ్వామిత్రులు, ద్వాపర యుగాంతమందలి పరీక్షిత్తును చూచుటకు వచ్చిరి. 8 లక్షల 64 వేల సజీవులా ? (భాగ. స్క-)

(4) హిరణ్యకశిపుడు తపస్సుకు పోవునపుడు అతని భార్య లా వతి గర్భవతి. నూరువత్సరములు తపస్సు చేసి యింటికి రాగా కుమారునకు 5 సంవత్సరము లుండెనట.

(5) దశరథునకు 60 వేల వత్సరముల వయస్సు వచ్చి నప్పటికీ సంతతిగలుగ లేదు. పైగా 350 మందిభార్యలు కలరు. సంతానముకొరకు పుత్రకామేష్టి యాగము ప్రారంభించినాడు. (రామా. బాల. 292)

ఈగాథలన్నిటి యందును తమను రక్షించు ధర్మములు, బ్రాహ్మణేతరుల యధః పాతాళమునకు త్రొక్కు ధర్మములను కల్పించిరి.

తాము శ్రేష్ఠులైనట్లుగా, దేవతలుగా వర్ణించుకొని తమకు విరోధులైన ద్రావిడులను (హిందువులను) వికృత స్వరూపులుగా, అవినీతి పరులుగా వర్ణించారు.

ఇవ్విధమున బ్రాహ్మణేతరులను యవమాన పరచు గ్రంథములను బ్రాహ్మణేతరులు ముట్టుట మహా దోషముకాదా? మనను (హిందువులను) సర్వనాశనము జేయుటకు సృష్టించిన యీ అసత్య కల్పితగాథల విశ్వసించుట మన కవమానముకాదా? ఆస్తికమతమును సృష్టించి దేవుని పేరుతో మనలను సర్వనాశనము జేయు యీ బ్రాహ్మణులను, బ్రాహ్మణ గ్రంథములను గౌరవించుట మన కగౌరవముకాదా?

బ్రాహ్మ లేనాడో యీ పురాణముల పరిత్యజించి వున్నత విద్యనభ్యసించుచు ఆస్తిక మతమును పరిత్యజింప, అజ్ఞానులగు బ్రాహ్మణేతరులు ఆస్తిక సిద్ధాంతములను, విశ్వసించుట యెంత యవివేకము? కన్నులుండి చూడలేక పోతున్నారా? చెవులుండి వినలేక పోతున్నారా? బ్రాహ్మణు లేనాడో ఆస్తిక మతమును పరిత్యజించి విజ్ఞానులై నాస్తికులైరి. బ్రాహ్మణేతరుల యజ్ఞాన మందే యుంచి ఆస్తిక సిద్ధాంతముల చలామణి జేయుచూ, తద్వారా తమ జీవితముల సలక్షణ సురక్షితమున గడుపుచున్నారు.

కాన బ్రాహ్మణేతరులు తక్షణమే ఆస్తిక సిద్ధాంతముల పరిత్యజింపవలెను. బ్రాహ్మణ దాస్యాన్నుండి ముక్తులు కావాలంటే తక్షణమే ఆస్తికమతాన్ని పరిత్యజించాలి. సత్యగ్రంథములు చదవండి. విజ్ఞానులుకండి.

గుప్తరాజుల దరిమిలా యార్యులకు రాజ సహాయము లభింప నందున కుమారిల, శంకరుని వరకూ ఆలాగేవుండి పోయారు.

దరిమిలా కుమారిల, శంకరునిచే బౌద్ధమతము సంపూర్ణముగా నశింపజేయ బడినది.

శంకరుడు కొన్ని వందల శిష్యులతో హిందూదేశము మంతయు పర్యటన జేయుచూ బౌద్ధస్థూపముల, విహారముల, గుహాల నామ రూపాదులు లేకుండా పడగొట్టించి, అడ్డుపడిన బౌద్ధుల చిత్రవధజేసి అట్లు, బౌద్ధమతమును నశింపజేయుచు బ్రాహ్మణమతమును (ఆస్తిక) పునః స్థాపించారు.

బౌద్ధకట్టడముల, గ్రంథముల, బౌద్ధుల సర్వనాశనము జేసి నది బ్రాహ్మణులు. బ్రాహ్మణ దేవాలయముల నాశనము జేసినది మహమ్మదీయులు. కాన బౌద్ధస్వర్గ్యమే మహమ్మదీయు లకులేదు.

మహమ్మదీయులొచ్చునప్పటికే బౌద్ధమతము సర్వనాశనము జెంది యున్నది. దరిమిలా బ్రాహ్మలు తమ దేవాలయముల ప్రతి ష్ఠించి పుణ్యక్షేత్రాలుగా యొనర్చి, విశేష దేవాలయ ధనము కలిగి యుండిరి. ఈ నాడు మహమ్మదీయులు ప్రవేశించిరి. బ్రాహ్మణ దేవా లయముల దోచుకొనిరి. అంతియే కాని బౌద్ధమతమునకు మహమ్మ దీయులకు యే విధమైన సంబంధము లేదు. కాన బౌద్ధకట్టడముల మహమ్మదీయులే పడ గొట్టిరను బ్రాహ్మణ వ్రాతలకు ఆస్కారము లభింపదు. ఆదోషమంతయు మహమ్మదీయులపై బెట్టితాము గౌరవింప బడుచుండిరి.

ఇవ్విధమున బౌద్ధమతమును నామరూపాదులు లేకుండా నాశ నము , భాగవత, భారత రామాయణము మున్నగు ఆస్తిక గ్రంథము

లను ప్రచారములోనికి తెచ్చారు. ఈగ్రంథములతోనే సరిపెట్టుకొనక 18 పురాణముల రచించిరి. ఈభాండసమంతయు బ్రాహ్మణ యంతః కలహమని చెప్పవచ్చు.

బౌద్ధుల నాస్తిక మతమును నశింపజేసి ఆస్తిక మతమును స్థాపించారు బ్రాహ్మలు. తద్వారా దేవుడుపరలోకాదులు వెలసినాయి. తద్వారా స్వర్గము. మోక్షము. వీనిని బ్రాహ్మలు గుత్తకు తీసుకున్నారట. స్వర్గమునకు మోక్షమునకు పంపించే అధికారముకలదట. అందునిమిత్తమె బ్రాహ్మణేతరులకు బ్రాహ్మణదాస్యము తప్పనిసరి యయినది. లేనిదేవుని తమరక్షణకై కల్పించి దైవమహత్తును ప్రచారము చేయసాగారు. కూర్చుంటేరామ! నిలబడితేరామ!! దగ్గితే రామ!!! తుమ్మితేరామ!!!!

ఇట్టిభక్తి యున్మాదస్థితిలో సంఘము దరిదాపుగానక బ్రాహ్మణ దాస్యానికి బలియయినది.

బ్రాహ్మలు దేవతలుగా పరిగణింప బడుచూ, బ్రాహ్మణేతరులచే కాళ్లుకడిగించు కొనుచూ, కాళ్లకు మ్రొక్కించు కొనుచూ, ధనసంగ్రహణ జేయుచూ పశువులవలె జూచెడివారు. అట్లు బ్రాహ్మణులకు దాస్యము జేయుట బ్రాహ్మణేతరులకు ముక్తియట! మోక్షమట!! జీవితసాఫల్యమట!!! బ్రాహ్మణేతరుల ఆస్తిపై, స్త్రీలపై బ్రాహ్మణులకే సర్వాధి కారముకలదట. వారుకోరిని మనః పూర్వకముగ సమర్పింప వలయునట.

## మహమ్మదీయులు

ఆహా! ఇట్టిసమయమున యేదేవుడైన వచ్చియడ్డు పడక పోయిన బ్రాహ్మణేతరులకు జరుగు అన్యాయము వర్ణింప నాశక్యమా?

దేవుళ్లలాగా మహమ్మదీయులు వచ్చి బ్రాహ్మణేతరులను రక్షించారు. లేకున్న బ్రాహ్మణ దాస్యానికి బలియై యెంతటి నీచ

జీవి ముల ననుభవించెడివారమో. బ్రాహ్మణేతరులను నిట్టి విపత్తు సం రక్షించిన * మహమ్మదీయులకు వందన సహస్రములు.

మనలను రక్షింపక పోగా, తీరని దాస్యానికి బలిచేసిన బ్రాహ్మణులను, దేవుళ్ళను కాళ్ళదన్ని, మనల రక్షించిన మహమ్మదీయుల గౌరవించుట మన ధర్మమైయున్నది.

మహమ్మదీయ మతమన, బ్రాహ్మణ మతమువలె నమ్మిన వారిని నాశనము జేయునదికాదు. "సమానత్వము, సోదరత్వము, సౌభ్రాతృత్వము" కలిగి బ్రాహ్మణమతముకన్న వేయింత లున్నత స్థానమునన్నది. అట్టి దివ్యమతము హిందూదేశమును పవిత్రమొనరించుటకే యేతెంచినది గాబోలు. ఇదే యవకాశముగా బ్రాహ్మణేతరులు నూటికి నూర్గురు మహమ్మదీయ మతాన్ని స్వీకరించి వలసినది.

మహమ్మదీయ రాజులను జయించలేక హిందూరాజులు పోరాటము జేసి తమ ప్రాణములనైనా నర్పించెదమను మూర్ఖులగుటచే, అపవ్యము గానడచి హిందూ–మహమ్మదీయ ద్వేషానలము ప్రజ్వరిల్లినది.

బ్రాహ్మణులకు సంపూర్ణముగ మహమ్మదీయులపై ద్వేషము వుండియేయున్నది. అందువలన మహమ్మదీయులను యీ దేశమునుండి వెళ్ళగొట్టి పునః తమ సంపూర్ణ కపటనాటక మాడవచ్చునను యాశచే, హిందూ దేశ రాజులకు పౌరుషము బోధించి, ప్రాణములైనా నర్పింతుగాని మహమ్మదీయులతో సంధి మాత్రము జేసికొనవలదని రెచ్చగొట్టి సర్వనాశనము జేసిరి. సిక్కులు, రాజపుత్రులు, మహా

* బ్రాహ్మణులకు విదేశీయులంటే వర్ణింపరాని క్రోధద్వేషములు. మహమ్మదీయులను- మ్లేచ్ఛులుగా, తురకలుగా మున్నగు తిట్టుపదములచే శపించెదరు. ఏలన హమ్మదీయులువచ్చి తమయాట సాగనివ్వకుండా అడ్డుపడ్డారనే ద్వేషము. ఇలాగే వరైనా విదేశీయులు వచ్చి తమకపట నాటకమును సాగనివ్వరను వుద్దేశ్యముతో పూర్వమున్న సముద్ర యానమును నిషేధించారు. చూచారా? బ్రాహ్మణుల సర్వకాల సర్వావస్థలయందును మనల నజ్ఞానులజేసి దాస్యము జేయించు

రాష్ట్రీలు, బ్రాహ్మణులచే రెచ్చగొట్టబడి, అమాయకులై మహమ్మ్మదీయుల నెదుర్కొని మహమ్మదీయవాడి ఖడ్గములకు బలియయ్యారు.

న్యాయమునకు హిందూరాజులు అంతఃకలహములతో నుండిరి. కాన ఐకమత్య విహీనులై యుండిరి. అట్టి సమయమున మహమ్మదీయుల నెదుర్కొను శక్తిలేనందున యుద్ధముచేయుట మహాపచారము. తాముచు మహమ్మదీయ మతముచు స్వీకరించి సామంతులై తమ దేశముల పాలించుకొనిన హిందూదేశమున కింతటి దుర్గతి సంభవించవుగదా? హిందూమతము మహమ్మదీయ మతమునకు లీనమయిన హిందూదేశము యిట్టిహీనస్థితియనుభవించదుగదా! ఆంగ్లేయు లెలహిందూదేశమును స్వాధీనపరచుకొనెదరు? ఏకనాయకత్వము ఏకమతము అయిన, మహమ్మదీయ పరిపాలన నడచుచున్న ఆంగ్లేయులు హిందూదేశమును జయించెడివారా? పాలించెడివారా? ఆంగ్లేయుల దాస్యమనుభవించెడివారమా? ఏబదివత్సరములు స్వరాజ్యమునకు పోరాడవలసిన యగత్యముండెడిదా? స్వరాజ్యమిస్తే పుచ్చుకొని "నేడు మేము స్వరాజ్యము తెచ్చాము. ఎంత గొప్పనాయకులము." అనుకునేవారికి ఆస్కారము లభించేదా? హిందూముస్లిమ్ అంతఃకలహము లుండెడివా? దేశవిభజన జరిగెడిదా? ప్రజాయుద్ధముండెడిదా? పరస్పర కలహ ప్రభుత్వములుండెడివా? నేడు "యెవరికి వారే యమునతీరే" యనుటకు ఆస్కారము లభించెడిదా? ఒకదేశమందు పరస్పర కలహప్రభుత్వములుండుట దేశస్వాతంత్ర్యమునకు హానికాదా? ఈ విధముననున్న సంపూర్ణదేశము సర్వదా, స్వరాజ్యము సుస్థిరమన గలదని యే రాజకీయవేత్తయినా జోస్యము చెప్పగలడా?

ఈ వాక్కులు శూలముపోటువలె స్వార్థపరులైన బ్రాహ్మణులకు బాధకలుగవచ్చు. స్వార్థరహితులకు, దేశక్షేమాన్ని, స్వాతంత్ర్యాన్ని వాంఛించే దేశభక్తులకు సత్యముగా గన్పట్టును.

ద్రావిడులు ఆర్యశక్తిని జయించలేక, ద్రావిడత్వమునకు నీళ్లు వదలి ఆర్యులందె లీనమై, ఆర్య అన్యాయ చట్టములకు కట్టుబడి వుండలేదా? నేటికిని బ్రాహ్మణమతమునే స్వీకరించిరిగదా? బ్రాహ్మణ

యు, కారమునసే యుండిరిగదా? నాటినుండి నేటివరకూ బ్రాహ్మణ ఆజ్ఞలను శిరసావహించి దాస్యము జేయుటలేదా?

జయించలేని యెడల జయింప బడిన శక్తి యుండదు. పరాజిత శక్తి లీనమవుట ప్రకృతి ధర్మము.

హిందూమతము, మహమ్మదీయమతమును జయించలేనియెడల ఆమహమ్మదీయ మతమందే హిందూమతము లీనమవుట ధర్మము. అట్లు లీనముగాక ఒక్క దేశమున రెండు మతములుండుట వలననే వర్ణింపరాని కష్టనష్టములకు హిందూ మహమ్మదీయులు గురియయ్యారు దేశానికో? తీరని దాస్యము సంప్రాప్తించింది. మహమ్మదీయ మత మందు హిందూమతము లీనమయ్యిన ఏక మతము, ఏకనాయకత్వము క్రింద ఆంగ్లేయులు సలాములు జేస్తూ వర్తకము జేసుకొనెడివారు. స్వప్నమందైనా హిందూదేశమును పాలించెడివారు కారు. హిందూ దేశము దాస్యమనుభవించవలసిన యగత్యముండెడిదికాదు.

ఇది సహించని వారు ద్వంద మతములు, ప్రభుత్వములు వుం డుట వలన కలిగిన లాభములేమిటో? సెలవిస్తారా?

మానవుడెప్పుడూ విజ్ఞానాన్ని యభిలషించుచూ తన కష్టాలను దూరము జేసుకొనుటకే ప్రయత్నిస్తున్నాడు కాన, అట్టి విజ్ఞానము కలుగజేసి, తనకష్టాలను దూరమొనరించి తన జీవితాన్ని యేమతము, యే ప్రభుత్వము సుఖనంతము జేయునో? అట్టి మతాన్నే, అట్టి ప్రభు త్వాన్నే ప్రతివ్యక్తి వాంఛించుట వ్యక్తిస్వాభావిక ధర్మము! నాగ రికతా చిహ్నము!. అభ్యుదయ మార్గము!!!

బ్రాహ్మణ మతముకన్న అత్యుత్తమైన సోదరత్వము-సమా నత్వము-సౌభ్రాతృత్వము కలిగినదివ్య పవిత్ర మహమ్మదీయ మత మును హిందువు లందరు స్వీకరించాల్సింది.

ఈమాట స్వార్థపరులైన బ్రాహ్మణులకు ప్రాణాపాయముగ న్నవచ్చు. మీరుయెంత అన్యాయము జేసినను మీమతానికే

కట్టుబడి వుండాలంటూరా? మీరెంతటి నీచాతి నీచముగ చూచు చున్నను మిమ్ముల గొప్పవారిగా భావించాలంటూరా? మమ్ముల యజ్ఞానులజేసి మాచేత దాస్యము చేయించు కుంటూవున్న మీ బ్రాహ్మణులకు మేము పరమతము స్వీకరించుట ప్రాణాపాయముగ గన్పట్టుట యాశ్చర్యమేమి? పరమతము స్వీకరింప కుండుటకై మహమ్మదీయులపై మా కమిత ద్వేషము కలిగించారు. పైగా మహమ్మ దీయులను యీ దేశమునుండి వెళ్లగొట్టుటకు మమ్ములను (హిందు వులను) రెచ్చగొట్టి మహమ్మదీయులపైకి యుద్ధానికి పంపారు. మేము చిత్రవధలు జేశాము. చేయబడ్డాము. మీరు (బ్రాహ్మణులు) సురక్షితముగ నున్నారు. పునః మాచేత దాస్యము చేయించు కుంటున్నారు. మమ్ముల యజ్ఞానావస్థలోనే అట్టిపెట్టారు. ఇందుకా? మీరు మహమ్మదీయులపై ద్వేషము రెచ్చగొట్టి మహమ్మదీయు లతో పోరాడు మనునది? ఔరా! బ్రాహ్మణ కుతంత్రములకు అజ్ఞానులై హిందువులు చెవియొగ్గారు. ఇకనైనా బ్రాహ్మణ కుతం త్రము తెలుసుకోండి. మనచేత (హిందువులచేత) మహమ్మదీయులను యీ దేశమునుండి వెడలగొట్టించి, పునః మనుస్మృతి బూజుదులు పుటకు ప్రయత్నించారు ప్రయత్నిస్తున్నారు.

మనుస్మృతి ధర్మములను లోగడ చెప్పియే యున్నాను. పునః వాని నొకసారి స్మరింపుడు.

బ్రాహ్మణేతరుల యాస్తిపై, స్త్రీలపై బ్రాహ్మణులకు సంపూ ర్ణాధి కారము కలదట"

ఇట్లు బ్రాహ్మణుల చేత బ్రాహ్మణేతరులు మానాభి మాన ములు మంటగలువు సమయమున దేవతలవలె మహమ్మ దీయులు వచ్చి అడ్డుపడ్డారు. లేనియెడల బ్రాహ్మణులు చేయు దురా గతముల నర్ణించు టెందులకు? వూహించుకోండి!

అట్టివిపత్తునుండి హిందువుల రక్షించి మానాభి మానముల నిలిపి, బ్రాహ్మణ దాస్యానుండి ముక్తులజేసి, మాకు మానవత్వము

ప్రసాదించిన మహమ్మదీయులకు మేము (బ్రాహ్మణేతరులము) యెంతో రుణపడి యున్నాము ఆరుణము తీర్చుకోవాలంటె, చేసిన మేలు మరువకుండా కృతజ్ఞులు కావాలంటే తక్షణమే మహమ్మదీయులపై నున్న ద్వేషాన్ని విసర్జించండి. సోదరులుగా ప్రేమించండి. మనకిదె రక్ష. తక్షణకర్తవ్యము. అట్లుగాక బ్రాహ్మణకుతంత్రములకు చెవియొగ్గితో? తీరని దాస్యము. నీచాతి నీచమైన బ్రతుకు. కాన తక్షణమే బ్రాహ్మణుల కాలదన్ని మహమ్మదీయుల గౌరవించండి. మనల రక్షించినవారిని గౌరవించండి. నేటికిని ప్రక్కన పాకీస్థాను వుండబట్టె మనము మానవులుగా పరిగణింపబడుచున్నాము. కొంతవరకైనా బ్రాహ్మణులచే గౌరవముగా చూడబడుచున్నాము. లేనియెడల బ్రాహ్మణేతరులు యెంతటి నీచబ్రతుకు బ్రతకవలసివచ్చెడిదో? మహమ్మదీయులరాక పూర్వము బ్రాహ్మణేతరుల నీచాతినీచబ్రతుకే. ఆ మనుస్మృతిధర్మము లే నాడు అమలునందుండలేదా? మహమ్మదీయులే లేనియెడల నేడు మాత్రము యెందుకు అమలునందుండవు? మహమ్మదీయులు హిందూదేశములో వున్నందువలననే బ్రాహ్మణేతరులు నేడు మానవులుగా, గౌరవముగా పరిగణింపబడుచున్నారు. జీవించుచున్నారు. చదువరులు విశాలదృష్టితో యీ విషయాన్ని అవగాహన చేసుకొందురు గాక.

మనచే మహమ్మదీయుల వెడలగొట్టించి, మనపై సర్వాధికారములు చలాయించవలెననే బ్రాహ్మణులు, ఆర్. యస్. యస్. సనాతనిష్టులు మున్నగువారందరు అందుకే అహర్నిశలు కృషిచేస్తున్నారు. ఈ విషయము మీరు గమనించాలి. పైసంస్థలను నామరూపాదులు లేకుండా నశింపజేయాలి. ఆనాడు మనకు ముక్తి. లేనియెడల వీరు తిమ్మిని బొమ్మిని, బొమ్మిని తిమ్మిని జేసి అంతా వని జేస్తారు, తరువాత ప్రయోజనము శూన్యము.

నమ్మిన వారిని నాశనముజేయు బ్రాహ్మణమతము యెవరికావాలి? లేని స్వర్గనరకాదులు, దేవుని కల్పించి ధనసంగ్రహణ

వేయు నాస్తిక మతము యెవరికావాలి? నమ్మినవారిని అజ్ఞానుల జేసి అన్యాయ చట్టముల పాలించు బ్రాహ్మణాధికారము యెవరికావాలి. విప్లవశక్తిని నశింపజేసి అభ్యుదయాన్ని ఖూనీచేసే బ్రాహ్మణ సిద్ధాంతము లెవరికావాలి? ఈ ప్రపంచము సురక్షితముగా నున్నంతవరకు మమ్ముల అజ్ఞానులజేసి దాస్యము జేయించుకొంటూ మా జీవితాలను కష్టాలకే బలియొసంగి, యొసంగిదలచిన, యీ ఘోరకిరాతక – దుష్ట, ద్రోహ బ్రాహ్మణులను బ్రాహ్మణ (ఆస్తిక) మతాన్ని యీ క్షణముననే పరిత్యజించుచున్నాము, ఆశ్రద్ధమును పరిత్యజించినట్లు, బ్రాహ్మణులను బ్రాహ్మణ సిద్ధాంతములను యీ క్షణముననే పరిత్యజించుచున్నాము.

ఆర్యులు ద్రావిడుల జయించి యెంతటి ఘోర అన్యాయ చట్టముల సృష్టించి, యజ్ఞానులజేసి, దాస్యము జేయించుకొనుచూ–నీచాతినీచముగ జూచినారో! నేటికిని నవ్విధముననే ఆర్యసంతతియైన బ్రాహ్మణులు ద్రావిడసంతతి శూద్రుల జూచుచున్నారు. ఐన,నేడు ద్రావిడసంతతియైన బ్రాహ్మణేతరులము, ఆర్య సంతతియైన బ్రాహ్మణులను జయించి, ఘోర అన్యాయ చట్టముల బంధించి, యజ్ఞానులుగా జేసి, దాసులుగా నొనర్చుట ప్రతీకార ధర్మము. న్యాయం. తక్షణమే జరుగవలసిన కర్తవ్యము. ద్రావిడకుమారా! ద్రావిడులకు, వీరి సంతతియైన మనకు; ఆర్యులు, ఆర్యసంతతియైన బ్రాహ్మణులచే మనము పడినపాట్లు, అనుభవించిన అగచాట్లు ఒక్కసారి స్మరింపుడు. తక్షణమే బ్రాహ్మణుల జయించండి. ప్రతీకార ధర్మమును అక్షరాలా ఆచరణయందు అమలునందుంచండి. జై! ద్రావిడ వీరకుమారునకు జై! జై! జై!!!

# ఆంగ్లేయులు

ఆంగ్లేయులును అజ్ఞానావస్థలో నుండగా రాయికి రప్పకు మ్రొక్కినవారే. క్రీస్తుమతోపదేశములచే అనేకత్వమునుండి ఏక త్వములోనికి వెళ్లారు. వారికి "యెహోవా" ఒక్కడే దేవుడు. నేడిది పశ్చిమ యూరఫ్, అమెరికాకు ప్రధానమతమయినది.

క్రీస్తుమతస్థులను క్యాథలిక్కులనెదరు. వీరి మత గురువు "పోపు." వీరు మతమును వ్యాప్తిజేయుటకు ప్రత్యేక వేషముల ధరించి మఠములందు నివశించుచూ ప్రజలకు క్రైస్తవబోధజేసెడి వారు. ఈ పోపు యితని శిష్యులు దుర్మార్గులై ప్రజలనుండి ధన సంగ్రహణజేయ మొదలిడిరి. దేవుని లోకమందు స్వర్గము కలదనిరి. ఇచ్చట దానము చేయువారికి నచ్చట అమితధనమిచ్చెదరని చెప్పిరి. వీరు స్వర్గమును గుత్తకుకొన్నట్లుగా హుండీలువ్రాసి యిచ్చెడివారు. వేదాంత విషయముల బోధించెడివారు. ఈ పోపులు యావజ్జీవిత పర్యంతము బ్రహ్మచర్యముగా నుండవలయునని వారిమతాచారము అట్లు పోపు బ్రహ్మచారియై ఆత్మబోధ జేసెడివాడు. "నీహృద యములోనే ఆత్మవున్నది. చక్కగా పరిశోధించు ఆత్మయందే మోక్షము కలదు." ఇవ్విధమున ప్రచారము జేయుచూ అనేక స్త్రీ లతో విచ్చలవిడిగా తిరుగుచూ ప్రజలనుండి ధనసంగ్రహన జేయు చుండెను.

విద్య, విజ్ఞానము అందరకి అందుబాటులో వున్నందున, విశేష సంఖ్యాకులు విద్యావంతులై, విజ్ఞానవంతులై పోపు అవనీతికి అసత్యము నకు అసహ్యపడి పోపును ధిక్కరించి మతమును సంస్కరించ

వలయునని వారు బయలుదేరారు. వీరు ప్రొటెస్టెంటులు. ఈ సంస్కరణవాదులైన ప్రొటెస్టెంటులవలన క్యాథలిక్కులకు గౌరవము తగ్గినది. అందువలన క్యాథలిక్కులు క్రోధోన్మత్తులై వేలకొలది ప్రొటెస్టెంటులను సంహరించారు.

బైబిలునకు విరుద్ధముగా "సూర్యుని చుట్టూ భూమియే తిరుగుచున్నదని" చెప్పిన బ్రూనో మహాశయుని రోంనగర వీధుల్లో అనేక హింసలు పెట్టారు. ఎట్టకేలకు న్యాయమే జయించినది. ఏలన ప్రజలు విద్యావంతులై విజ్ఞానులగుచుండుట వలన త్వరలోనే సత్యమును గ్రహించుచుండిరి. అందు వలన సంస్కరణ వాదులే మొగ్గారు. మూఢాభిప్రాయముల విసర్జించి, మూఢాచారముల పరిత్యజించారు, ఆస్తిక మత రొంపినుండి బయట పడ్డారు. బైబిలు చెప్పే సమాధానాలు అజ్ఞానులకు రుచించునుగాని, విజ్ఞానులకు రుచించునా; అందువలన సత్యాన్వేషణకై నడుము కట్టారు. ప్రతివిషయాన్ని హేతువాదముతో విమర్శించి సత్యము తెలుసుకొనేవారు. ప్రత్యక్షంగా ప్రకృతిని పరిశోధించి ప్రకృతి రహస్యాలను తెలుసుకున్నారు మానవుడు నిరంతరము కష్టపడి జీవించాలిసిన యగత్యము లేదన్నారు. మానవుడసలు దేహపరిశ్రమచేయు నవసరము లేదన్నారు. సమస్త కార్యాలు ప్రకృతిచేతనే చేయించుకోవాలన్నారు. అదే మానవత్వ మన్నారు! వివేక మన్నారు!! విజ్ఞాన మన్నారు!!!

## ప్రపంచ పరిశోధనలు,

### అమెరికా

| సంవత్సరం | కనిపెట్టిన వానిపేరు | వివరము |
|---|---|---|
| 1803 | ఫుల్టన్ | స్టీమరు |
| 1835 | కోల్టు | రివాల్వరు |
| 1835 | మోర్సు | ఎలక్ట్రిక్-టెలిగ్రాఫ్ |
| 1870 | హాయట్ | సెల్యూలాయిడ్ |



| సంవత్సరం | కనిపెట్టిన వాని పేరు | వివరము |
| --- | --- | --- |
| 1839 | గుడ్ యియర్ | రబ్బరు |
| 1848 | డబ్ల్యు. హంట్ | సేఫ్టీ పిన్ |
| 1864 | వాటర్ మన్ | ఫౌంటెన్ పెన్ |
| 1869 | వెస్టింగ్ హౌస్ | (ఎయిర్ బ్రేక్ వాయు - నిరోధము) |
| 18[illegible]9 | థామ్సన్ | విద్యుత్ పనిముట్లు |
| 1873 | షోల్స్ | టైపురైటరు |
| 1875 | బెల్ | టెలిఫోన్ |
| 1-73 | ఎడిసన్ | ఫోనోగ్రాఫ్ |
| 1878 | ,, | లాంతరు, 1893 లో మోషన్ పిక్చర్ మెషిన్ |
| 1883 | ఈస్టుమన్ | ఫోటోఫిలిం |
| 1885 | మర్గన్ టాలర్ | లినోటైపు |
| 1888 | విల్సన్ | కాల్షియం కార్బైడ్ |
| 1903 | రైట్ బ్రదర్సు | విమానము |
| | ఇంగ్లాండు | |
| 1565 | వాట్ | స్టీమ్ యింజన్ |
| 1690 | న్యూటన్ | గురుత్వాకర్షణ నియమం |
| 1764 | హర్ గ్రేవ్సు | దారంతీయు యంత్రము |
| 1801 | జాన్ డాల్టను | పరమాణు సిద్ధాంతం |
| 18:4 | స్టీఫెన్సన్ | రైలుయింజను |
| 1831 | ఫారడే | డైనమో |
| 1-40 | మాక్మిలను | సైకిలు |
| [illegible]5[illegible] | ఆటిస్ | ఎలివేటర్ |
| 8 | బెస్సెమర్ | స్టీల్ |

| సంవత్సరము | కనిపెట్టినవారి పేరు | వివరము |
| --- | --- | --- |
| 1861 | సుమెన్స్ | విద్యుత్ (కొలిమి) కుక్కరు |
| 1867 | లార్డులిస్టర్ | రణదోష నిరోధ చికిత్స |
| 1897 | జె. జె. థామ్సన్ | ఎలక్ట్రాన్ (పరమాణు ఖండం) |
| 1898 | రోస్ | మలేరియాకు కారణం |
| 1910 | సర్. ఇ. రూథర్ ఫర్డు | పరమాణుగర్భరహస్యం |
| 1914 | స్విన్టన్ | టాంకు |
| 1926 | ఐ. యల్. బయర్డు | టెలివిజన్ |

## జర్మనీ

| | | |
| --- | --- | --- |
| 1450 | గాటిన్ బర్గు | ప్రెసు |
| 1855 | బన్ సన్ | స్టౌబర్నరు |
| 1880 | లావరన్ | మలేరియా ఇన్ జక్షన్ |
| 1881 | కోచ్ | కలరా క్రిములు |
| 1895 | ఇబస్తు | టీకాలు (వాక్సినేషన్) |
| 19 0 | డైసెల్ | డైసెల్ మోటారు |
| 1902 | కారన్ | తీగద్వారా ఫోటో |
| 1908 | కౌంట్ జెప్లిన్ | జెప్లిన్ (గాలిఓడ) |

## ఫ్రాంసు

| | | |
| --- | --- | --- |
| 1721 | రెన్ ఫా హీట్ | పాదరసపు ధర్మామీటర్ |
| 1783 | జె ఇ. జె యమ్ మాంట్ గాల్ఫియర్ | బెలూన్ |
| 1816 | లెనెన్ | స్టెతస్కోపు |
| 1830 | థిమనియర్ | కుట్టుయంత్రము |
| 1831 | సోరియ | నిప్పుపుల్లలు |

| సంవత్సరము | కనిపెట్టినవాని పేరు | వివరము |
|---|---|---|
| 1837 | డాగ్యురీ నిప్జి | ఫొటో గ్రాఫీ |
| 1895 | లూమియర్ | మోషన్ పిక్చర్ ప్రొడక్టర్ |
| | ఇటలీ | |
| 1610 | గెలీలియో | టెలిస్కోపు |
| 1643 | టారిసెల్లీ | బారోమీటర్ |
| 1895 | మార్కోని | వైర్‌లెస్ |
| | రష్యా | |
| 1870 | మెండలీఫ | ఆవర్తసంవిభాగం |
| | స్వీడన్ | |
| 1867 | ఆల్‌ఫ్రెడ్ నోబిల్ | డైనమైట్ |
| | డెన్మార్కు | |
| 1920 | నీల్సుబోరు | పరమాణు నిర్మాణ రహస్యం |
| 593 | చైనా | అచ్చు (ప్రింటింగ్) |
| | హాలండు | |
| 1884 | డైమ్లస్ బెన్జ | గాస్ లైన్--ఆటోమొబైల్ |
| 1885 | పాటర్‌సన్ | క్యాష్‌రిజిష్టరు |
| 1910 | జిసిటరు | విశ్వరూపం |
| 1912 | లోయిూస్ | మెషీన్‌గన్ |
| | ఇండియా | |
| నాటినుండి నేటివరకు | ఆర్యులు (బ్రాహ్మణులు) | జడత్వము (మోఛము) |

ఇది వీరి ప్రత్యేక సంస్కృతియట. అన్ని సంస్కృతుల కంటె సర్వోత్తమోత్తమమైన సంస్కృతియట. ఈ ఆధ్యాత్మికత ప్రజలన్నాము ప్రత్యేకించి వీరి సంస్కృతియనుకోవాలసిన యవసరము లేదు.

ప్రపంచ చరిత్రను ఒక్కసారి స్మరించితే వీరి ప్రత్యేక సంస్కృతినే అజ్ఞానావస్థలో ప్రపంచము అనుభవించినదని తెలుస్తుంది. ఆ అజ్ఞానావస్థలో యనుభవించిన సంస్కృతినుండి బయటపడి, విజ్ఞానమునొంది ఆ "ప్రత్యేకసంస్కృతిని" విసర్జించి ప్రకృతిసంస్కృతిని స్వీకరించి పై జెప్పిన పరిశోధనలుద్వారా మానవత్వము వ్యక్తపరచుచూ సంఘాన్ని సుఖవంతము జేస్తున్నారు పాశ్చాత్యులు.

అట్టి అజ్ఞానావస్థనుండి బయట పడలేక ఆ అజ్ఞానావస్థేతను "ప్రత్యేక సంస్కృతి" యని ఎలుగెత్తి చాటుచున్నారు బ్రాహ్మలు. ఇటువంటి అజ్ఞానుల యధికారాన్ని తక్షణమే విసర్జించి, యికనైనా కర్తవ్యమూలో చించండి. లేనియెడల మనమున్నూ వారి "ప్రత్యేక సంస్కృతిలో భాగస్థుల మవుతాము. కానవీరి ప్రత్యేక సంస్కృతిని వీరిని, వీరి యధికారాన్ని కాలదన్ని తక్షణమే పాశ్చాత్యుల అనుసరించండి. పాశ్చాత్య సంస్కృతి దూరంగా వుండినప్పటికి, యేనాటికైనా పాశ్చాత్య సంస్కృతిని స్వీకరించాలసిందే. అంటే యీ అజ్ఞానావస్థలో వున్నంతకాలం పాశ్చాత్య సంస్కృతిని మనము తెలుసుకోలేము. స్వీకరించము. యేనాటికైనా అజ్ఞానావస్థ నుండి బయటపడి విజ్ఞానులమైన నాడైనా పాశ్చాత్య సంస్కృతిని స్వీకరించాలిసిందే. అందునిమిత్తమై బ్రాహ్మల అధికారముతో పాటు వారి "ప్రత్యేక సంస్కృతి కూడ మననెత్తిపై రుద్దబడినది. ఈవిధంగా మనము యీ బ్రాహ్మణ అధికారాన్ని వీరి ప్రత్యేక సంస్కృతిని నెత్తిమీద పెట్టుకున్నంత కాలము పాశ్చాత్య సంస్కృతికి దూరుల మవుతాము. దూరుల జేయటమే బ్రాహ్మణ ప్రభుత్వ లక్ష్యము మనపై సర్వాధికారాలు కలిగియుండ టానికే వీరి ప్రత్యేకసంస్కృతి లక్ష్యము. కానతక్షణమే బ్రాహ్మణ అధికారాన్ని, ప్రత్యేకసంస్కృ

తిని లదన్ని వానిగాలి కూడసోకక కుంచ జేసుకోవాలి, బ్రాహ్మణే తరుల తక్షణ కర్తవ్యమిదియే. మనమెంత శీఘ్రముగా బ్రాహ్మణ యధికారాన్నుండి ప్రత్యేక సంస్కృతినుండి దూరమవుతామో అంత శీఘ్రముగా పాశ్చాత్య సంస్కృతికి సమీపమవుతాము. యేనాటికైనా పాశ్చాత్య సంస్కృతి స్వీకరణ కన్నగత్యంతరము లేదుగాన ఆలస్యము జేయుటెందుకు ?

వీరి ప్రత్యేక సంస్కృతే (ఆధ్యాత్మికత) హిందూదేశ అభ్యుదయాన్ని ఖూనీచేశిందని "సవాల్" జేసి చెప్పుచున్నాను.

ప్రపంచము మిధ్య, మాయ, అజ్ఞానము కాన యిటు వంటి ప్రపంచమును గూర్చి తెలుసుకోవటము అజ్ఞానమని ప్రకృతి జ్ఞానానికి దూరులై యీ ప్రపంచములో తెలుసుకోవాలసింది యేమీ లేదని యీ ప్రకృతికి దూరంగా పోవటమే విజ్ఞానమని భావించారు బ్రాహ్మలు. లేని దేవుళ్లను సృష్టించి పూజ సేయసాగారు. తద్వారా పరలోకాలు వెలసినాయి. పాపపుణ్యాలను నిర్ణయించారు. పుణ్యము కలుగజేస్తాము. వుత్తమ లోకానికి పంపుతామని ప్రజానీకము నుండి ధన సంగ్రహణ జేయమొదలిడారు.

అజ్ఞానావస్థలో నుండగా పాశ్చాత్యులు బ్రాహ్మలవలె ప్రకృతి జ్ఞానానికి దూరులై ప్రపంచములో తెలుసుకోవాలసింది యేమీలేదని ముక్తి మార్గాన్ని చూపెట్టారు. పరలోకాలను సృష్టించారు. తద్వారా ప్రజల నుండి ధన సంగ్రహణ జేయ మొదలిడారు.

ప్రజలకు విద్య అందు బాటులో వున్నందున స్వల్పకాలము లోనే ఆస్తిక మతాన్ని హేతువాదముతో విమర్శించ సాగారు. స్వార్థ పరులు ధనాకాంక్షులై ఆస్తికమంతా బూటకమని ప్రచారము చేయు చున్నారేగాని, యిందు వలన ప్రజలకు లేశ మాత్రము ప్రయోజనము లేదని పోపుపై తిరుగ బడ్డారు. బైబిలు సిద్ధాంతముల త్రోసివేశారు. ఆస్తిక మతము అజ్ఞాన మని తెలుసుకున్నారు. ఇందులో నుండి బయట పడటమే తక్షణ కర్తవ్యమని కొందరు బయలు దేరారు.

వారే ప్రొటెస్టెంటులు. ఆస్తిక మత అజ్ఞానావస్థ నుండి బయట పడి విజ్ఞాన సముపార్జనకు బయలుదేరారు. ప్రకృతి జ్ఞానమే శరణ్యమన్నారు. దీనికి భిన్నమైనది మిథ్య, అజ్ఞానమన్నారు.

హిందూ దేశములో బ్రాహ్మణ ఆధ్యాత్మికతే పాశ్చాత్యులు ఒకప్పుడు అనుభవించారు. ప్రొటెస్టెంటులనే వారు బయలుదేరి ఆ అజ్ఞానావస్థనుండి బయటపడి మిగతా వారిని రక్షించారు. అలాగే యిచ్చట నాస్తికులనే వారు ఆస్తిక మత అజ్ఞానావస్థ నుండి బయటపడి ప్రజలను రక్షించటానికి ప్రయత్నించారు. కాని పాశ్చాత్యులకువలె ప్రజలకు విద్య అందు బాటులో లేనందున, అజ్ఞానావస్థనుండి బయట పడలేక పోయారు. ప్రజలకు విద్య అందు బాటులో వుంటే యీ ఆస్తిక మత అజ్ఞానము నుండి బయట పడి తమను (బ్రాహ్మలను) ధిక్కరించెదరని ముందుగానే ప్రజలు విద్య యభ్యసించరాదని అనేక కఠిన నిబంధనలు అమలు నందించారు. ఎవరైనా విద్య నభ్యశించితే వానిని హత్య జేశేవారు, అంతటి కఠినంగా ప్రజల్లో విద్యను నశింపజేశారు. అందు వలన నాస్తికులు ప్రజలను రక్షింపలేక పోయారు.

బరిమిలా కొంతకాలమునకు బౌద్ధవిప్లవముద్వారా ప్రజలు ఆస్తిక అజ్ఞానమునుండి బయటపడ్డారు. ప్రజలు విద్య నభ్యసించుచున్నారు. విజ్ఞానులగుచున్నారు. అనేక పరిశోధనలు జేయసాగారు. అప్పటికి ప్రపంచమంతా అజ్ఞానావస్థలో నేవుంది. అటువంటి సమయములోనే హిందూదేశము అంతటు నాగరికతకు గురియయ్యింది. ఈ నాగరికతను విదేశములకన్నిటికి గొంపోయి ప్రపంచానికంతటికి నాగరికతను మేలుకొలిపారు. ఈ బౌద్ధ విప్లవానంతరమే ప్రపంచము అజ్ఞానావస్థకు దూరమవనారంభించింది. ఈ విధంగా హిందూదేశములో బౌద్ధవిప్లవము, ఇండియాకేగాక, ప్రపంచానికంతకూ మార్గదర్శి అయింది. ఈ బౌద్ధ విప్లవ నాగరికతలో ప్రపంచము అజ్ఞానమునుండి బయటపడి విజ్ఞానావస్థలో ప్రవేశించింది. బౌద్ధులున్నా

విజ్ఞానావస్థలోనుండి అనేక పరిశోధనలు జరుపుచున్నారు. అనేకము ఫలించినాయి. ఇక దరిమిలా పరిశోధనలు యంత్రములే.

అటువంటి సమయములో ఆస్తికులు అధికారాన్ని సంపాదించి, బౌద్ధమతాన్ని నామరూపాలు లేకుండా నశింపజేశారు. పునః ప్రజానీకమందు విద్య, విజ్ఞానము నశింపజేశారు. ఆస్తిక అజ్ఞానమంతా బోధించారు. నాటినుండి నేటివరకూ ప్రజలకు విద్య అందుబాటులో లేకుండా జేశారు, చేస్తున్నారు. అందువలన పునః హిందూదేశము అజ్ఞానావస్థలోనే వుండిపోయింది. ఆస్తికమతమే ప్రచారమందుండినది. ఆస్తికుల అధికారమే కొనసాగుచున్నది. ఇలాగే భవిష్యత్తంతా అట్టిపెట్టడానికి బ్రాహ్మలు ప్రయత్నిస్తున్నారు. వారిప్రయత్నమె సఫలీకృతమవుచున్నది. అధికారులైనారు, ప్రత్యేక సంస్కృతి యనుచున్నారు. ప్రజలను విజ్ఞానమునకు దూరులజేయుచున్నారు. ఆస్తిక మత అజ్ఞానావస్థలోనే ప్రజలనట్టిపెట్టి, తమ యధికారాన్ని, గౌరవాన్ని కాపాడుకుంటున్నారు.

ప్రొటెస్టెంటులు ఆస్తికమతాన్నుండి బయటపడి ప్రకృతి పరిశోధనలు జేయసాగారు. వీరికి విద్య అందుబాటులో వున్నందున ఆస్తిక స్వార్థపరులైనవారు మిగతావారంతా వీరినే అనుసరించినందున, వీరి పరిశోధనలు జయప్రదమయినాయి. వీరు చెప్పునది గ్రహించేసత్తా ప్రజానీకమునకు వుండుటవల్ల త్వరలోనే వీరిప్రభావము బయల్పడింది. ఆస్తికులంతా వీరినే అనుసరించక తప్పలేదు. అందువలన వీరి పరిశోధనలకు అడ్డుతగిలిన వారులేనందున నిర్విఘ్నముగా నేటికి విశేష పరిశోధనలు జేశారు.

బౌద్ధమతాన్నే స్వార్థపరులైన బ్రాహ్మలు నాశనము జేయకున్న ప్రపంచ మంతయు అజ్ఞానావస్థలో నుండగనే బౌద్ధులు (నాస్తికులు) సమస్త పరిశోధనలు జరిపేవారు. సమస్త యంత్రాలు కనిపెట్టేవారు. ప్రపంచానికి మార్గదర్శకులయ్యేవారు. ప్రపంచములో అగ్రస్థానాన్ని పొందేవారము. ప్రపంచాన్నంతను గుప్పిటలో పెట్టు

కొని యుండేవారము. ప్రపంచములో కెల్ల ధనవంతులము, విద్వాంసులము, మనమే అయ్యేవారము. అటువంటి అదృష్టాన్ని బ్రాహ్మలు నాశనము జేశారు. ప్రపంచములో కెల్ల బీదలు, అజ్ఞానులు మనకు మినహా మరెవ్వరూ లేరు. అట్టి అజ్ఞానమందే, బీదతనమందే వుంచుటానికి బ్రాహ్మలు అధికారులై ప్రయత్నిస్తున్నారు. కళ్లు తెరవండి. ఎంతత్వరగా బ్రాహ్మల యధికారాన్ని, బ్రాహ్మణ (ఆస్తిక) మతాన్ని నామరూపాదులు లేకుండానశింప జేస్తామో అంత త్వరగా ప్రపంచములో మానవులుగా పరిగణింపబడతాము. ఇదే తక్షణ కర్తవ్యము.

ఆంగ్లేయులు సమస్త పరిశోధనలు జరిపి మానవుని కష్టముల దూరము జేయుచుండిరి. ప్రపంచము నభ్యుదయ మార్గానికి తీసుకు వెళ్లుచుండిరి. అట్టి మహనీయులైన ఆంగ్లేయుల పరిపాలన హిందూ దేశమునకు కొంత అదృష్టదాయకమే.

## కాంగ్రెసు

ఆంగ్లేయులు ప్రజలను విజ్ఞానుల చేయుటచే, బ్రాహ్మణ (ఆస్తిక) మతమును విమర్శించసాగిరి బ్రాహ్మణ గౌరవము క్షీణింప జొచ్చె. అందు వలన ఆంగ్లేయుల పరిపాలన బ్రాహ్మలకు ప్రాణాపాయముగ గన్పట్టినది. తక్షణమే ఆంగ్లేయుల వెడలగొట్టి పునః ప్రజలను అజ్ఞానులజేసి తమ అధికారము, గౌరవము సంపాదించుకోటానికి స్వరాజ్య వుద్యమము లేవదీశారు. అజ్ఞాన ప్రజానీకము జైళ్లలో దూకారు. ప్రాణాలనర్పించారు. ఆంగ్లేయ ప్రభువులకు అంతర్జాతీయముగా అనేక కష్టాలు సంభవించినందున ఇండియాకు స్వరాజ్యమిచ్చారు. ప్రజలు తమకు లేని సంతోషాన్ని వెలిబుచ్చారు. కష్టపడి బ్రాహ్మల కధికారము సంపాదించి పెట్టామనా? లేక యేమైనా ప్రయోజనము వున్నదనా?

ఆంగ్లేయులు ఇండియాకు స్వరాజ్యమిచ్చి బ్రాహ్మణుల కెంతటి యుపకారము జేశారో బ్రాహ్మణేతరుల కంతటి అపకారము

జేసిన వారైనారు. ఏలన ప్రజలు అజ్ఞానావస్థలో నుండగానే బ్రాహ్మణుల కధికారము మొసంగినారు. ప్రజ లేనాటికైనా విజ్ఞానులయ్యేదరా! బ్రాహ్మణ యధికారాన్నుండి, బ్రాహ్మణ (ఆస్తిక) మతాన్నుండి యేనాటికైనా తప్పించు కోగలరా! ఆంగ్లేయులే స్వరాజ్య మివ్వకున్న స్వరాజ్యము కొరకైనా ప్రజలు చైతన్య వంతులై, విజ్ఞానులయ్యేడివారు ఆస్తికమతాన్నుండి విడిపోయెడివారు. స్వరాజ్యము సాధించేవారు. నూత్నవ్యవస్థను అభిలషించేవారు. రాజకీయంగా యెంతముందడుగు వేశేవారు. ఆంగ్లేయులు స్వరాజ్య మిచ్చినందువలన ప్రజలు అజ్ఞానావస్థలోనే వుండిపోయారు. అసలు "ప్రభుత్వమనేది ఒకటి వుందా?" అనేంత అజ్ఞానములో వున్నారు. నూత్న వ్యవస్థను కోరే విజ్ఞానము లేనందున "అవివేకము రాజు-ఛాందసపు మంత్రి" (ప్రజలు) యనునట్లుగా బ్రాహ్మణుల ప్రత్యేక సంస్కృతే చళామణి యవుచున్నది. ఆస్తికమత ప్రభావమే ప్రసరించింది. అజ్ఞానమే తాండవిస్తుంది. బ్రాహ్మణ అధికారము, గౌరవము సంరక్షింప బడుతున్నాయి. నేడు ప్రపంచము వైజ్ఞానికంగా యెంత అభివృద్ధి జెందిందో, హిందూదేశము అజ్ఞానికంగా అంత అభివృద్ధి జెందుతుంది. దీని కంతకూ కారణము బ్రాహ్మణ ఆస్తిక మతము, బ్రాహ్మణ అధికారము, వారు మాత్రము పాశ్చాత్య సంస్కృతిని స్వీకరించి బ్రాహ్మణే తరులకు అందుబాటులో లేకుండా జేస్తున్నారు. అజ్ఞానుల జేస్తున్నారు. ఆస్తికమతాన్నే ప్రచారము జేస్తున్నారు. సనాతనిజాన్నే ప్రచారము చేస్తున్నారు. అందుకే వారు అధికారాన్ని సంపాదించారు. అధికారము జేస్తున్నారు. పాశ్చాత్య విజ్ఞానమును, యంత్రముల బహిష్కరించి ప్రజలను అజ్ఞాన కష్టములందే వుంచటానికి ప్రయత్నిస్తున్నారు. ప్రపంచ విజ్ఞానము ప్రజలకు తెలియనివ్వకుండా జేయుటకై, విద్యావంతుల జేయుటకై సంస్కృతము రాజభాష కావాలంటున్నారు.

బ్రాహ్మణ యధికార మున్నంతవరకూ బ్రాహ్మణే తరుల నథఃపాతాళమునకు త్రొక్కుటకే ప్రయత్నిస్తున్నారు. తద్వారా

బ్రాహ్మణ దాస్యానిక గురియగు చున్నాము కాన తక్షణమే బ్రాహ్మణ అధికారాన్ని, మతాన్ని విసర్జించాలి. ఆనాడు పాశ్చాత్యులవలె కష్టాలను దూర మొనరించి, స్వతంత్రులమై సుఖంగా జీవించ గలుగుతాము.

## కాంగ్రెసు - గాంధీ

విశేష సంఖ్యాకులు అజ్ఞానులై నందున, ప్రపంచ విషయముల గురించక గాంధీగారు స్వరాజ్యము తెచ్చారని బాలునివద్దనుండి వృద్ధుల వరకూ గాంధీజీకిజై! స్వరాజ్యము తెచ్చిన గాంధీమహాత్మునకుజై! అనే నినాదాలతో హిందూదేశము ప్రతిధ్వనించింది.

**అహింస** :— బుద్ధుడు క్రీ. పూ 5 న శతాబ్దిలో అహింసా ప్రచారము చేశాడు. ఏమని?

"స్వార్థపరులైన బలవంతులు తమ సుఖలాభముల కొరకు బల హీనుల వినియోగించుకొనుట హింస యన బొప్పు.

తమకు కష్టములన నెంత బాధయో, తమ ప్రాణములపై నెంత తీపియో, అన్ని జీవులకును నట్లనేభావించి హింసింప కుండుట అహింస యన బరగు.

అన్యాయముగా నొకడు హింసించుచున్న నట్టి వానిని ప్రతిఘటించి తనను కాపాడుకొనుట అహింస యన బరగు

అన నీ దేశ స్వాతంత్ర్యోద్యమాన్ని అపహరించిన వారిని ప్రతిఘటించి నీ దేశ స్వాతంత్ర్యాన్ని కాపాడుకొనుట అహింస యన బరగు.

గాంధీగారి అహింసా సిద్ధాంతముపై దానికి వ్యతిరిక్తమున, అహింస అంటే ఒకడు కొట్టుచున్నను చంపుచున్నను, యిట్లేల చేయుచుంటివనరాదు, అంటే హింస యవుతుంది.

ఈ సిద్ధాంతముతో గాంధీగారు స్వరాజ్యము సాధించ టాని బయలు దేరారు. ఈ అహింసా సిద్ధాంతరీత్యా బ్రిటిషు వారిని పల్లెత్తు మాటైనా అన గూడదుగాన సత్యాగ్రహము పూనారు. సత్యాగ్రహ మన్నంటే "హఠము". హఠమంటే "మేముకోరునది మాకులభించాలి" ఇట్టి సత్యాగ్రహముతో బ్రిటిషువారిని "మా దేశాన్ని పాలించుకునే హక్కు మాకివ్వండి" యని ప్రార్థించటమే సత్యాగ్రహ మనం బడును. ఈఅహింసా యుతమైన సత్యాగ్రహము ద్వారానే స్వరాజ్యము తేవాలని నడుము కట్టారు గాంధీగారు.

అంత సుభాస్ చంద్రబోసు "ఈఅహింసాయుతమైన సత్యాగ్రహముతో గాంధీగారు స్వరాజ్యము తెచ్చుట, ప్రజలను భ్రమించుటయా? ఇదికలలోనివార్త" యని కాంగ్రెసుకు రాజీనామా యిచ్చి యిలా అన్నారు. "ఏ దేశమూ స్వాతంత్రమును అహింసతో సాధించినట్లు వినలేదు. ఏసబోము కాన బ్రిటిషువారిపై యుద్ధానైనా జేసి స్వరాజ్యము సాధించటానికి సంసిద్ధులు కండి." అని బోధించారు.

గాంధీగారు అహింసా సిద్ధాంతమునే యవలంబించి స్వరాజ్యము సాధించాలన్నారు. అప్పటికిని బ్రిటిషువారు స్వరాజ్యము యివ్వని యెడల గాంధీగారు జేసేదేమిటి? యేమీ లేదు. సత్యాగ్రహము. సత్యాగ్రహము జేస్తే జైలులో బంధిస్తారు. కొడతారు. చంపుతారు. అప్పుడు గాంధీగారు చేసేదేమిటి? యేమీ లేదు. యేమైనా జేస్తే అహింసకు దోషము కలుగుతుంది. కానకొట్టినా చంపినా మాట్లాడ గూడదు. అయితే గాంధీగారి యుద్దేశ్యము స్వరాజ్యమును సాధించుట కాదని, అహింసా సిద్ధాంత రక్షణయని బోధపడుతుంది. స్వరాజ్యము లభింపనప్పటికి హింస పనికిరాదు. అయిన గాంధీగారు స్వరాజ్యము తేగలరని యే ఛాందసుడైనా చెప్పగలడా? అసలు గాంధీగార్కి "అహింస" అంటే యేమిటో తెలియ సందుననే యిన్ని చిక్కులు తటస్థించినాయి.

గాంధీగారు బ్రిటిషు వారిని "హిందూదేశాధి కారము" విసర్జించుకొమ్మనుచున్నారు. బ్రిటిషువారు హిందూదేశాన్ని వదిలి పెట్టటమంటే వారు మానసికంగా యెంత బాధపడెదరో? అది హింస కాదా: "హింసయైన మాకేమి? మా దేశమును మేము కోరుచున్నామ" నెదరా? అహింసా సిద్ధాంతము నామరూపాదులు లేకుండా నశిస్తుంది. ఐన హింసతోనే స్వరాజ్యము సాధించవచ్చునుగా? కాన గాంధీగారి అహింసా సిద్ధాంతరీత్యా అసలు స్వరాజ్యము కోరుటకే కోలుపోతున్నారు. ఇటువంటి అహింసావలంబకులైన గాంధీగారు స్వరాజ్యము తెస్తారని ప్రజలు గాంధీ భక్తులయ్యారు.

యంత్ర బహిష్కరణ—గాంధీగారు ఏ విధమైన యంత్రములు హిందూదేశమున వుండ రాదన్నారు. సర్వము చేతి పరిశ్రమల ద్వారా తయారు కావాలన్నారు. మనకు విదేశవస్తువు లక్కర్లేదన్నారు. యెంత పొదుపుగా వాడుకున్నవారు అంత దేశభక్తులన్నారు. ఈసిద్ధాంతము గాంధీగారు బోధించి స్వయముగా రాట్నము వడుకుచూ, కాంగ్రెసు భక్తులందరం యిలాగే నడకాలన్నారు. యంత్రములనవసరమన్నారు.

ఈయంత్ర బహిష్కరణరీత్యా ఆలోచించిన గాంధీగారి యుద్దేశ్యము ప్రజలను నిలువునా ఖూనీ జేయుటకు ప్రయత్నించినట్లున్నది. ఏలన యంత్రముల బహిష్కరించిన ప్రజలు సర్వదా పనిపాటలందే నిమగ్నులయ్యెదరు. తద్వారా అవిద్యావంతులయ్యెదరు. తద్వారా బ్రాహ్మణులు బ్రాహ్మణ (ఆస్తిక) మతము సుస్థిరముగా అధికారము జెలాయించవచ్చు.

యంత్రముల బహిష్కరించి పశువులవలె, ప్రజలను పెట్టుబడిదారీ చేతుల్లో అట్టిపెట్టటానికి ప్రయత్నించారా? ప్రజలు కష్టపడి పనిచేయుట హింసకాదా; వీరి అహింసా సిద్ధాంత మేమైన దిచ్చట? అందులకనే గాంధీగార్కి "అహింస" అంటేయేమిటో తెలియదని చెప్పుచున్నాను. యంత్రములున్న ప్రజలు కష్టపడి పనిచేయ వలసిన యగత్య ముండెడిదిగాదు. తద్వారా ప్రతి ఒక్కనికి విశ్రాంతి

లభించెడిది. తద్వారా ప్రజలందరు విద్యావంతులు, విజ్ఞానులయ్యెదరు. అట్టియంత్రముల బహిష్కరించి ప్రజలను నిలువుగా ఖూనీ జేయుటే గాంధీగారి యుద్దేశ్యము. అస్పృశ్యత:— గాంధీగారు హరిజనుల సంఘమున గలుపుచున్నారని బ్రాహ్మలు గగ్గోలు పెట్టారు. పాపము వీరికి గాంధీగారి యుద్దేశ్యము తెలియక కడుభాభత్వత జెందినారు.

స్వరాజ్యమువస్తే పాకిస్థాను విభజనీయము తథ్యము. అట్టి సమయమున ప్రజాయుద్ధము తప్పదయ్యెడిని. అందునిమిత్తమై మహమ్మదీయ పదితఖడ్గముల నెదుర్కొనుటకు సమర్థు లెవ్వరు? బలవంతులైన హరిజనులు. ఇట్టిసమయమున హరిజనుల దువ్వి వారి క్షేమమునకు పాటుపడుచున్నట్టు నటించిననే గాని, రేపు ప్రజా యుద్ధములో హరిజనులు సాయపడరు. సాయపడక పోతే బ్రాహ్మణ (హిందూ) మతమే నామరూపాదులు లేకుండా నశించవచ్చు. సంపూర్ణ హిందూదేశము మహమ్మదీయుల పాలనమగును. అందు నిమిత్తమై ముసల్మాను వాడి కత్తులకు అస్పృశ్యుల బలి యొసంగి బ్రాహ్మణ (ఆస్తిక) మతాన్ని బ్రాహ్మణులను సురక్షితముగా రక్షించే నిమిత్తమై, అస్ప్రుశ్యులపై దయజూపారు. అస్పృశ్యత నశించాలన్నారు. ఆచరణ యందు ఫలితము పూజ్యము. నిషేధించా లనటము వరకే. ట్లు అస్పృశ్యుల అనుగ్రహముపొంది. తమ చేతుల్లో అట్టిపెట్టుకొని మహమ్మదీయ వాడి ఖడ్గములకు బలి యొసంగుటకై సనతితల్లి ప్రేమజూపారు. గాంధీయంత సనాత నిష్టు ల్లొకడు లేడు.

హిందూ మహమ్మదీయులు ఏకము కావాలన్నారు. సోదరులు కావాలన్నారు. గాంధీగారి కుమారుడు మహమ్మదీయ మతాన్ని స్వీకరించితే వర్ణింపరాని ఆవేదన అనుభవించారు. ఇట్టి గాంధీగారు హిందూదేశాన్ని తలక్రిందులు జేస్తారని ప్రజలు గ్రుడ్లు మిటకరించు కొని "గాంధీ" నామజపము జేస్తూగాంధీ భక్తులయ్యారు.

సాహసకృత్యాలు:- గాంధీగారు వృష్ణుపైనున్న అధిక పన్నును తొలగించాలని సత్యాగ్రహము జేశారు. ప్రజలు జేశారు అనేక వేలమంది జైళ్లకు వెళ్లారు. గాంధీగారు ప్రాణాలను అర్పించటానికి సంసిద్ధులైనారు.

ప్రపంచమున నింతకంటె ఛాందసమేమైనా నుండునా? మనకు కావలసినది స్వరాజ్యమా? వృష్ణుపై నధికపన్ను నిషేధించుటా? వృష్ణుపై నధిక పన్నే గాంధీగారి కళ్లకు కన్పట్టెనదా? కానముందుగా దేనికొరకు పోరాడవలెనో ప్రజలే గమనించాలి. ముందుగా స్వరాజ్యమే సాధించిన, వృష్ణుపైపన్ను దానంతటదే నశించెడిదిగదా? కానవీరు వృష్ణు సత్యాగ్రహము జేయుట అనవసరము కాదా? వీరుజేసిన త్యాగములన్నియు నిట్టి యనవసర కృత్యములే. స్వరాజ్యము కొరకేపోరాడి స్వరాజ్యమే సాధించిన, వీరు సాహశించిన కార్యములన్నియు వాటంతటవే నశించెడివి. వీరు అనవసర శ్రమపడ్డారు. ఐతేయిటువంటి విషయముల సంస్కరించి సరిపెట్టుకొనుటేనా గాంధీగారి యుద్దేశ్యము. స్వరాజ్యము సాధించాలని గాంధీగారి యుద్దేశ్యము కానట్లున్నది. వృష్ణు ఆచిల్లర సాహసము లెందుకు? స్వరాజ్యము కొరకే సాహసకృత్యముల జూపి స్వరాజ్యము సాధించిన దరిమిలా వీరిసంస్కరణలు వాటంతటవియే నశించెడివికదా? కాన వీరు జూపిన సాహస కృత్యములు వృథా! నిష్ప్రయోజనము!! శుష్కదండుగ!!!

ఇట్టి చిల్లర సాహస కృత్యములద్వారా స్వరాజ్యము సాధించకుండా అనవసరముగా కాలయాపన జేశారు. మహాత్ముడు:- ఇట్టి సాహసకృత్యములద్వారా ప్రజానీక మందు పలుకుబడి సంపాదించారు. గాంధీగారు చేయలేని కార్యము లేదన్నారు మహాత్ముడన్నారు దేవుని యవతారమన్నారు. గాంధీగారిని దర్శించితే దైవదర్శనమన్నారు వారి యడుగుజాడల్లో నడిస్తేనే స్వరాజ్యమన్నారు. గాంధీ జన్మించబట్టి మనకు స్వరాజ్యము లభింప నున్నదన్నారు.

గాంధీజీ నోట్లో నుండి యే శబ్దము వినపడి అక్షరాలా ఆచరణ యందు అమలు పరచటానికి ప్రజలు నడుము కట్టారు. ఇంటింట గాంధీ విగ్రహాపూజలే. రోడ్లన్నీ గాంధీ విగ్రహములే.

ప్రజలందు తన కెంత పలుకుబడి వున్నదో గాంధీగారు గ్రహించారు. తాను యే తప్పుడు పంథాలో నడిచినప్పటికి ప్రజా గౌరవము పొందుతాననే తలంచారు. ఆలాగే అనేక తప్పుడు పంథాల్లో నడచారు.

గాంధీజీ రెండు మూడు చిల్లర సాహస కృత్యములు జేసి నందుకు మహాత్ముడన్నారు. అజ్ఞానులగుటచే స్వరాజ్యమున్నూ గాంధీగారే తెచ్చారన్నారు. అందువలన ప్రజలు గాంధీజీని "మహాత్ముడ"న్నారు. "దేవుడ"న్నారు. ప్రజలు యిట్టి "మహాత్మ" బిరుద మిచ్చి గాంధీజీని దేవుడని పూజించి నందువలననే గాంధీగారికి అనేక దుర్దశలు సంప్రాప్తించినాయి. ప్రజలు మహాత్ముడనక ఒక రాజకీయ నేతగా భావించితే గాంధీగారు తప్పుడు పంథాల్లో నడవడు. నడుస్తే అతనికే వున్న గౌరవము పోతుందని సభ్యతగానే ప్రవర్తించేవాడు. కాన గాంధీజీ అసభ్యతకు ప్రజలే కారణము. ప్రజలు గాంధీజీని "మహాత్ముడు–దేవుడ"ని అనటానికి కారణము ప్రజల అజ్ఞానము.

## నెహ్రూ

పాకిస్థాన్ విభజింపక పోయిన నెహ్రూజీకి, నాయకత్వము లభించునను నమ్మక మేమిటి? ఇందువలన పాకిస్థాన్ విభజ నీయము నెహ్రూజీకి సంతోష దాయకము. వీరికోర్కె ఫలించినది. వీరు యభిలషించే నాయకత్వమున్నూ లభించినది.

నెహ్రూజీ స్వరాజ్యము రాకపూర్వము సోషలిజం భావాలు కలిగిన విశాల హృదయుడు. ఆస్తిక మతము వల్లనే అభ్యుదయము ఖూనీ చేయబడుతుందని తెలిసిన నాస్తికులలో వీరొకరు.

అట్టి వీరు స్వరాజ్యమువచ్చి అధికారము లభింప వారి సిద్ధాంతములపైవారే దండెత్తసాగారు. పైగా సంపూర్ణముగా నిషేధింపబడి తీరాలన్నారు. అలాగే నాస్తిక మతమున్నూ. ఆస్తిక మతమే శరణ్యమన్నారు, అదే మన సంస్కృతి యన్నారు.

ఇవ్విధముగ పరిసర పరిస్థితుల ప్రభావమునకు పూర్తిగా దాసుడై ఒక "ఫాసిస్టు" యైనాడు. పరిసర పరిస్థితుల ప్రభావమును వశీకరము జేసుకొనలేని అసమర్థులై తమ భావాలను పూర్తిగా మార్పు జేసుకున్నారు.

నేడు దేశము యేమైనాసరే, సోషలిజం పద్ధతులు అమలు పరచటానికి వీల్లేదు, బ్లాక్ మార్కెట్టును నిషేధించటానికి "బ్లాక్ మార్కెట్ దారులు బ్లాక్ చెయ్యటము విరమించండి. విరమించని యెడల బ్లాక్‌మార్కెట్ దారులకు వురిశిక్ష" యని ఆవేశపూరితులై ఆగ్రహము జెందారు నెహ్రూజీ. బ్లాక్ జేస్తూ! ధనరాసులు కళ్లజూచేవాడు!! బ్లాక్ చెయ్యటము విరమించుకోవాలట! ! ! ఇది "స్వప్నమందైనా జరిగే కార్యమేనా"యని నెహ్రూజీకి తెలిసివుంటే ఆవేశ పూరితులు కానక్కర లేదు. ఆగ్రహము జెందాలసిన యవసరము లేదు,

బ్లాక్‌మార్కెట్ దారులు "బ్లాక్"చెయ్యటము విరమించుకుంటేనే తప్ప బ్లాక్ నిషేధింప బడదన్నమాట, ఈబ్లాక్‌ను నిషేధించటము నెహ్రూజీ చేతగాని కార్యమన్నమాట. లేని యెడల! "బ్లాక్ మార్కెట్ దారులకు వురిశిక్ష" యనవలసిన యవసరముండెడిది కాదు.

## రాజగోపాలా చారి.

ఓహో! రాజగోపాలా చారిగారు! హిందూదేశ కరువు సమస్యయేగాక ప్రపంచ కరువు సమస్యయును తీరునట్లున్నది. తమరు గృహోవరణ యందు పండించు పంట.

ఇటువంటి యవి ఎకు లధికారులై నందుననే అభ్యుదయము ఖూనీ జేయ బడుతుంది. ఇందువల్లనే హిందూ దేశము దీన, దరిద్ర, అసమర్థ, అజ్ఞానస్థితి యందు వుసూరుమంటూ, పాశ్చాత్యుల భిక్ష కొరకు యెదురు చూస్తుంది. అసలిలావుంచటమే వీరి యుద్దేశ్యమయ్యెడిని! లేకున్న నిట్లెందు కుండవలె?

వీరందరు ఆర్య సంతతివారు. ఆర్య రక్తము కలిగినవారు. ద్రావిడ సంతతి మనము. (బ్రాహ్మణేతరులము.)

ద్రావిడుల నాశనముజేయుటే ఆర్యులయుద్దేశ్యము. కర్తవ్యము నేటి వరకూ అట్లు నాశనము జేయబట్టే నేడు మనము ప్రపంచ దృష్టిలో పశువులకన్న హీనులుగా గన్పట్టుచున్నాము. కాననేడు ఆర్య సంతతి మనలనుద్ధరించునని స్వప్నమందైనా తలంచవద్దు. అట్లు తలంచి వారి చేతనే అభ్యుదయమునకు గొంపోబడుచున్నామని నాటి నుండి నేటి వరకూ తలంచి నందువల్లననే నేడింతటి దీన, దరిద్ర, అసమర్థ, అజ్ఞానావస్థ యందు వున్నాము కాన వీరు మనల నభ్యుదయానికి గొంపోతారని మనము విశ్వశించగూడదు, కాన తక్షణమే వీరి అధికారాన్ని మనము విసర్జించాలి. మన అభ్యుదయానికి మనమే అధికారులమై ప్రయత్నించాలి. ఒకరిపై ఆధారపడుట తనకు తాను ఖూనీ జేసుకోపటమే.

వీరు స్వరాజ్యము కావాలన్నది బ్రాహ్మణ (ఆస్తిక) మతాన్ని రక్షించుకోవటానికే తమ యధికారము సుస్థిరము, జేసుకోవటానికే. అమాయకులము జైళ్లలో దూకాము. ప్రాణాల నర్పించాము. ఫలితము బ్రాహ్మణులకు కట్టబెట్టాము. నేడు బ్రాహ్మలు సంపూర్ణ అధికారులైనారు. బ్రాహ్మణ (ఆస్తిక) మతాన్ని సంరక్షించ టానికే అహర్నిశలు ప్రయత్నిస్తున్నారు.

వీరి సంస్కృతికి పాశ్చాత్య సంస్కృతి "హస్తిమశ కాంతరము," కలదట పాశ్చాత్యుల సంస్కృతి యిహలోక సంబంధమైనది గాన తుచ్ఛమట. మరి వీరి సంస్కృతియో తుచ్ఛమైన యిహలోక సంస్కృతికి సంబంధము లేని పరలోక సంస్కృతియట. ఒకరిలా అన్నారు. "ఎకడ పాశ్చాత్య సంస్కృతి ఆగిపోతుందో అక్కడ నుండి బ్రాహ్మణ (అధ్యాత్మిక) సంస్కృతి యారంభమట" కాన అన్ని సంస్కృతుల కంటె వీరి సంస్కృతి ఉత్త మోత్తమైనదట.

# బ్రాహ్మణ ఆస్తిక మతఖండనము.

## వే ద ము లు.

వేదములు మూడు ఋగ్వేదము సామవేదం, యజుర్వేదము ఈ మూడును ఈశ్వరునిచే రచింప బడినవిగాన "అపౌరుషేయములు" అనుచున్నారు ఆస్తికులు

ఋషుల హృదయ మందు ఈశ్వరుడు వేదజ్ఞానమును కలిగించె. అంత ఋషులు వేదముల రచించిరి. కాన "అపౌరుషేయములే" యనుచున్నారు ఆర్య సమాజికులు. (గుడ్డిలో మెల్ల.)

"ఎహోవా" దేవుడు. ఇతని కుమారుడు ఏసు. ఆఎహోవానుంచి ఏసుచే కొనిరా బడినదే బైబిలు.

"అల్లా" దేవునిచే మహమ్మదుద్వారా చెప్పబడినదే కురాను, వీరందరు దేవుడొక్కడే యనియు, ఆ ఒక్క దేవుడే తమ వేదముల రచించెననియు చెప్పుచున్నారు.

దేవుడే వీనిని సృష్టించెనన్న పరస్పర విరుద్ధ మత గ్రంథముల సృష్టించునా? ఒకే ధర్మము ఒకే మతమును సృష్టించెడి వాడు.

దేవుడే సృష్టించెనన్న సాకారుడు కావలయును గదా? ఆసాకారుడైన దేవుని సృష్టించిన సాకారు డెవ్వరు ? నిరాకారుడందమా?

నిరాకారుడు, సృష్టించుటెట్లు ? కాన యివి దేవునిచే సృష్టింప బడలేదు.

• దేవుడే ఋషుల హృదయమందు జ్ఞానమును కలుగ జేసెనన్న అందరి హృదయమందును ఒకేరీతిగా కలుగ జేసెడివాడు. కాన దేవుడిచ్చినది లేదు, మనము పుచ్చుకొనినది లేదు.

బైబులు, ఖురానునందును, ఏసు, మహమ్మదు వుపదేశము లున్నవి. ఆనాటి సాంఘిక వ్యవస్థను సంస్కరించటానికి ప్రయత్నించి "సంఘమిలా నడువవలెను. అలానడువవలెను." అని కొన్నిధర్మోప దేశములు బోధించారు. అవేపవిత్ర గంధముులైనవి. మతగ్రంథము లైనవి. అంతకు మినహా వాని యందు విశేష మేమియులేదు.

ఇక వేదము లందుమా? ఇవి సాక్షాత్ బ్రహ్మనోటి నుండియే పడినవి. వీనికి దేవునకు గలమహత్తు కన్నను విశేష మహాత్మ్య మున్నది. వేదములంటే పవిత్ర, పూజ్యదైవ గ్రంధములు. వానిమహత్తును వర్ణింప దేవుడేశక్యుడు.

వేదములు గీర్వాణ భాషయందుండుటచే, ప్రజలు చూచి యెరుగనందున, బ్రాహ్మలు చెప్పేమాటలను విశ్వశించి, యెంతగొప్ప గ్రంధములో, యనుకొనిరి. వీనిని పరిశోధించిన సత్యము బయల్పడింది.

ఆర్యులు ఉత్తరధృవముననున్న సమయమున దీర్ఘరాత్రికి భయ పడి "సూర్యుడా త్వరగారమ్మా- నీకు నమస్కారము." అని * ప్రకృతి శక్తులకు పూజచేయసాగారు అజ్ఞానులై. దరిమిలా వీరి విరోధుల

* 1. నాటి నుండి నేటి వరకూ సూర్యనస్కారాలు బ్రాహ్మలకు ఆచారమై పోయింది. అంతేగాని అందు వలన పుణ్యము లేదు. మోక్షములేదు.

సంరక్షింప వలసినదిగా దేవతలను గూర్చి ప్రార్థించెడి వారు. ఈ ప్రార్థనలచే నిండినవే వేదములు, పై ప్రార్థనలతో నిండినది ఋగ్వేదము.

యజుర్వేదమున యజ్ఞసంబంధములైన ప్రార్థనలు కలవు.

సామవేదమున సోమరసమును గూర్చిన ప్రార్థనలు కలవు.

పై మూడు వేదముల నుండి కొంత గ్రహించి అధర్వణవేదము పూర్తి జేశారు. కాన దీనికి ప్రత్యేక అస్థిత్వము లేదు. కాన వేదములు మూడు.

వేదత్రయము నందు పైజెప్పిన ప్రార్థనలు మినహా ఒక్క నీతి వాక్యమైననూ లేదు, వేదముల కన్న బైబిలు, కురాను వేయిరెట్లు త్తమమైనవిగా గన్పట్టుచున్నవి.

అజ్ఞాన మందు అజ్ఞాన భావములుండునుగాని విజ్ఞాన భావము లుండునా? కాన ఆవేదములు, బైబిలు కురాను అజ్ఞాన జనితములు గాన, నేడు విజ్ఞాన యుగమున నుండి విజ్ఞాన గ్రంధముల పఠించ వలెగాని ఆ అజ్ఞాన గ్రంథముల పఠించుట అజ్ఞానమేకదా? విజ్ఞానమునకు దూరమవుట కాదా?

అవి ఆనాటి వారికి విజ్ఞాన గ్రంథములగును. ఆనాటివారు పూజింపవలయును, పఠింపవలయును. నేడు మనము విజ్ఞానులము విజ్ఞాన గ్రంథముల పూజింప వలయును. పఠింపవలయును. మనికిది ధర్మము, వారి కదిధర్మము.

అందుకు భిన్నముగా అజ్ఞాన జనిత వేదముల పూజించుట యూ అజ్ఞానకాలమునకుపోవుటే యగును. నేటివిజ్ఞానమును ఖూనీ చేయుటే యగును.

అజ్ఞానమున ప్రపంచ పుట్టుకను మనిషికొక విధమున చెప్పారు. అవే వేదములు, మతములు.

ఒకరు "బ్రహ్మ" సృష్టిజేశా డన్నారు మరొకరు "ఈశ్వరు డ"న్నారు. ఇంకొకరు "ఎహోవా" మరికొందరు "అల్లా" ఇవ్విధమున నివియేమతములైనవి. మతమన నభిప్రాయము, ఏప్రవక్త అభిప్రాయమును యేవ్యక్తి విశ్వశించునో నాతడు ఆ ప్రవక్త మతమునకు చెందిన వాడగుచున్నాడు.

నేడు మనము విజ్ఞానులమై ప్రపంచ రహస్యాన్ని తెలుసుకున్నాము. ప్రపంచాన్ని సృష్టిచేసింది బ్రహ్మకాదు ఎహోవాకాదు. అల్లాకాదు. కాన యీ రోజున వారె సృష్టికర్తలన్న విశ్వశించెదమా? కాన ఆ దేవుళ్లతోగాని, ఆ అజ్ఞాన గ్రంధములతోగాని మన కేవిధమైన సంబంధములేదు. వాటినేపట్టుకు వ్రేలాడి వారెటువంటి వారన "యీవ్వనమున" అమ్మా! పాలుగు వ్వరటే యనువారు.

## సంస్కృతము.

సంస్కృతభాష గీర్వాణభాషయనియు, దేవతల భాషయనియు యెంతో మహాత్మ్యం పించారు బ్రాహ్మలు. ప్రజలకు తెలియు నందున నెంతో గౌరవించారు. సంస్కృతము నభ్యసించు వానిని గొప్ప వానిగా భావించే వారు. తమకు తెలియనిదల్లా గొప్పదని భావించేవారు ప్రజలు. తమ గ్రంధములు, సిద్ధాంతములు ప్రజలకు తెలియ నివ్వకుండా కట్టు దిట్టములు జేసి సంస్కృతము దేవ భాషయని, అందరూ నేర్చుకొనుటకు సమర్ధులు గారని, నేర్చుకున్నవాడు భగవదంశసంభూతుడని యెంతో మహాత్మ్యం రోపించారు.

వీరి సమస్త గ్రంధములు సంస్కృతముననే వున్నవి, నేడును సంస్కృత మభ్యసించిన, సంస్కృత గ్రంధముల చదివిన, వానిని ప్రజ

లెంతో గౌరవించుచుండిరి. వీరి సంస్కృతి యంతయు సంస్కృత గ్రంథము లందే కలదట. వీరి నాగరికతయును కలదట. ఆసంస్కృతినే ఆ నాగరికత నే ప్రచారములోనికి తేవటానికి విశ్వ ప్రయత్నాలు జేస్తున్నారు.

సంస్కృతమే రాజభాషగా వుండాలని ఆందోళన జేస్తున్నారు. అలా సంస్కృతమే రాజభాషయైన, కఠినమగుటచే కొలది మంది బ్రాహ్మలో మినహా ప్రజానీకము విద్యకు దూరులవుతారు. పైగా సంస్కృతభాష బ్రాహ్మణేతరు లెవ్వరూ అభ్యసించగూడ దంటారు. మనుస్మృతి బూజితు లవుతారు. దరిమిలా ప్రపంచ జ్ఞానాన్ని తెలుసు కోవటానికి ప్రజల నధోగతిపాలు జేయటానికి సంస్కృతి యనునదిందులోకే.

సంస్కృత భాషచచ్చుభాష. దీన్ని వెంత వున్నతమునకు తీసుకు వెళ్లాలని ప్రయత్నించారో, అంత అధఃపతనము జెందింది. సంస్కృతమున వ్యాకరణ దోషములు లేకుండా మచ్చుకు ఒక్క గ్రంథమైనా లేదని "సవాల్" జేస్తున్నా.

సంస్కృత వ్యాకరణములు విరుద్ధములగుటచే ఒక పండితునకు గ్రాహ్యమైది మరొక పండితునకు దోషమవుతుంది. ఇందువలన ఏదితప్పో ఏదిఒప్పో తెలియని పరిస్థితుల్లో సంస్కృత పండితులు తలలు బద్దలు కొట్టుకుంటున్నారు. ఒకడు వ్రాసిన గ్రంథమందు మరొకనికి వేలకువేలు దోషములు కానవచ్చుచున్నవి. కాన సంస్కృతమందు గ్రంథము వ్రాయనేవలనపడదు. ఆయవస్థతోనే సంస్కృతము మృతి జెందింది. నేడు "చచ్చుభాష" యని పిలచుచున్నాము. ఇట్టి సంస్కృత భాష దేవభాషయట.

వ్యాకరణ కర్తలు, కోశకారులు, కవులు, లక్షణ విరుద్ధము లన్ని తప్పులుగా భావించి, గ్రామ్యములన్ని నిందించిన రూపములు

వేనకు వేలు కవుల కావ్యాల్లో కన్పట్టుచున్నాయి. ఇట్టి సంస్కృతము పవిత్రమైన భాషయట దీని నభ్యసించువారు పూజనీయులట.

• సంస్కృత భాష 30 సంవత్సరము లభ్యసించిననేగాని ఆతప్పుల తోనైనా గ్రంథము వ్రాయుటకు సమర్థులుకారు. అంతటి కఠిన (చచ్చు) భాష, ఇటు వంటి సంస్కృత భాషను మీరెన్నడూ గౌర వించవద్దు, దాని నభ్యసించు వానిని జీవచ్ఛ్రవముగా భావించండి.

## కవి_కవిత్వము_కావ్యము.

కవి యంటే ప్రజల యందు విప్లవము కలిగించే నిమిత్తమై, విప్లవ భావాలను చేర్చి కూర్చి ప్రజలచే పాడించేవాడు.

అట్టి గీతముద్వారా ప్రజలు చైతన్యవంతులై సంఘాభ్యుద యానికి పాటు పడతారు.

ప్రపంచ నాగరికత యెట్లు క్షణక్షణము మార్పు జెందు చూవున్నదో. అద్దాని తెలిపి మూఢా భావాలను, మూఢా చారా లను నశింపజేసి "యిలా" ప్రవర్తించాలని బోధించేవాడు కవి. ప్రజ లను అభ్యుదయపథానికి నడిపించేవాడు కవి. ప్రజలను విప్లవ వంతుల జేయువాడు కవి. ప్రజాశ్రేయస్సుకై పాటుపడేవాడు కవి. ప్రజలందు వినూత్న ఆచారవ్యవహారముల గలుగజేయు వాడు కవి. ప్రజాజీవితాన్ని సుఖవంతము జేసేవాడు కవి. ప్రజలకు వినోద, విజ్ఞానముల ప్రసాదించేవాడు కవి.

ప్రజలెంతటి విద్యావంతులై యున్నారో గమనించి వారవ గాహన జేసుకొను భాషలోనే నడవాలి కవిత్వము. అట్టి కవిత్వము జెల్లుతుంది. అందుకు భిన్నమైనది మృతకవిత్వమే కాగలదు. ఇట్టి దానిని జెప్పువారు మృతులో? సజీవులో?? జీవచ్ఛ్రవములో???

ఈ కవిత్వము పూర్వులు రచించిన ఛందస్సులలోను గాకూడదు. ఆ ఛందస్సు—ఆకవిత్వము ఆకవులు—ఆకాలము ఆఅజ్ఞానము ఆద్రోహచింతన వారికే చెల్లుబడి యయినది. నేడు మనము నూత్న ఛందస్సును నిర్మించుకొనలేమా? ఆచచ్చుఛందస్సుతో మనకేమి ప్రయోజనము? నూత్నఛందస్సుతో చెప్పినదే నేడు కవిత్వమన బడు తుంది.

కవి జెప్పిన దంతయు కవిత్వమే. ఛందస్సు రీత్యా భావాలను వెలిబుచ్చేవాడల్లా కవియే.

కొందరు మూర్ఖ పండితులు, ఏ సనాతన ఛందస్సు గలదో ఆ ఛందస్సురీత్యా జెప్పినదే కవిత్వమని అట్లు జెప్పువాడె కవియని అప్రమత్తతతో పల్కుచుండిరి. ఈ సనాతనా భావజీర్ణహృదయ ఛాందసోత్తముల నొక్క క్షణమున యాసనాతన కాలమునకే పంపుట శ్రేయస్కరము, ఆధునిక కాలమున వీరికి స్థానము లేదు.

సామాన్య ప్రజానీకానికి యర్థమవునదే కావ్యమన బరగు తుంది. తదితర కావ్యము లన్నియు అమేధ్యమువలె విసర్జింప దగినవి.

## భాష.

భాష ద్వివిధము. గ్రాంధికము. గ్రామ్యము.

ప్రజానీకాన్ని నిలువునా ఖూనీ జేయుటకు పనికివచ్చు ఆయుధమే గ్రాంధికము. ఈ ఆయుధము చేతనే హిందూదేశ విద్యను ఖూనీ జేశారు బ్రాహ్మలు.

గ్రామ్యమును సంస్కరించి ప్రజల నుద్ధరించకుండా—గ్రాంధిక భాషను సృష్టించుకొని, వారే విద్యావంతులై ప్రజల నధోగతి పాలు చేశారు బ్రాహ్మణులు. అందువలన గ్రామ్యము మరీ అధ్వాన్నస్థితి జెంది అనేక వ్యవస్థలకు లోనైనది.

ఒకే మాతృభాష మాటలాడు జనులు ఒక జిల్లావారి భాష మరొకజిల్లా వారికి అర్థముకాని పరిస్థితులు సంభవించినాయి

ప్రజ లజ్ఞానులైనందున వారు మాటలాడు ప్రతి వాక్యము నందును అనేక బూతు పదముల నూతగా గైకొందురు.

ఇట్టి బూతు పదములు లేక ప్రజల కర్థమవు రీతి వుచ్ఛరించు నది శుద్ధ గ్రామ్యము లేక వ్యవహారిక భాష యనబడును.

బూతు పదముల నూతగా గైకొని అనేక రూపాంతరములతో మాట్లాడునది అశుద్ధ గ్రామ్యమందురు. ఇట్టి దానిని యెప్పటికప్పుడు సంస్కరించుచూ వ్యవహారిక భాషను నెలకొల్పిన, ప్రజలు మరింత అధోగతి పాలు జెంద నవసరముండెడిదికాదు.

బ్రాహ్మలు గ్రాంథిక భాషను సృష్టించుకొని ప్రజలకు తెలియు శక్తి లేకుండా జేశారు. పైగా బ్రాహ్మణేతరు లెవ్వరూ విద్య నభ్యసించ రాదను శాసనమున్ననే యున్నది. ఏతే అయినది గ్రామ్యమునైనా సంస్కరించిరా? యన్ననదియును లేదు. అసలు ప్రజల భాషతోగాని, ప్రజాభ్యుదయముతోగాని, వానికి సంబంధము లేకపోగా, ప్రజల నాశ నముజేయు మార్గములతో సంబంధము పెట్టుకొని సనాతనులు యింతాపని జేశారు.

స్వత్వము లధికారు లైనందున కలిగిన ప్రయోజనము తిలకించారా? గ్రాంథిక భాషను సృష్టించుకొని ప్రజల నజ్ఞానుల, నవిద్యావంతులు జేయుటే వారి యుద్దేశ్యమని తెల్లంబయ్యెనా? స్వత్వముల యధికారాన్ని ప్రతిఘటించండి. ప్రక్కలో బల్లెముగా వారిని భావించండి. మనల నవిద్యావంతులజేసి, అజ్ఞానులజేసి, పశువులజేసి, మీదయెక్కి స్వారిజేయుటె వారి యుద్దేశ్యము.

## ప్రాణాయామం

## (సన్యాసి)

ఉచ్ఛ్వాస నిశ్వాసల నిరోధించి గాలిని పీల్చకుండా హృదయమందే బంధించిన కొన్ని మహాత్ములు కలుగును. అవి నీళ్లమీద నడవ

వచ్చు గాలిలో యెగురవచ్చు. ఇట్లే యనేక మహాత్ముల జూపెదరు. ప్రజలిట్టి మహాత్ముల కాశ్చర్యము జెంది దేవుడంతటి వారని పూజించెదరు. ఆ గౌరవము వుండబట్టే నేటి సన్యాసులు సరక్షణ సురక్షితమున జీవించుచున్నారు. ఆమహాత్తే వేదాంతులకు యాకర్షణ శక్తియై పూజింపబడుచున్నారు.

ఈ ప్రాణాయామము బాల్యమునుండి 30 వత్సరములు సాధన జేసిననే మహాత్ములు కలుగును. ఈమహాత్ముల చేతనే సాధువులు ప్రజా గౌరవాన్ని పొందారు. వీరు ఆగ్రహము జెందిన సప్తసముద్రము లింకుననిరి. మూడవ నేత్రము తెరచిన పదునాల్గు భువనములు భస్మములగుననిరి. ఇట్టి డాంబికత్వముచే ప్రజల నుండి రాజులవరకూ తమ చేతిలో అట్టి పెట్టుకున్నారు.

దరిమిలా కొంత కాలమునకు వీని వలన ప్రయోజనము కన్పట్టకపోగా, విశేష కష్టము లనుభవించుటచేత క్రమేపీయోగము లన్నిటిని విసర్జించారు. సన్యాసులై దేశపర్యటనకు బయలు దేరారు,

గెడ్డము, జుట్టూ పెంచుకొని కాషాయాంబరధారులైతే, మహాత్ములు కలవారని ప్రజలు గౌరవించేవారు.

ఆసన్యాసి వూరుబయట కళ్లుమూసుకొని కూర్చున్నేవాడు. ప్రజలుచూచి మనలనుద్ధరించుటకు కాబోలు మన గ్రామమే తెంచెనని అచ్చట ఒక మఠము (ఆశ్రమము) నిర్మించెదరు. అందు ఆసన్యాసి బైఠాయించి "ప్రజల సుఖదుఃఖములరసి, దుఃఖములబాపి, సుఖము కలుగ జేయునిమిత్తమై యిట్లు బయనమైతిమ"ని వచించెడివారు.

అంత తండోప తండములుగా ప్రజలు వెళ్లి దర్శించెదరు. ఎవరికి తోచినదివారు ముట్టజెప్పెదరు

వీరికి కొందరు రోగాదులున్నవారు. సంతాన హీనులు విశేష కానుకలగైకొని వెళ్లెదరు ఆ కానుకల సమర్పించి తమకోర్కెల జెప్పెదరు. అంత ఆ సన్యాసి కురూపస్త్రీలైన బూడిద మంత్రించి యింటికి

వెళ్లి తతంగము జేయుమనును. సౌందర్యులైన అచ్చటనే వారము రోజులుండిన గర్భము ధరించి తీరుననును. అట్లు ఆరాత్రి రహస్య్ముగ ఆమెపండుకున్న గదిలో ప్రవేశించి, సంభోగమున కుపక్రమించును. కొందరుస్త్రీలు సంతానాపేక్షకు లగుటచే అంగీకరించెదరు. సంతానము మాత్రము కలుగలేదు. ఏలన గర్భదోషము లుండుట వలన సంతాన రహితులయ్యెదరు గాన, గర్భదోషము నివర్తించిననాడే సంతానము కలుగునుగాని, యెన్నిమంత్ర, తంత్ర, జప యాగముల జరిపినను, యెంతమంది సాధువుల పొందినను సంతానము కలుగదు.

మరికొందరు స్త్రీలు సంభోగమున కంగీకరించక రహస్యము బయట పెట్టెదరు.

ఇవ్విధమున యీ సన్యాసి మరొక గ్రామమునకు వెళ్ళి వచ్చుటకు నిట్లనే ప్రారంభించును. ఈవిధమున స్త్రీలను చెరచుటకే వీరు గడ్డము— జుట్టు పెంచుకొని కాషాయవస్త్రధారులై యుందురు.

ఇట్లు ప్రజలకు సన్యాసుల సరంజామా తెలిసినందున సన్యాసులు పెళ్ళిల్లు జేసుకొన వూరక బిచ్చమెత్తుకొని జీవించుచున్నారు. ఆహా! యోగాభ్యాసపరులైన దేవుళ్లకు యెంతటిగతి పట్టినది?

వీరు హస్త సాముద్రిక మభ్యశించి అనేక విషయములు జెప్పెదరు. అందు ఒకటి రెండు నిజముగాక పోవునా? అందులకు ప్రజలు విశేష ధనము నిచ్చుచున్నారు. ఇవ్విధమున సన్యాసులు సోమరులై సలక్షణముగా కాలమును గడపుచున్నారు.

ఇక భౌతిక వాదియో అనేక మహత్తుల కలుగ జేయుటకై తన జీవితమంతా ధారపోస్తారు. అనేక పరిశోధనలు జరుపుతాడు. అనేక మహత్తుల కనిపెడతాడు.

ప్రపంచ ప్రజానీకాన్ని నీళ్లమీద నడిపిస్తాడు. గాలిలో యెగిస్తాడు.

మనము కానీలిచ్చి సముద్రాలు దాటుతున్నాము. కానీ యిచ్చి గాలిలో యెగురుతున్నాము. ప్రాణాయామ యోగి 30 వత్సరములు యోగమభ్యసించుట కెంతు పైసవాదాకా? ఇందువలన ప్రజలకేమి లాభము కలదు? ప్రజలను నీళ్ళమీద నడిపించ గలడా? గాలిలో యెగిరించగలడా? కాన మన కెవరుకావాలి? సన్యాసా? భౌతిక పరి శోధకుడా? భౌతిక పరిశోధకుడు మన జీవితాన్ని సుఖవంతము జేయటానికి తనజీవితాన్ని ధారపోస్తున్నాడు.

ఒక్క క్షణములో ప్రపంచ వార్తలన్నిటిని వినిపిస్తున్నారు. ఒక్క క్షణములో సమస్త రోగాదులు నశింప జేస్తున్నారు. ఇవ్విధమున పాశ్చాత్యులు యిన్ని పరిశోధనలు జరిపి మానవ జీవితాన్ని సుఖ వంతము జేస్తూంటె సన్యాసులు, వేదాంతులు చచ్చిన తరువాత సుఖము కలుగ జేస్తారట! అందు నిమిత్తమై యీ జీవితాన్నంతా అందుకు వినియోగించాలట.

ఐన యీ ప్రపంచము తుచ్ఛమని, యిహలోక సుఖాలు సుఖాలుకాదని పరలోకమున సుఖము కలదని చెప్పుచున్నారు.

కనబడే జగత్తునందు సుఖము లేదని కనుబడని చోట సుఖము కలదని, అందుకొరకే పుట్టామని అనుకున్న పక్షమున, కనబడని చోటకెళ్లి "యిచ్చట యేమీ సుఖములేదు. కనబడే జగత్తు నందే సుఖమున్నదని, కనబడిన చోటును తుచ్ఛమని, కనబడే ప్రపంచమందే నిజమైన యానందము కలదు" యిప్పుడు తలంచెదరా! లేనియెడల యీ జగత్తు యందున్నారుగాన యీ జగత్తునందు దేయానందము కలదో నద్దానినే యనుభవించుడి. ఇంతకంటే అధికానందము మరెచ్చట లేదని సంపూర్ణా నందము పొందండి. ఇది ఆనందము కాదని చచ్చిన తరువాత సంపూర్ణానందము పొందుతామని వుభయ భ్రష్టులై ఘోర దుఃఖాన్ని పొందటమే.

## ఆధ్యాత్మికత

అజ్ఞానా వస్థయందు మానవుడు ప్రకృతిని యర్థము జేసుకొని తన పరిస్థితులకనుకూలముగ ప్రకృతిని మార్పుజేసి కొనలేక—తన శక్తి

కన్నను ప్రకృతి శక్తు లతీతముగా నున్నందున, యీ భయంకర ప్రకృతితో జోక్యము కలిగించుకొని ముందు కష్టాలు పడేకంటే, యీ ప్రకృతితో జోక్యము లేకుండా కళ్లుమూసుకొని కూర్చుంటే, అదేసుఖమని తలంచి ఆధ్యాత్మికతను అవలంబించారు.

ఈ ప్రపంచ మందు జీవించుట కష్టముగా నున్నందున, జీవితము యీడేరునని భావించిరి.

ఇచ్చటే ఆధ్యాత్మికము భౌతికము పరస్పర మార్గముల ననుసరించినవి. భౌతికం అంటే జీవించటానికి యే కష్టాలున్ననో వానిని తొలగించుకొని సుఖంగా జీవించటమే. అది ప్రకృతితో పోరాడటానికి బయల్దేరింది. ప్రకృతి పోరాటానికి భయపడి, ప్రకృతి నుండి దూరముగా వెళ్ళి, కళ్లుమూసుకొని కూర్చుండుటయే ఆధ్యాత్మిక సంస్కృతియైనది.

ఈ ఆధ్యాత్మిక సంస్కృతినే మాది ప్రత్యేక సంస్కృతి, పరలోక సంస్కృతి, దైవసాన్నిధ్యానికి గొంపోవు సంస్కృతి, ఉత్తమోత్తమైన సంస్కృతి, యని గొప్పగా జెప్పుకుంటున్నారు

మానవునకున్న కోర్కెలు నశింపు జేసుకోవాలసి వచ్చింది. ఎందుకంటె కోర్కెలు ప్రకృతిని కోరుతాయి. అందులకని ప్రకృతి సాంగత రహితులు గనుక కోర్కెలను బలవంతముగా నశింపు జేసుకుంటున్నారు వేదాంతులు. ఇలా నశింపు జేసుకుంటేనే మోక్షము కలుగుతుందని చెప్పుచున్నారు. కోర్కెలన మనస్సు. మనస్సంటే సమస్త ప్రకృతిని తెలిసికొన గలిగిన సమస్త విజ్ఞాన గని ఇట్టి మనస్సును నశింప జేసుకొంటే మోక్షమంటున్నారు. సంపూర్ణానందము లభించుతుందంటున్నారు. పునర్జన్మ రహితులగుదురంటున్నారు.

మానవునకు మనశ్శక్తి ఆకాశమునుండి వూడిపడలేదు. వికాణి యీ విమర్శనా పూర్వక జ్ఞానశక్తికొరకే కొన్ని లక్షల దశలు యెత్తి, కొనికోట్ల సంవత్సరములు గతించినదే మానవజన్మ, జ్ఞానశక్తి

లభించినాయి. అట్టి పవిత్రమైన జ్ఞానశక్తిని నశింప జేయుటే మోక్షమంటున్నారు వేదాంతులు. ఇంత కంటే ప్రకృతి విరుద్ధకార్యమేదొండు గలదా?

ప్రతి మానవుడు సర్వదా సుఖమునే కోరుచున్నాడు. అన తన జీవిత కష్టముల తొలగించుకొని సుఖమున జీవించవలయునని వాంఛించుచున్నాడు. ఇది యెలా సాధ్యమవుతుంది? ప్రకృతితో పోరాటానికి బయద్దేరాలి. ప్రకృతి జ్ఞానమును పొంది తన కనుకూలముగా ప్రకృతిని మార్పు జేసుకోవాలి. తద్వారా సుఖంగా జీవించటమే జీవిత లక్ష్యము.

జీవించ వలెనన్న ఆహారము అవసరము కదా! ఆహారము కావలెనన్న ప్రకృతిపోరాటము సిద్ధమే గదా? అట్టిచో అనేక కష్టములు సంభవించును. ఆ కష్టముల నన్నిటిని తొలగించు కొనవలెనన్న ప్రకృతిని వశీకరణము జేసుకొనవలెను. తద్వారా మనము కష్టించకుండగనే, సులభమున ఆహారము సంపాదించి సుఖంగా జీవింప గలము. ఇట్టి సుఖమునే ప్రతిజీవి సర్వదా వాంఛించు చున్నది.

ఇట్టి సుఖము కొరకు వేదాంతులు మరొక పద్ధతి చెప్పు చున్నారు. ఏ మనంటే ప్రకృతినుండి దూరముగా వెళ్ళి కోర్కెలను (మనస్సును) నశింప జేసికొని కళ్ళుమూసుకొని కూర్చుంటే జీవితమంతయు సుఖమట.

ఇందుకు విరుద్ధముగా భౌతిక వాదులిట్లు జెప్పెదరు.

మానవుడు జీవించ వలెనన్న ఆహారాదులు అవసరముగదా? అందునిమిత్తమై ప్రకృతి సంబంధము తప్పనిసరిగదా! అట్టి సమయమున ప్రకృతినుండి దూరముగా వెళ్ళి కళ్ళు మూసుకొని కూర్చుంన్నందు వలన ప్రకృతి జ్ఞానానికి దూరులై అజ్ఞానులై చేయునది యేమీలేదు. అట్లు కొన్నికోట్లు వత్సరము లుండినను ప్రకృతిఆహారమిడునా? మానవుడు ప్రకృతియందు జీవించుచూ ప్రకృతి జ్ఞానము

సంపాదించక పరలోక జ్ఞానముకై ప్రయత్నించుట యెంత అవివే కము? "ఉట్టికెక్క లేనమ్మ స్వర్గమున కెక్కునా?"

వేదాంతులే మోక్షసుఖము సుఖము కాదని భౌతిక సుఖమే నిజమైన సుఖమని మోక్ష ప్రయత్నములు మాని, బోధల రూపేణ విధవలరా బట్టి వారితో ద్వైతమునుండి అద్వైతము (ఏకత్వము) జెందుదురు. అదే మోక్షానందము.

ఇట్టి వేదాంతులు సోమరులై శిష్యులచే పోషింపబడుచూ భౌతికసుఖముల ననుభవించు చుండిరి. ఈ ప్రపంచమున భౌతిక సుఖ ముల ననుభవించుట కిదియొక యుపాయము. పామరులు మోక్ష మను యాశచే వుపదేశములకై గురువుల నాశ్రయింతురు. అంత 12 వత్సరములు శిష్యుని మనోనిశ్చలత గ్రహించి గురువు వుప దేశము చేయునట! ఆ వుపదేశమును సాధన జేయవలయునట!! అట్లు సాధన జేయువారిలో కోటికి ఒకడు మోక్షమును పొందునట!!!

ఈ వేదాంతులు సంఘమునకు వుపయోగించక పోగా సంఘాభ్యుదయమును నాశనము జేయువారుగా గన్పట్టు చున్నారు.

వీరు మానవులుగా పరిగణింప బడరు మరి పశువులందుమా? సంఘమునకు పశువులు విశేషసేవ జేయుచున్నవి. కాన వీరి కన్నను పశువులే యుత్తమమైనవి. మరి వృక్షమో? శిలమో? అందుమా? వృక్షము, శిల సంఘమునకు అత్యవసరములు, ఇవియును సంఘము నకు విశేషసేవ జేయుచున్నవి. కాన వీరి కన్నను వృక్షము, శిల వుత్తమములు, నేయేల! సంఘమునకు సమస్తము వుపయోగించు చున్నవి గాని వేదాంతులు మాత్రము అణు మాత్రమైనా వుపయో గించుటలేదు పైగా సంఘము వీరిని పోషింప వలయునట! గౌరవింప వలయు నట!! దైవ పూజలు సేయవలయునట!!!

"ఎవరెట్లున్న నాకేమి, నేను మాత్రము సుఖముగానున్న నదియే మోక్షము."

## విగ్రహారాధన

బ్రాహ్మలు జీవించిటానికై పన్నిన పన్నాగములలో నిది యొకటి. ఈరాళ్ళకు అనేక మహత్తుల కల్పించి, జ్ఞానశక్తి నశింపజేసి, సమస్త కష్టాలు విగ్రహారాధనవలననే యీడేరుచున్నారు.

ప్రజలను అజ్ఞానులజేసి, స్వార్థపరులై బ్రాహ్మలు ప్రజల చేత రాతికి మ్రొక్కించారు! రప్పకు మొక్కించారు!! శివుని శిశ్నమునకు మ్రొక్కించారు!!! దేవునిపేరిట విశేష ధనసంగ్రహణ జేయుచున్నారు. సోమరులై సలక్షణముగా జీవించుచున్నారు.

దేవునకు ప్రజలు ధనమిచ్చుట దేనికి? ధనమిచ్చినగాని కష్టముల దూరముజేయడా? అట్లయిన ధనముకొరకే ప్రజలకు కష్టముల కలిగించుచున్నాడనవలయునుగదా? మరియు ధనమిచ్చినవాని కష్టములు దూరముజేసి, ధనమివ్వనివారి కష్టముల నలాగేవుంచునా? ఐన దేవుడు ధనసంపాదనకు మంచి యుపాయమే కనిపెట్టినాడు. దేవుడు భిక్షుగాడా! ప్రజలవద్దనుండి ధనము కోరుటకు? లేక యేవ్యాపారమైనా చేయుటకా? ప్రజలెందుకు దేవునకు ధనమిచ్చుచుండిరి? ధనమిచ్చిన. ని శుభములు కలుగ జేయడా? శుభములు కలుగజేయవలెనన్న సాకారుడు కావలయును గదా? సాకారుడైన దేవునకు శుభములు కలుగ జేయున దెవ్వరు? విగ్రహారాధనమున కించితేని ప్రయోజనము లేదని వేదాంత గ్రంథము లిలాఘోషిస్తున్నాయి. "సర్వవ్యాపకుడైన ఈశ్వరుని విగ్రహమున భావించి పూజించుట ఈశ్వరు నవమానపరచుట కాదా? చేతిలోని పాయసమును జారవిడచి మోచేతిని నాకుట వంటిది కాదా" ఇవ్విధముననే యనేక తెరంగుల విగ్రహారాధన నిషేధింప బడవలయుననుచున్నవి. మనచే సృష్టింపఃబడిన జడమైనరాళ్ళు మన ప్రార్థన నాలకించునా? మన కష్టముల దూర మొనరించునా? ఆ మాత్రము వివేకము లేక ప్రజలు విగ్రహములకు పూజా పునస్కారములు భక్తితో సలుపుచుండిరి. బ్రాహ్మలు విగ్రహములకు మహత్తు కలదన్న మాత్రమున విశ్వసించుట పాడియా? మహమ్మదీయులు దేవాలయముల పడగొట్టినపుడు

విగ్రహముల మహత్తేమైనది. పోనీ సర్వకాల సర్వావస్థల యందును పూజసేయు బ్రాహ్మలనైనా రక్షింపలేక పోయెనా? ఆదైవ విగ్రహములనే మసీదు మెట్లగా నిర్మించి మహమ్మదీయులు నిరంతరము త్రొక్కుచున్నను రక్షించుకొనుశక్తిలేదే? ఓహో! బ్రాహ్మణ దేవుళ్ళ కెంతగతి పట్టినది? తనను తాను రక్షించుకొనలేని దేవుడు యితరులను రక్షించునా?

ప్రజలు బ్రాహ్మణ మాయోపాయములకు మోసపోయి విశేష ధనమును పోగొట్టుకొను చున్నారు. దేవుడు నివసించుటకు యిల్లు లేదన్నాడా? ప్రజలేల దేవాలయముల నిర్మించిరి? నిర్మించు చున్నారు?? నిర్మింపనున్నారు??? జీవించుటకు ధనము కావలయు నన్నాడా? ప్రజలేల ధనము నొసంగుచుండిరి? ఇదంతయు బ్రాహ్మణ కుతంత్రము. ఇకనైనా బ్రాహ్మణ కుతంత్రములను తెలుసుకోండి.

సంఘమును అజ్ఞానావస్థయందె అట్టిపెట్టుట ప్రథమకర్తవ్యము. తద్వారా వారుచెప్పు నసత్యముల విశ్వసింపజేయుట ద్వితీయ కర్తవ్యము. తద్వారా విశేష ధనసంగ్రహణజేసి సుఖముగా జీవించుట వారి లక్ష్యము. అట్టి అజ్ఞానావస్థయందే నేటివరకూ అట్టిపెట్టారు. అలాగే వుండాలనే వారియుద్దేశ్య మయ్యెడిని. అట్లు మన సంఘాన్నంతా అజ్ఞానావస్థలోనే అట్టిపెట్టి రాతికంటెను చైతన్య విహీనుల జేసి, రాళ్ళకు మ్రొక్కించి, దేవునిపేరిట ధనసంగ్రహణ జేయుచున్నారు. దేవునిపేరిట మడిమాన్యా లనుభవించుచున్నారు. ఇట్టి యన్యాయ మింకెన్నినాళ్ళు? బ్రాహ్మణ ప్రభుత్వమున్నంతకాలము. కాన తక్షణమె బ్రాహ్మణ ప్రభుత్వాన్ని నిషేధించి, అజ్ఞానాభివృద్ధికి తోడ్పడు దేవాలయముల నిర్మూలించి, రాయే దేవుడను విశ్వాసము తమకు లేనప్పటికి, ప్రజలకు విశ్వాసము కల్గించే అర్చకుల శిక్షించి, మడిమాన్యముల స్వాధీన పరుచుకొన నలయును.

## పౌ రో హి తు డు

పురమునకు (గ్రామమునకు) హితముజేయువారలమని "పౌరోహిత్" నామధారులై కొందరు బ్రాహ్మలు బయలుదేరారు.

పంచాంగమును సృష్టించారు. దోషరహిత కాలమునకు దోష మాపాదించారు. కాన ఏకార్యమైనను దోషరహితమైన శుభమున జేయవలయుననిరి. అంత ప్రతికార్యమునకు పురోహితుడు శుభము చెప్పిననే కార్యము జరుగును. ఇట్లే సమస్త కార్యములు పురోహితుని "శుభము" ద్వారా జరుగుచున్నవి.

ఈ శుభమే (లగ్నమే) సత్యమైన ఎన్ని దాంపత్యములు విచ్ఛేదము కాలేదు? ఇందరు వితంతువు లేలయుండిరి? ఇందువలన, లగ్నబలము శుభమును కలుగ జేసినదా?

లగ్న బలమున నొక దివ్య భవమును నిర్మించి ఆటంబాంబు వేసినను నశింపక నట్లేయున్న లగ్న బలము కలదనిన విశ్వసించ వచ్చును. అంత దనుక లగ్న బలమును, బ్రాహ్మణుల విశ్వసింపకుడు, ధనసంగ్రహణకే యిన్ని తంతులు పన్నుచుండిరి.

గ్రహములు మన కార్యములకు శుభము కలుగజేయునట. ఆ విషయము వీరికి జెప్పినవట. వీరు ప్రజలకు చెప్పుచుండిరి ఓహో! ఎంత వైపరీత్యము సంభవించినది? జడములగు గ్రహాదులు శుభాశుభాదులు కలుగుజేయునా? అసలు గ్రహములననేమో? ఈ సనాతన ఛాందసులకు తెలిసిన నిట్టి చిక్కు సంభవించెడిదికాదు.

సూర్యగ్రహణము చంద్రగ్రహణము నిర్ధారణగా చెప్పుచున్నందున వారు జ్యోతిషమంతయు (లగ్నము) సత్యమని విశ్వసించుచున్నామని కొందరనుచున్నారు.

గ్రహణ కాల నిర్ణయ మెట్లు చేయుచుండిరో తెలియనందున అన్నిటిని నటులనే విశ్వసించుచుండిరి.

విశేషకాలము అవలోకన జేసిన పిమ్మట కలుగు యనుభవమున గ్రహణ కాల నిర్ణయము జేయగలిగిరి. అమావాస్యనాడు సూర్యగ్రహణమును; పౌర్ణమినాడు చంద్రగ్రహణమును కలుగునని నిర్ణయించుకొనిరి.

ఇట్లు అవలోకనము జేయుచూ గ్రహణ చక్రము 1 సంవత్సరముల 11 దినముల 7 గంటల 42 నిముషము (మినిట్సు) లకొకసారి తిరుగుచుండునని గ్రహించారు. అనగా 18 సంవత్సరముల యనంతరము మరల యాగ్రహణములే వచ్చునని తెలుసుకొని కొన్ని గంటలు హెచ్చు తక్కువగా గ్రహణకాల నిర్ణయము జేయగలిగిరి.

ఇట్లు మరికొంత కాలము యవలోకన జేయుచూ గ్రహణ ఘటికల కనుగొని నిమిష భేదము లేకుండగనే గ్రహణ కాలనిర్ణయము జేయ గలిగిరి. ఇట్లు విశేష కాలము యవలోకన జేసిన పిమ్మటనే గ్రహణ కాలనిర్ణయము జేయగలిగిరి.

కాన గ్రహణ కాలనిర్ణయమును జెప్పుటకును, కాలదోషము చెప్పుటకును సంబంధము లేదని తెలిసికొని యున్నారు. కాన కాలమంతయు మంచిదే యనియు, మనము చేయుమంచి, చెడుకార్యములవలననే మంచిని, చెడును పొందుచున్నాము. ఇదే కర్మ. అనగా మంచికర్మ (కార్యము) జేసిన సుఖమును, చెడుకర్మ జేసిన దుఃఖమును పొందుచున్నాము. అంతియే గాని గతజన్మమున కర్మ యీ జన్మన యనుభవించుట కాదు. తాను జేయు ప్రతికార్యమూ "కర్మ"యే. దీని ఫలితము చెడుగాని మంచిగాని యీ జన్మలోనే పొందితీరును. కాన సత్కార్యములు జేసి సుఖము శుభము పొందుట మానవుని లక్ష్యము.

## బ్రాహ్మణులు,

బ్రాహ్మలు నూటికి నూర్గురు విద్యావంతులై, బ్రాహ్మణేతరుల నూటికి నూర్గుర నవిద్యావంతుల జేసి, అసత్యగాధల, సిద్ధాంతములు విశ్వసింపజేసి దేవుని పేరిట ధనసంగ్రహణ జేయుచూ సంఘమున దేవునివలె పూజింప బడుచుండిరి సోమరులై ప్రజల ధనముచే సలక్షణముగా జీవించుచుండిరి.

ఎండనక వాననక, రాయనక రప్పనక, కష్టమనక, దుఃఖమనక 20 గంటలు కండలు కరుగబెట్టి, గంజినీళ్ళకూ కరువయ్యే శ్రామికుడు తన కష్టానికి తగిన ఫలితము లేదని కార్యాభిష్టులు ప్రస్తుండిరని, చాలీచాలనిగంజితో కష్టము జేయలేకున్నానని మొర పెట్టుకొన్న దేశ ద్రోహి! ప్రభుత్వ ద్రోహి!! కారాగార నివాసము, వురిశిక్ష !!!

ఆహా! బ్రాహ్మణ ప్రభుత్వము! సోమరులై ప్రజల ధనముచే జీవించు బ్రాహ్మలు పూజనీయులు! అధికారులు!! గౌరవనీయులు!!!

దినమంతయు చెమటోడ్చి రెక్కలు విరచుకొని పోషించి, సుఖపెట్టు శ్రామికుడు నీచుడా! ద్రోహియా? కట్టి శ్రామికుల దోచుకొని కడుపు పగులునట్లుమెక్కి పరాన్నభుక్కులై పార్వాళు సనాతనాచార్లు గౌరవనీయులా? పూజ్యులా? అధికారులా? దేశసేవకులా?

ప్రజల మూఢాచారాలను అవకాశంగా తీసుకొని వారిని పీడించి దోచుకొంటున్న సనాతనాచారులను అరికట్టాలి. ప్రజలలో పాతుకొనివున్న మూఢవిశ్వాసాలను నిర్మూలించి వారిని విజ్ఞానుల చేయాలి

## ఆస్తికత్వము

మానవుడజ్ఞానయవస్థయందు ప్రకృతిని అర్థము జేసుకొనలేక ప్రకృతిని సృష్టించి పాలించు (నడపు) అతీతశక్తి కలదని భావించిరి. ఈ "అతీతశక్తికే" "దేవుడ"ని పేరిడిరి. ఈ దేవుని యాజ్ఞచేతనే సర్వశక్తులు క్రమబద్ధముగా నడచుచున్నవనిరి.

మానవుడిట్లు ప్రకృతిని తెలిసికొనలేక "దేవుని" సృష్టించుకొనెను. ఈ దేవుని ప్రార్థించిన కష్టములు దూరమగునని దైవగానము జేయ మొదలిడిరి. అహోరాత్రములు దేవుని ప్రార్థించిరి. కాని కష్టము లట్లనేయున్నవి. దేవుడు కష్టముల దూరము జేయునను విశ్వాసము కొంతనశించినది. పోనీ దేవునిపై నాధారపడకుండ, కష్ట

ముల దూరము జేసుకొను జ్ఞానము లేనందువలన దేవునిపై విశ్వాసము వుంచవలసి వచ్చినది. ఐనప్పటికి మనకున్న కష్టముల మనమే నివర్తించు కొనవలయునని, ప్రకృతి జ్ఞానము సంపాదింప మొదలిడిరి.

ఆధ్యాత్మిక వేత్తలు దేవుని పరిశోధించి రాయినుండి, నిర్వికారము వరకూ గొంపోయిరి.

భూమినుండి ఆకాశమునకు మధ్య యేశూన్య ప్రదేశము కలదో ఆశూన్యమునే "పరబ్రహ్మము" నదరు. నిర్వికారుడు, నిర్గుణుడు, నిష్క్రియుడు యని యనేక భంగుల యీ శూన్యాకారమును దేవునిగా నిలిపి భక్తితో పూజింపసాగిరి.

బ్రాహ్మణులిట్లు దేవుని నిర్వికారమువరకూ గొంపోయినప్పటికి ప్రజానీకానికి తెలుపకుండా స్వార్థపరులై రాతి విగ్రహములే దేవుడని పూజింపమన్నారు కట్నములు కానుకలు, దేవుని పేరిట విశేషముగా సంగ్రహించు చుండిరి. అందువలన రాతి విగ్రహములకు మహాత్మ్యల కల్పించుటకై అనేక ఆస్తిక గ్రంథముల రచించారు వీనిని వినిన, చదివిన, తాకిన సమస్త పాపములు నశించుననిరి. ఇవ్విధమున ప్రజలను పాపులజేయ మొదలిడిరి ప్రజలను అజ్ఞానావస్థయందే అట్టిపెట్టిరి. ప్రజలు అజ్ఞానరొంపియందే నీదులాడుచూ దేవునకై ప్రాణములు నర్పింప సిద్ధమైరి. అతివృష్టి అనావృష్టి అంటు వ్యాధులు సంభవించిన అంతా దేవునిమహిమ యని అనేక జంతువుల పశువుల బలియొసంగు చుండిరి. చేయరాని అసభ్య కృత్యముల చేయుచుండిరి.

ఏకార్యము సంభవించినను కారణమరయక. దేవునిచేతనే సంభవించినదని భారమంతయు దేవునిపైవేసి, మూఢాభిప్రాయములకు లోనైనందున వ్యాధిసంభవించిన దేవుడో దేవతో కోపగించి యీ రూపేణనాశము జేయుచున్నాడని ముడుపులు, మొక్కుబడులు,

కోళ్ళను, యేటలను సమర్పించెదరు. అంత వ్యాధినిమ్మూలించిన దేవుని మహిమ. రోగి మరణించిన కర్మ.

ప్రతి విషయమునకు కర్మ—విధి—ప్రారబ్ధము, దేవుడు వీటితో సంఘము అజ్ఞానసామ్రాజ్యమున మహావైభవముగ నుండెను. దేవుని యేజెంట్లయిన బ్రాహ్మణులు అజ్ఞానసామ్రాజ్యమునకు ప్రభువులైరి.

కాన దేవుడే యీ ప్రపంచమును సృష్టించెను. పాలించు చుండెను. సంహరించుచుండెను.

ఆడపిల్లో? మొగపిల్లవాడో? మనదేముంది. అంతా దేవుని ఇష్టము. కొందరికసలే సంతానమివ్వడు? మనము కర్తలమా? అంతా దేవునిమహిమ. ఈ విధంగానే ప్రతివిషయమును దేవుని యాజ్ఞ యనుచుండిరి. అందువలన ఆ విషమకారణమును తెలిసికొను టకు ప్రయత్నింపరైరి. అంతా దేవునికర్తవ్యము, దేవునిపై భారము.

కాన పై విషయాన్ని కొంచెము విమర్శించి దేవుడెంతవరకు కర్తవ్యాన్ని వహించాడో తెలుసుకుందాము.

స్త్రీ, పురుష సంపర్క రహితముగా సంతానము కలుగదని ప్రతివారికి తెలిసిన విషయమే. కాన యిందు దేవుని కర్తవ్యమేమియు లేదని తెల్లంబయ్యెనా? ఐనప్పటికి గర్భకోశమున జరుగు విధానము తెలియనందున దేవునిపై నాధారపడుచుండిరి. ప్రాణయుత్పత్తియెట్లో? ఆడపిల్ల? మొగపిల్ల? సంభవించుట? అసలుసంతానము లేకుండుట మున్నగు విషయములన్నియు తెలియనందున దేవుడే సంతాన మిచ్చుట యివ్వకపోవుట, ఏపిల్లనైనా కలుగజేయుట మున్నగు కార్యము లన్నియు దేవునిపై భారముచేసిరి. దేవునికి కర్తృత్వ మాపాదించిరి.

అసలు సంతానము యెలాకలుగుతుందో తెలుసుకుందాము. పురుషబీజము స్త్రీ అండమూ సంయోగమువలన జీవాణువు (Cell)

కలుగుతుంది. ఈ జీవాణువు గర్భకోశంలో (womb) వృద్ధిపొందుచూ పిండమవుతుంది.

బీజ, అండ సంయోగం, ఎట్లు, ఎప్పుడు, ఎచ్చట, జరుగుతుందో తెలుసుకుందాం.

అండమును తయారు జేసేది అండాశయము. గర్భకోశమునకు రెండు ప్రక్కలా రెండు అండాశయములు కలవు. ఈ అండాశయము చిన్న చిన్న గూళ్ళతో నిండియుంటుంది. ఈ రెండు అండాశయములలో ఒకలక్ష గూళ్ళుఫుంటాయి. కాని స్త్రీజీవితకాలంలో 300 అండములు మాత్రమే పంపబడుతాయి. ఇవే స్త్రీకి బీజములు. యుక్త వయస్సు వచ్చినది మొదలు ప్రతినెలా ఒకపక్వమయిన అండము బయటికి పంపబడుతూ వుంటుంది. ఇలాబయటు దేరిన అండము అండవాహికల్లో ప్రవేశిస్తుంది అండవాహిక లనగా గర్భకోశము లోనికి పోవుగొట్టములు.

పురుషునకు ఒక్కసారి స్ఖలనమవు వీర్యమందు 20 కోట్ల బీజములు వుంటాయి. వీనిలో కొన్ని మాత్రమే గర్భకోశములో ప్రవేశిస్తాయి. వీనిలో ఒక్కటిమాత్రము అండవాహికలోనున్న అండముతో సంయోగముజెంది ఫలవంతం అవుతుంది. ఇలా ఫలవంతమైన అండము, గర్భకోశముజొచ్చి వృద్ధిపొందుతుంది. పిండమవుతుంది. మరణాంతంవరకూ వృద్ధిపొందుతుంటుంది. ఇదే ప్రాణియుద్భవ రహస్యము.

పురుషబీజ సంయోగము ప్రాప్తించని అండము బయటకు గెంటివేయబడుతుంది. ఇదే బహిష్టు.

అండాశయము పునః యింకొక అండమును పక్వముజేసి పంపుతుంది. ఇది అండోత్పత్తి విధానము.

అండోత్పత్తి అయిన 14 వ రోజుకు బహిష్టు కలుగుతుంది. అంటే, అండము బహిర్గతముకావటానికి 14 రోజులు ప్రయాణము

చేస్తుందని తెలియాలి. కాన పిండోత్పత్తి యెప్పుడు జరుగుతుంద యిప్పుడు సులభంగా తెలుసుకోగలము. బహిష్టు అయిన ప్రథమ దినమునుండి 14 రోజులు వెనుకకు లెక్కించగా నిర్ణీతమైన దినము అండోత్పత్తి రోజని తెలియాలి.

పురుష బీజాలు స్ఖలనమై భగరంధ్రమందు ప్రవేశించిన దరిమిలా 5 రోజులు సజీవంగా వుండగలుగుతాయి. కాన అండోత్పత్తికి 5 రోజులు ముందుగా సంభోగము జరిగినను అండము ఫల సంతమవుతుంది.

బహిష్టు ప్రథమ దివసమునకు వెనుక 14 వ రోజు అండోత్పత్తి జరుగుతుంది. కాన అండోత్పత్తిరోజు, యింతకుపూర్వము 5 రోజులు, మొత్తము ఆరురోజులలో అండం ఫలవంతం అవుతుంది. కాన, ఈ ఆరురోజులే గర్భధారణ కనుకూలమైన రోజులు. మిగతారోజులు సంతాన నిరోధమునకు వుపయోగించునవి యని తెలియాలి.

ఇంతవరకూ సంతానమెలా కలుగుతుందో తెలుసుకున్నాము. సంతానము అసలు కలుగకపోవటానికీ, స్త్రీ పురుష లింగవ్యవస్థకు కారణమేమిటో, తెలుసుకుందాం.

ఈ విషయాన్ని జర్మన్ డాక్టరు "ఉన్టర్ బెర్గర్" పరిశీలించి గొడ్డుమోతు ఆవులను కట్టి చడానికి ప్రయత్నించాడు. భగరంధ్రములో ద్రావకస్థితి వున్నందున సంతానము నిరోధింపబడుచున్నదని తెలుసుకున్నాడు. వెంటనే దానిని నశింపజేయుటకు సోడావుప్పు ద్రావణము ప్రయోగించాడు. వెంటనే ఆవులన్నీ కట్టాయి. ఇందు వలన భగరంధ్రములో ద్రావకస్థితివుంటే సంతానము నిరోధింపబడు చున్నదని కనుగొన్నాడు.

ఈ విషయాన్నే నాలుగు వత్సరముల తర్వాత యింగ్లాండులో "షైలరు సోదరులు" పరిశోధించారు.

భగరంధ్రంలో సూక్ష్మంగా ద్రావక స్థితివుంటే ఆడ శిశువు. సూక్ష్మంగా క్షారస్థితివుంటే మొగశిశువు కలుగుతారని, ద్రావక

స్థితిగాని, క్షారస్థితిగాని యెక్కువగావుంటే సంతానము నిరోధింప బడుతుందని కనుగొన్నారు. కాన గర్భధారణ పొందలేని స్త్రీలు ఆస్థితి తగ్గించు కున్నచో గర్భధారణ పొందగలరు.

. ద్రావక స్థితివల్ల ఆడపిల్లలు పుడతారుగాన, ద్రావక స్థితి లేకుండా జేసి, క్షారస్థితిని కలుగజేస్తే మొగపిల్లలు కలుగుతారు. సోడావుప్పు ద్రావణము వలన ద్రావకస్థితి నశిస్తుంది. క్షారస్థితికలుగుతుంది.

ఈ విధంగా పరిశోధనలు జరిపి ప్రయోగించారు. నూటికి 99 మంది మొగపిల్లలే పుట్టారు.

కాన సంతానవుత్పత్తి కలుగజేసు కోకపోవటము, కలుగజేసుకోవటము; మొగశిశువు కావాలంటే మొగశిశువును కల్గించటము మనచేతనైన కార్యమేనని తెలుసు కున్నాము. ఇందు దేవుని కర్తవ్యమేమియూ లేదని రూఢియైనది. కాన యిలాగే ప్రతివిషయాన్ని తెలుసుకుంటే దేవుడే జేస్తున్నాడనే వాదనలకు అస్థిత్వముండదు. కాన యేవిషయాన్నీ కూడా తెలుసు కోకుండా "అంతా దేవుడే" యనరాదు. అట్లు అంతా దేవుని నెత్తినే పెట్టిన, మనము విజ్ఞానానికి దూరులమగుచున్నాము. అసమర్థులగు చున్నాము. అజ్ఞానులగు చున్నాము. అభ్యుదయాన్ని ఖూనీజేసిన వారమవుతాము. కాన ప్రతివిషయాన్ని తెలుసు కోవటానికి ప్రయత్నించాలి. తెలియక పోతే దేవునిపై పెట్టక తెలుసు కోవటాని ప్రయత్నించాలి తెలియకపోవుట తన అజ్ఞానమని భావించి, తెలుసు కోవటానికి ప్రయత్నించాలి ఇదే విప్లవపంథా

## నాస్తికత్వము

బ్రాహ్మణులు మద్యముగ్రోలుచూ, మాంసముసు భక్షించుచూ అవినీతిపరులై యజ్ఞములు జేసిన స్వర్గము లభించుననియు, అశ్వమేధ యాగము షుమ్మారు జేసిన దేవేంద్రపదవి లభించుననియు,

స్థితిగాని, క్షారస్థితిగాని యెక్కువగావుంటే సంతానము నిరోధింప బడుతుందని కనుగొన్నారు. కాన గర్భధారణ పొందలేని స్త్రీలు ఆస్థితి తగ్గించు కున్నచో గర్భధారణ పొందగలరు.

ద్రావక స్థితివల్ల ఆడపిల్లలు పుడతారుగాన, ద్రావక స్థితి లేకుండా జేసి, క్షారస్థితిని కలుగజేస్తే మొగపిల్లలు కలుగుతారు. సోడావుప్పు ద్రావణము వలన ద్రావకస్థితి నశిస్తుంది. క్షారస్థితికలుగు తుంది.

ఈ విధంగా పరిశోధనలు జరిపి ప్రయోగించారు. నూటికి 99 మంది మొగపిల్లలే పుట్టారు.

కాన సంతానవుత్పత్తి కలుగజేసు కోకపోవటము, కలుగ జేసుకోవటము; మొగశిశువు కావాలంటే మొగశిశువును కలిగించ టము మనచేతనైన కార్యమేనని తెలుసు కున్నాము. ఇందు దేవుని కర్తవ్యమేమియూ లేదని రూఢియైనది. కాన యిలాగే ప్రతివిష యాన్ని తెలుసుకుంటే దేవుడే జేస్తున్నాడనే వాదనలకు అస్థిత్వ ముండదు. కాన యేవిషయాన్నీ కూడా తెలుసు కోకుండా "అంతా దేవుడే" యనరాదు. అట్లు అంతా దేవుని నెత్తినే పెట్టిన, మనము విజ్ఞానానికి దూరుల మగుచున్నాము. అసమర్థులగు చున్నాము. అజ్ఞానులగు చున్నాము. అభ్యుదయాన్ని ఖూనీజేసిన వారమవుతాము. కాన ప్రతివిషయాన్ని తెలుసు కోవటానికి ప్రయత్నించాలి. తెలియక పోతే దేవునిపై పెట్టక తెలుసు కోవటాని ప్రయత్నించాలి తెలియక పోవుట తన అజ్ఞానమని భావించి, తెలుసు కోవటానికి ప్రయత్నించాలి ఇదే విప్లవపంథా

## నాస్తికత్వము

బ్రాహ్మణులు మద్యముగ్రోలుచూ. మాంసమును భక్షించుచూ అవినీతిపరులై యజ్ఞములు జేసిన స్వర్గము లభించుననియు, అశ్వమేధ యాగము నూర్మారు జేసిన దేవేంద్రపదవి లభించుననియు,

ఇంద్రాణి పొందులభించుననియు యజ్ఞానుకై క్రూరమృగముల వలె చేయరాని అసభ్యకృత్యముల జేయుచుండిరి.

ఈ సమయమున బ్రాహ్మణదాస్యాన్నుంచి సనాతనాచారుల నుంచి ప్రజలను విముక్తి చేసిన ప్రథమ సంఘ సంస్కర్త "చార్వాకుడు."

ఇతడు "స్వర్గనరకాదులు, మోక్షాదులు లేవనియు, యజ్ఞయాగాదులపేర బ్రాహ్మలు మాంసభక్షణ జేయుటకేయనియు, ప్రజలను నరకమని భయపెట్టి తమ్ముర క్షించుకొనుటకేయనియు, స్వర్గమని ధనసంగ్రహణ జేయుటకనియు" జెప్పి సంఘసంస్కరణ కర్త యయ్యెను.

బ్రాహ్మలకు, ప్రజలకు మూఢాభిప్రాయముల బోగొట్టి మత కర్తయయ్యెను. ఇతడు పరలోకాదులు లేవన్నందున నాస్తికుడయ్యె. ఇతని యనుచరులు నాస్తికులన బరగిరి.

ఈ చార్వాకుడు బ్రాహ్మణ కుతంత్రము బయలుజేసి తమ యాటలు సాగనివ్వక ప్రజలకు వ్యతిరేక ప్రచారము చేయుచున్నాడని బ్రాహ్మణులు నాస్తికులపై కత్తిగట్టిరి. బ్రాహ్మణు లధికారులగుటచే నాస్తిక ప్రచారమును నశింపజేసి పునఃసంఘమును అజ్ఞానమునందే ముంచివేసిరి. వారి యిచ్చివచ్చినట్లు సంఘమును దోచుకొని జీవించుచుండిరి.

ఈ నాస్తిక మతమును నామరూపాదులు లేకుండా నశింప జేసినగాని తమ యాటలు సాగవయ్యెను. అందునిమిత్తమై బ్రాహ్మణు నాస్తికులపై వ్యతిరేక ప్రచారమే కర్తవ్యముగా గలవారైరి.

"నాస్తికులు పరలోకాదుల విశ్వసింపరు. దేవుని విశ్వసింపరు. పెద్దలమైన మమ్ము గౌరవింపరు. కానవీరిని నరకమున యమధర్మరాజు పెట్టుబాధల వర్ణింప యమధర్మరాజర్హుడా ? కానమీరు నాస్తి

కుల మాటలు విని వృధాగా యమలోక యాతన లనుభవించెదరు సుమా ? నాస్తికులు పాషండులు. వీరి మొఖము చూచిన పంచ మహా పాతకము లంటుకొనును."

ఇవ్విధమున సనాతనులు ప్రజలయజ్ఞానుల జేయుటకై నాస్తిక ప్రచారము నాశనము జేసి, నాస్తికులంత సంఘద్రోహులు, దేశ ద్రోహులు లేరని వాగ్రూప ప్రచారమేగాక సమస్త బ్రాహ్మణ గ్రంధము లందును ప్రచారము జేసిరి.

కాన నేడుమనము అభ్యుదయము కోరువారమై సనాతనుల దాస్యాన్నుండి రక్షించు కోవాలంటే ఆస్తిక మతాన్ని కాలదన్ని నాస్తిక మతావలంబకులమై మూఢాభిప్రాయముల విసర్జించి విజ్ఞాను లమ్యేదరుగాక.

ఈ నాస్తిక మతము మూఢాచారాలను, మూఢాభిప్రాయము లను నశింపజేసి, భౌతిక సిద్ధాంతమునకు మార్గదర్శి యయ్యినది. ఇట్టి అభ్యుదయ నాస్తికత్వమును బ్రాహ్మలు స్వార్థపరులై నశింపజేసి అభ్యుదయాన్ని ఖూనీజేసి, ప్రజల నజ్ఞానావస్థ యందే ఉట్టిపెట్టి, పర లోకాదులు, దేవుడు కలవని విశ్వాసింపజేసి, ధనమును సంగ్రహించు చుండిరి. ప్రజలికనైనా సనాతనుల కుతంత్రమును తెలిసికొని, వారు జేస్తున్నసంఘ, దేశద్రోహమునకు శిక్షించి తీరవలయును.

ఈ నాస్తిక వాదము, భౌతిక వాదమునకు మార్గదర్శియై నందున, భౌతికవాదా రంభముననే భౌతిక వాదమునందే లీన మయ్యెడిది. అజ్ఞానమందు జన్మించిన ఆస్తిక మతము అజ్ఞానాంతమున అజ్ఞాన మందే లీనమయ్యెడిని.

భౌతిక విజ్ఞానము వున్నత స్థితియందున్న నాధునిక కాల మందు, ఆస్తికా నాస్తికమతములతో సంబంధము లేదయ్యెడిని.

జీవుని సాధారము జేసుకొని పరలోకాలు, మోక్షము మున్నగు సమస్త ఆస్తిక సిద్ధాంతము లున్నవిగాన అసలు జీవుడంటే యేమిటో మనము తెలుసుకుంటే పునర్జన్మ, పరలోకాలు, మోక్షం వున్నదీ లేనిదీ తెలుస్తుంది.

పదార్థము నుండియే ప్రాణి యుద్భవించినదని తెలిసికొని యున్నాము. ఈ సూక్ష్మజీవాణువులు శరీర రహితమున నుండుటచే శరీరావశ్యకత గలిగినది. ఒక సూక్ష్మజీవాణువు రెండై, నాలుగై, ఎనిమిదై, యివ్విధమున నభివృద్ధిజెంది సమష్టిగా నుండెడివి. ఇట్లు వేనికవి ప్రత్యేక అస్తిత్వము కలిగినందున, వేనికవి రక్షణ దుర్లభమైనందున, పైభాగముననున్న జీవాణువులు గట్టిపడి, లోనున్న సూక్ష్మజీవాణువులకు రక్షణ నిచ్చెడివి. లోనున్న జీవాణువులు చర్మము నుండియే ఆహారము తీసుకొనుట కష్టముగా నున్నందున ఒక రంధ్రాన్ని (నోటిని) నిర్మించుకొని ఆహారము తీసుకొనెడివి. ఆహారము జీర్ణమయ్యేందుకు జీర్ణకోశావశ్యకత కలుగుటచే లోనున్న సూక్ష్మజీవులు మార్పుజెందినాయి. మూత్ర, మలవిసర్జనలకునూ రంధ్రమేర్పరుచుకున్నాయి. చూచుటకు కన్నులను, వినుటకు చెవులను సృష్టించుకొనుచు రక్షించుకొనుచూ అనేక లక్షల దశలెత్తి, అనేకకోట్ల సంవత్సరములకు మానవ జన్మనెత్తాయి.

ఈ సూక్ష్మ జీవాణువులు సమష్టిగా నున్నందున వేనికి వానిని రక్షించుకొనుటకు వీలులేనందున, అన్నిటిని ఒక్కరే రక్షించుట సులభమైనందున, ఈ జీవాణువులన్నీ బాహ్య ప్రకృతిని తెలుసుకొనే శక్తిలేనందున, బాహ్యప్రకృతిని తెలుసుకొని తమను రక్షించే నిమిత్తమై తమకున్న చైతన్యమును ఏకత్వము జేసి సమష్టి చైతన్యాన్ని అధిష్ఠింప జేసినాయి. ఈ సమష్టి చైతన్యమే "మనస్సు"

ఈ మనస్సు బాహ్యప్రకృతిని చూస్తేతప్ప రక్షింప బడుట దుర్లభమని కొన్ని సూక్ష్మ జీవాణువుల మార్పుజేసి చూచేశక్తి కలుగ జేసుకుంది. అలాగే వినటానికి వినేశక్తిని కలిగింది. ఈలాగే తన కెప్పుడేది యవసరమైన సద్దానిని సృష్టించు కొనుచూ యీ సమష్టి చైతన్యము నాయకత్వము వహించి సూక్ష్మ జీవాణువుల రక్షించుటకు భారము వహించినది.

ఈ సమష్టి జీవాణువుల చైతన్యమే (మనస్సు) ప్రకృతితో సంబంధము కలుగ జేసుకొని, జీవాణువుల రక్షించుటకు ఆహారమును నోటిద్వారా పంపెడిది. అట్లు లభించిన పదార్థమును జీర్ణింప జేసి, పిప్పిని బయటకు గెంటి, రసమును యాహారముగా గైకొని జీవించు చున్నవి. వీనికి బాహ్యప్రకృతి సంబంధము లేనందున, బాహ్య ప్రకృతికి సంబంధించిన కష్టములతోనూ సంబంధము లేక, దేహమం దలి విరోధులైన చెడు సూక్ష్మ జీవాణువుల నశింపజేయుటకై వానితో యుద్ధము జేయుచూ జయించి దేహాన్ని శత్రువుల బారి పడకుండా రక్షిస్తాయి. జయించలేని యెడల నిస్సత్తువ జెంది యుద్ధాన్ని విర మించుకుంటాయి. అంత సమష్టి చైతన్యమున్నూ (మనస్సు) నిస్స త్తువ జెందుతుంది. జీవాణువులవలన అంతః కలహము నివారింప బడ దని, ఆ జీవాణువులకు కొంతశక్తిని (మందును) మనస్సు పంపుతుంది. అంత జీవాణువులు శక్తివంతములై పునః యుద్ధాని కారంభమై విరోధుల నశింపజేసి దేహమునుండి గెంటివేస్తాయి. దరిమిలా యుద్ధ బడలికను తీర్చుకుంటూ క్రమేపీ శక్తివంతములై, దేహాన్ని ఆరో గ్యంగా వుంచుతాయి. అంతమనస్సు వుత్సాహశక్తికలిగి యథా ప్రకారముగా ఆహారసంపాదనకై ప్రకృతి పోరాటానికి బయల్దేరుతుంది.

సూక్ష్మ జీవుల చైతన్యమే మనస్సుకానియెడల, కాలియందు గుండుసూది గ్రుచ్చినను మనస్సుకు తెలియబడకుండవలెను. అట్లు గాక గ్రుచ్చబడిన చోటగల జీవాణువులు బాధపడతాయి. మన స్సునన, బాధపడు జీవాణుచైతన్య ముండుటచే, తక్షణము మనస్సు

బాధపడి, యేమిటో చూడవలసినదని కన్ను కాజ్ఞాపించి, నివారించవలసినదిగా చేతుల కాజ్ఞాపించును. లేనియెడల కాళ్లుపోయినను చేతులు పోయినను మనస్సునకు తెలియబడక తక్షణమే దేహము నశించెడిది. కాన సమిష్టి జీవాణుచైతన్యమే మనస్సు, అహం, ఆత్మ, యని పిలుచుచున్నాము. ఈ మనస్సు యెల్లప్పుడూ సూక్ష్మజీవాణువుల కష్టాలను తొలగించి సక్రమమున నట్టిపెట్టుట, వీనికి వలయు ఆహారాలకై ప్రకృతితో పోరాడుట యను రెండు కార్యములు సంభవించినాయి. వీటికి మనస్సు నిరంతరము కష్టపడుతుంది.

సూక్ష్మజీవులు కార్యనిమగ్నులగుటవలన అలసట జెంది విశ్రాంతికోరి తమ కార్యాలనుండి విరమిస్తాయి. అన, తనకున్న చైతన్యాన్ని కోలుపోతాయి. వీనియొక్క సమిష్టిచైతన్యమైన మనస్సు వీనితోపాటు నశిస్తుంది. ఇదే సుషుప్తి (నిద్ర) ఈ సుషుప్తినుండి మనస్సు పునః కార్యోన్ముఖము కావలయునన్న జీవాణువులు కార్యోన్ముఖ మైననె.

జీవాణువులు క్రొత్తవానిని సృష్టించుచుతూ చనిపోతూ వుంటాయి. వీని ఆయుః పరిమితి పదివత్సరములు. క్రొత్తజీవాణువులు కార్యోన్ముఖముకాగా దేహము మార్పుచెందుతుంది. కాన పదిసంవత్సరముల కొకపర్యాయము గుర్తించలేనంత మార్పుజెందుతుంది.

దేహమందు క్రొత్తజీవాణువు లుద్భవించి క్రమేపీ దేహాన్ని వికాశింపజేస్తూ (యౌవ్వనము) విత్తనసారమును (Germ plasm) నభివృద్ధిపరచి స్త్రీ సంపర్కముద్వారా కొత్తసంచిని తయారుజేసుకుంటుంది. ఇట్లు క్రొత్తసంచీ తయారుజేసిన యనంతరము పాతసంచి యనవసరమయింది. క్రమేపీ విత్తనసారము క్షీణించి, సూక్ష్మజీవాణువులు తమ కార్యాలనుండి విరమించుకుంటాయి. అప్పుడు మనస్సు నశిస్తుంది. ఇదే మరణము.



క్రొత్త సంచీని సృష్టించుకొనుచూ, సంచితోపాటు విత్తన సారమును గొంపోబడుతూ, పునఃయోన్యనమున క్రొత్త సంచీని సృష్టించుకొనుచూ తరతరాలుగా యీ విత్తన సారం గొంపోబడుతూ వుంది. కాన దేహమన విత్తన సారమును గొంపోవు వాహకమని తెలుసుకున్నాము.

దేహమందు గల కోటానుకోట్ల సూక్ష్మజీవాణువుల సమష్టి చైతన్యమునే జీవుడని, మనసని, ఆత్మని, అహం అని అంటున్నాము కాన ప్రత్యేక అస్థిత్వము కలిగి జీవుడను వాడు లేడు.

అజ్ఞానావస్థయందు; జీవుడు ప్రత్యేక అస్థిత్వము కలిగి యుండుననియు, మరణించునపుడు బొందిని విడచి, మరొక బొందిని ప్రవేశించుననియు మున్నగు ననేక నూహలపై నాధారపడి దేయ్యాలు, భూతాలు, నరకస్వర్గాలు, ముక్తిమోక్షాదులు, సృష్టించారు. ఈవూహాలకన్నిటికి కారణము జీవుడంటే యేమిటో తెలిసికొనలేక, ప్రత్యేక అస్థిత్వము కలిగినవాడు జీవుడని. దేహాన్ని జీవుడన్ని వేరుపరచారు. అందుపై అనేక అజ్ఞాన సిద్ధాంతములు సృష్టించారు.

జీవుడన ప్రత్యేక అస్థిత్వములేక, సూక్ష్మజీవాణువుల సమష్టి చైతన్యమేగాన, జీవాణువులు నశించిన వాని సమష్టి చైతన్యమును నశించును. కాన ఆధ్యాత్మిక వేత్తలు, జీవుడన ప్రత్యేక ఆస్థిత్వముకలిగి అనేక యోనులందు పుట్టునని భావించి పునర్జన్మ రహితమునకై ప్రయత్నించుట యవివేకము, నిరుపయోగము.

జీవాణువులు తమ చైతన్యాన్ని కోలుపోగా, సమష్టిచైతన్యము (జీవుడు) నశించును గాన; సమష్టి చైతన్యమునకు (జీవునకు) ప్రత్యేక అస్థిత్వములేక, జీవాణుచైతన్య అస్థిత్వముపై నాధారపడినది గాన, సమష్టి చైతన్యమున కాధారభూతము జీవాణుచైతన్యము.

ఈ జీవాణువులు దేహమందు కోటానుకోట్లు గలవు.

ఎవరికి? ముక్తి?? మోక్షము???

ఈ జీవాణువులే అసంఖ్యాక జీవాణువుల సృ - ప్రివారుగా

ఎవరికి ? ముక్తి ?? మోక్షము ??? గునా?

ఈ జీవాణువులే పదివత్సరములకు మరణిస్తా

ఎవరికి ? ముక్తి ?? మోక్షము ???

జీవుడనువానికి ప్రత్యేక అస్థిత్వము గలదని సృష్టింపబడిన దయ్యాలు, భూతాలు, పరలోకాలు, పునర్జన్మ, ముక్తి మోక్షాదులన్నియు అజ్ఞానజన్య సిద్ధాంతములు గాన వానిని విశ్వసించుట, వానికై ప్రయత్నించుట నిష్ప్రయోజనము! అజ్ఞానము!! నిరుపయోగము!!!

జీవాణువులు నశించునపుడు, సమష్టి చైతన్యమైన జీవుడు, జీవాణువులతోపాటు నశించును ఈ జీవాణువులు నశింపక పూర్వమే విత్తనసారమును క్రొత్తసంచియందు ప్రవేశింపజెట్టబడినది గాన, ప్రాతసంచి అనవసరమై నశిస్తుంది. ప్రాతజీవాణువులతో విత్తన సారమునకే మీ సంబంధము లేదు క్రొత్తసంచీ క్రొత్తజీవాణువులు, సృష్టిప్రవాహమున కొట్టుకు పోతున్నాయి. నశించినవి పునఃజన్మింప వలసిన యావశ్యకత లేదు. కాన పాతసంచితోపాటు పాతజీవుడు నశిస్తాడు. అదేసుషుప్తి! మరణము!! మోక్షము!!!

కాన మోక్షముకొరకు (పునర్జన్మ రహితము కొరకు) ప్రయత్నించుట వృథాప్రయాసయని, మరణించిన పిదప యందరును పునర్జన్మ రహితులగు చున్నారుగాన, ఆధ్యాత్మిక వేత్తలు యీప్రపంచాన్ని మిధ్యయని, స్వప్నసమానమని, యిహ సుఖాలు తుచ్ఛమనిరి. ప్రపంచసుఖాలకు దూరులై పొందునదేదో దానినే నందరు పొందు చున్నారుగాన, ఆధ్యాత్మిక వేత్తలు తమ అజ్ఞానమునకు స్వస్తిచెప్పి విజ్ఞానులై, సంఘాన్నిగుర్తించి, సంఘజీవులుగా జీవితయాత్ర జేయ వలసినదిగా తెలియ జెప్పండి.

జీవునకు ఆస్థిత్వము కల్పించి, జీవుడే నిత్యుడుగాన అనేక యోనులందు పుట్టుచు గిట్టుచున్నాడనియు ప్రపంచముమిధ్య, స్వప్న

సారమునని ఆధ్యాత్మిక వేత్తలు తలంచుచుండిరి. అనిత్యమైన జీవు సృష్టి నిత్యులునుగా, నిత్యమైన ప్రపంచమును అనిత్యముగా ఆధ్యాత్మిక వేత్తలు భావించుచుండిరి.

పదార్థమునకు వినాశనము లేదు. ఒకకోలను యందునీరువుండి కొంతకాలానికి లేకుండా పోతుంది. నీరునశించినదని సామరు లభిప్రాయ పడెదరు. కాని నీరు నశించదు వేడికి పరివర్తనజెంది "ఆవిరి" రూపంలో వుంటుంది. పునఃకొంతకాలానికి నీరవుతుంది. కాన పదార్థమునకు నాశనములేదు. ఏదైనా పదార్థము నహానమయిన నశించదు. అదేయింకొక రూపములో అస్థిత్వము కలిగేవుంటుంది. ఇది సైన్సుద్వారా రుజువుజేయ బడ్డవిషయము. కాన పదార్థమునకు నాశనము లేదని సిద్ధాంతమైనది.

ప్రపంచము (పదార్థము) నశించేదని, మిధ్యని, స్వప్నసమానమని భావించే ఆధ్యాత్మిక వేత్తలు యెంత విజ్ఞానులుగా భావించబడుచున్నారో అంతటి అజ్ఞానులుకాదా?

అస్థిత్వములేని జీవుని స్థిరముగా, అస్థిత్వమున్న ప్రపంచమును అస్థిరముగా భావించే ఆధ్యాత్మిక వేత్తల అజ్ఞానమును గుర్తించెదరని విశ్వసించెదను. కానవారి అజ్ఞానమును దూరముజేయుటకు ప్రయత్నించండి. అందుల కంగీకరించని యెడల వారికీ ప్రపంచములో స్థానములేదని ఖచ్చితముగా చెప్పండి.

## అస్పృశ్యత

### (అంటరాని తనము)

సంఘమున తోడిమానవులతోపాటు తనూ పుట్టి, తన దేహ ప్రకృతిగల తోడిమానవులు తనను అంటరానివానినిగా నీచుడిగా భావించు కెందులకో తెలుసుకుందాము.

అస్పృశ్యులారా! మీరెందుకు నీచముగ అంటరానివారుగా చూడబడుచున్నారు??? దీనికి కారణమేమైనా మీకు తెలియునా?

"మా తాత ముత్తాతలు అలాగే చూడబడుచున్నారు. మేము అలాగే చూడబడుచున్నాము. మాకంతకంటె నేమియు తెలియదు."

బ్రాహ్మణ పెద్దలారా? మిమ్ము పూజ్యులుగాను, మరొకరిని నీచముగా చూచుటకు, అంటరానివారినిగా భావించుటకు కారణమేమి?

"మా తాత ముత్తాతలు పూజింపబడిరి మేమును పూజింపబడుచుంటిమి. మాతాత ముత్తాతలు యెవరిని నీచముగా చూచారో వారినే మేము నీచముగా చూస్తున్నాము. అంతకుమినహా మాకేమియు తెలియదు."

పోనీ వీరు మాంసభక్షకులైన నీచముగా, అంటరానివారిగా సంఘమునుండి నిషేధింపబడిరా? యన్న! నాడు బ్రాహ్మణులే, విశేష మాంస భక్షకులుగాను, వీరు (హరిజనులు) నిరోధకులుగాను నుండిరి.

ఆర్యులు (బ్రాహ్మలు) వుత్తరధృవమునుండి, మధ్య ఆశియా మీదుగా, హిందూదేశము ప్రవేశించి, అంతకుపూర్వమున్న ద్రావిడుల జయించి పంజాబును స్వాధీన పరచుకొనిరి.

ద్రావిడులు పరాజితులై దక్షిణదేశమునకు ప్రవేశించిరి. దరిమిలా ఆర్య ద్రావిడ ఘోర సంగ్రామము జరిగినది. ఈ యుద్ధమునే ఆర్యులు భారతగాథగా వర్ణించిరి. ఈ యుద్ధమున ఆర్యులే జయించినందున ద్రావిడులు పుట్టకొకరు చెట్టుకొకరు విడిపోయిరి. సింహాళమున కొందరు, దక్షిణ హిందూదేశమున కొందరు నివశించుచుండిరి.

వీరిని యార్యులెట్లు జయించినది రామాయణగాథలో స్వల్పముగా వర్ణించిరి. రాముడు లేడు, సీతయు లేదు. నాటి ఆర్యుల జయమును కల్పిత నామములద్వారా వ్యక్తపరచుచుండిరి.

దక్షిణ దేశమున ద్రావిడుల కొందర లోబరచుకొని, మరికొందర వధించి, వారి సాయమున సింహళద్రావిడుల జయించి, యిందుకు సాయపడిన విభీషణుని సింహళమునకు రాజునుజేసి ఆర్యులు వుత్తర హిందూస్థానమే తెంచి తమ విజయచిహ్నముగా అశ్వమేధయాగము జేయ నిశ్చయించుకొనిరి.

సింహళ ద్రావిడులు విభీషణుని హత్యజేసి; తమ ద్రావిడ నాయకుల సంహరించిన, ద్రావిడులకు ఘోరవిపత్తు కలుగజేసిన, ఆ ద్రోహి, ఆ ఆర్యతొత్తు, ఆ ద్రావిడాధముని బరిమార్చుటకై రహస్యమున వుత్తర హిందూస్థానము ప్రవేశించిరి.

ఆరోజు ద్రావిడుల నందరిని జయించితిమని ఆర్యులు అశ్వమేధయాగము జేయుచూ, విశేష మద్యమును గ్రోలినవారై వొళ్ళు తెలియని పరిస్థితుల్లో తన్మయత్వము జెందుచుండిరి.

ఇదే యదనుగా ద్రావిడులు ఒక్కుమ్మడి దండెత్తి ఆర్యులపై బడి పగసాధింప బూనిరి. అంత ద్రావిడ నాయకుల సంహరించిన ఆ ద్రోహి, ఆ దుర్మార్గుని నొక్కవేటున తెగటార్చిరి. వారి కార్యము పూర్తియైనది. తక్షణమే సింహళమునకుపోవ ప్రయత్నించిరి గాని సాధ్యము కాలేదు ఏలన ద్రావిడు లెప్పుడు ఆర్యులపై బడిరో తత్ క్షణమే ఆర్యనాయకులు కొందరినిపంపి నావల ధ్వంసము చేయించిరి. అందువలన ద్రావిడులు పట్టుబడిరి.

ద్రావిడుల నందరను జయించితిమిగదా? మన సంతోషమున నిట్టి ఘట్టము సంప్రాప్తించినందున ఆర్యులు అప్రతిహత క్రోధోన్మత్తులై ద్రావిడనాయకుల చిత్రవధ జేసిరి.

ఆర్యులకు పట్టుబడక తప్పించుకు పోయినవారు ఆటవికులైరి. వీరే సిసలైన ద్రావిడులు. నేటివరకూ బ్రాహ్మణులకు లోబడక స్వతంత్రముననే జీవించుచున్నారు.

ఆర్యులకు దాసోహమన్న వారిని మన్నించి, అంటరాని వారుగా, నీచులుగా బ్రాహ్మలచే పరిగణింప పడుచూ, గ్రామ బాహ్యప్రదేశమున నివసించుచూ, బ్రాహ్మణ ఘోర యన్యాయ చట్టరీత్యా వ్యవహరించుచూ నీచాతి నీచముగ చూడబడుచూ నేటి కిని నట్లనే యుండిరి.

కాన అస్పృశ్యులన దేశసేవకులై దేశ స్వాతంత్ర్యమునకు ఆర్యులతో పోరాడిన దేశభక్తులని విదితమగుచున్నది. అట్టి ద్రావిడ దేశభక్తులు బ్రాహ్మలచే నీచాతి నీచముగ చూడబడు చుండిరి. ఇదియే అస్పృశ్యతా రహస్యము.

## సింహావలోక ప్రతీకారము

ఆర్యులు (బ్రాహ్మలు) అన్యాయమున ద్రావిడుల (బ్రాహ్మణే తరుల) చిత్రవధ జేశారు. నాస్తికుల నశింప జేశారు. నాస్తికత్వము నామరూపాదులు లేకుండా నిషేధించారు. బౌద్ధుల చిత్రవధ జేశారు. బౌద్ధగ్రంథాలయముల దహనము జేశారు. బౌద్ధకుమారముల నిర్మూ లించారు. బౌద్ధమతమును నశింపజేశారు. అభ్యుదయానికి పాటు పడుచూ, ప్రజల విజ్ఞానులజేయు ద్రావిడుల, నాస్తికుల, బౌద్ధుల సర్వ నాశనము జేశారు.

ప్రజలనుయజ్ఞాన రొంపియందే అట్టిపెట్టి, మూఢాభిప్రాయముల కలుగజేసి, మూఢాచారులజేసి, లేనిపరలోకాదుల, దేవుని విశ్వ శింపజేసి, క్రూరమృగములవలె ప్రజలను మృగదశకునెట్టి, బ్రాహ్మలు విద్యావంతులై, నాయకులై, దేవుళ్లవలె పూజింప బడుచున్నారు.

## మతము

మతమన నభిప్రాయము, అజ్ఞానావస్థయందు ప్రకృతిని తెలిసి కొనలేక, దేవుని నాధారమున ననేక సిద్ధాంత రాద్ధాంతముల సృష్టిం చుట. వారికున్న జ్ఞానముతో నట్టిసిద్ధాంతముల విశ్వశించిరి. ఎవరికి

తోచిన నభిప్రాయమును వారుచెప్పిరి. వారేమత కర్తలయిరి. ఈ మతకర్తలందరు దేవునిపై నాధారపడినను, ఆ దేవునకే వివిధనామము లుంచిరి.

ఆ దేవుడే ప్రపంచమును సృష్టించి నడపువాడుగాన; మనకష్టములు దూరము కావలయునన్న నాతనినే ప్రార్థింప వలయునని దేవునిగూర్చి అనేక యసభ్యతా ప్రార్థనలు జేయమొదలిడిరి. దేవుడనువాడొక డుండిన వీరుప్రార్థనలు చేయనక్కర లేకనే, మానవుల కొరకే యింతప్రకృతిని సృష్టించినవాడు కష్టములు లేకుండగనే జీవించుటకు ప్రకృతిని మార్చియుండెడివాడు. అట్టిదేమియు గాన్పింపనందున దేవునిగూర్చి ప్రార్థించుట యవివేకముకాదా? అజ్ఞానము కాదా?? అబలత్వము కాదా???

ఇట్లు దేవుడేమన కష్టాలు దూరముజేసి సుఖపెట్టునని, భారమంతయు దేవునిపైవేచి, చేతులు నలుపుకుంటూ, దేవునిదయకొరకు యెదురుచూచుట మనయభ్యుదయాన్ని మనచేతులారా మనమే ఖూనీ జేసుకోవట మవుతుంది.

కోటానుకోట్లు ప్రజలు నిరంతము దేవునిప్రార్థించు చున్నారే! ఏనాడైనా, ఒక్కనికైనా, స్వప్నమందైనా కనుపించెనా, కనుపించుటకు సాకారుడు కావలయునుగదా? సాకారుడైన పుట్టుట గిట్టుట మున్నగు దేహధర్మముల ననుభవింపవలయునుగదా? ఐన ఈ సాకారుని సృష్టించినదెవరు? ఇతనికి శుభము కలుగజేయువాడెవ్వడు, ఇతడెవ్వరిని ప్రార్థించును.

కాన దేవుడు సాకారుడుకాడు. మరి నిరాకారుడందుమా? నిరాకారుడు వినడు, చూడడు, మాట్లాడడు, కర్తవ్యరహితుడు. నిరాకారునిగూర్చియేనా మీరు ప్రార్థించునది? కానియెడల ఎవ్వరిగూర్చి ప్రార్థించుచుంటిరి, ఆ విషయము మీకే తెలియదా.

దేవుడనువాడు "ఇట్టిది నాస్వరూపము, ఫలానా లోకమున గలను. మీకు కష్టములుగలిగిన నన్ను ప్రార్థించుడి, తక్షణమే మీకష్టముల దూరముజేసెదననిన" ఆ స్తికులందరు దేవునిగూర్చి ప్రార్థించుచుంటిరా? లేక, యే మతకర్తయైన "దేవుడిట్టివాడు"ని జెప్పిన ప్రార్థించుచుంటిరా లేక, యే ఛాందసులో "దేవుడు, దేవుడని"న వారితోపాటు మీరు దేవుని ప్రార్థించుచుండిరా?

అజ్ఞానావస్థయందు ప్రకృతి యవగాహన శక్తిలేనందున ప్రకృతి శక్తికంటె అతీతమైన శక్తియేదో యాకాశమునవుండి, ప్రకృతిని సృష్టించి నడపుచున్నదని భ్రమించిరి. ఈ అతీతశక్తినే దేవుడని పిలువ సాగిరి

నేడు మనము భౌతిక జ్ఞానాభివృద్ధిచే ప్రకృతిని తెలుసుకు న్నాము ఈ ప్రకృతి దానంతటదే సృష్టియయినదని, దానంతటదే క్రమబద్ధమున నడచుచున్నదని తెలుసుకున్నాము.

అజ్ఞానజనిత మతసిద్ధాంతరీత్యా ప్రకృతిని దేవుడు సృష్టించ లేదనియు, ప్రకృతిని నడుపుటలేదనియు తెలిసికొన్నాము. కాన మన కష్టాలను మనమె దూరముజేసుకొనవలయునుగాని, దేవుని ప్రార్థించుచూ నిష్క్రియులమై కూర్చుండుట, "కష్టాలను ప్రసాదింపు"మని ప్రార్థించుటేయగును.

ఈ రహస్యము క్రైస్తవ మతస్థులు గ్రహించారు. తమ కష్టాలను నశింపజేయుటకై దేవునిపై నాధారపడక, అనేక యంత్రముల కనిపెట్టి, ఈ కష్టాలను సమూలముగ నశింపజేసుకొనిరి.

క్రైస్తవు లెవ్వరూ మతసిద్ధాంతముల విశ్వసింపరు. కాని క్రైస్తవులమేయంటూ, వారి క్రైస్తవమత జన్మాభాను నభివృద్ధి పరచుకొనుచుండిరి. ఇవ్విధమున వీరు మతమును మోక్షముకొరకుగాక, రాజకీయమునకే వుపయోగించుకొనుచుండిరి. మతవిషయము లనవస రము. అజ్ఞానావస్థయందు జన్మించిన మతసిద్ధాంతాలు, అజ్ఞానాంత

మందే, అజ్ఞానమందే నశించినవిగాన, విజ్ఞానులైన పాశ్చాత్యులు అజ్ఞానజన్య మతసిద్ధాంతముల విశ్వశించెదరా ?

మహమ్మదీయులకు మతమన్న అంధవిశ్వాసము మెండు. మత యుద్ధములందు ప్రాణములర్పించిన వీరస్వర్గములభించునని వీరి విశ్వాసము. వీరు భౌతికవిజ్ఞానానికి దూరులై అల్లాను ప్రార్థించుటతోనే దినమంతయు సరిపెట్టుకొందురు. వీరిది ఏకేశ్వరోపాసన

క్రైస్తవులు, మహమ్మదీయులు మతాభివృద్ధిజేయుచూ, తమ బలము నభివృద్ధిపరచుకొనుచుండిరి. వీరి మతమును స్వీకరించినవారిని సమితమున గౌరవించి వారి యభ్యుదయమునకు పూర్తిగా సహాయ పడెదరు. ఒక్క బ్రాహ్మణ (భారతీయ) మతమందు మినహా, నన్ని మతములందును "సమానత్వము—సోదరత్వము — సౌభ్రాతృత్వము" కలవు.

ప్రపంచములోనున్న యన్యాయమంతయు ఒక్క బ్రాహ్మణ (ఆస్తిక) మతమందే కలదు వీరి మతస్థుల గౌరవింపరు. అభ్యుదయానికి పాటుపడరు నమ్మికొలచువారిని నీచాతి నీచముగా భావించి. దేవుళ్ళవలె పూజింపబడుచూ, తమ మతస్థులనుండి అన్యాయముగా ధనసంగ్రణజేయుచూ సోమరులై బ్రతుకువారు.

రాయియే దేవుడని పూజింపజేయుట యే మతమందైనా కలదా? వీరు నిర్వికారమే దేవుడని భావించి, ప్రజలకు తెలియజెప్పకుండా అజ్ఞానావస్థయందె అట్టిపెట్టి రాతివిగ్రహమే దేవుడని విశ్వజింపజేసి, దేవుని పేరిట, అమాయకులనుండి ధనసంగ్రహణజేయుచూ సోమరులైన సనాతనులకు నేడు శిక్షయేమి ?

మత(బ్రాహ్మ)మనునది మానవాభ్యుదయమును ఖూనీజేయునది. అజ్ఞాన ప్రభావమున మానవులను మానవత్వమునుండి పశుత్వమునకు గొంపోవునది మతము.

నేటి భౌతికవిజ్ఞానము మనమేనాడో కలిగియుండవలసినది. నేడు అత్యుత్తమ నాగరికత యనుభవించెడివారము. అటువంటి యభ్యుదయాన్ని; (ఆస్తిక) మతమే ఖూనీజేసింది. నేటికిని జేస్తూవుంది.

అభ్యుదయానికి పాటుపడిన నాస్తికత్వము ఆస్తికమతముచే ఖూనీజేయబడింది. అభ్యుదయానికి పాటుపడిన బౌద్ధమతము ఆస్తిక మతముచే ఖూనీజేయబడింది. అభ్యుదయానికి పాటుపడిన నాస్తికుల, బౌద్ధుల, ఖూనీజేశారు స్వార్థపరులైన ఆస్తికులు. అభ్యుదయానికి పాటుపడే సంఘసంస్కర్తలపై దాడిసలిపారు. కాన హిందూ దేశాభ్యుదయము అస్తికమతముచే ఖూనీజేయ బడింది.

ఒక సుప్రసిద్ధ రచయిత థామస్ పైన్ (1737—1800) "హేతుయుగము," (The Age of Reason) గ్రంథమును (ఇందు బైబిలు సిద్ధాంతముల సత్యములని నిరూపించి) వ్రాసినందునకు దేశాంతర వాస శిక్ష యనుభవించవలసి వచ్చెను.

బైబిలు సిద్ధాంతమునకు వ్యతిరిక్తముగ సూర్యునిచుట్టూ, భూమియే తిరుగుచున్నదని చెప్పిన కోపర్నికస్ శాస్త్రజ్ఞుని నానా హింసలు పెట్టిరి.

అజ్ఞానావృతమై, అజ్ఞానమందే విహరించుమతము విజ్ఞానమును సహించునా! విజ్ఞానమును ఖూనీజేయుటయే తనలక్ష్యము. తనప్రభావమే, తన యధికారమే, సుస్థిరంగా, మితంగా, స్థాపించుకోవటానికి యెంతపనైనా జేస్తుంది.

సంస్కరణకోరు అనేక లక్షల ప్రొటెస్టెంటులను 1572 న ఫ్రాన్సులో చిత్రవధ జేసింది మతము.

అనేక యుద్ధాలు జేయించి శాంతిలేకుండా జేసింది మతమే. ఆ ప్రపంచములో జరిగిన యుద్ధాలన్నీ మతమే జేయించింది.

ప్రజలందు సుహృద్భావము నశింపజేసి పరస్పర శత్రువులుగా యొనర్చి ప్రజాయుద్ధాలు జేయించింది, అనేక వేల హిందూ, మహమ్మదీయుల చిత్రవధజేసింది మతమే. హిందూదేశాన్ని రెండు తునకలు జేసింది మతమే. ఒక దేశమున నివశించువారిని నైకమత్య విహీనులుగా జేసింది మతమే. పరస్పర ద్వేషాన్ని రగుల్కొల్పింది మతమే. హిందువులచేత "మ్లేచ్ఛుడని" పిస్తుంది మతము. మహమ్మదీయులచేత "కాఫిర్" యని పిలిపిస్తుంది మతము. క్రైస్తవులచేత "హిధెన్సు"లని పిలిపిస్తుంది.

అఖండ హిందూదేశ నివాసులారా? మతమువలన అభ్యుదయానికి సమీపులగుచున్నామో? దూరులగుచున్నామో? యిక, మీకున్న విజ్ఞానాన్ని వుపయోగించి ఆలోచించండి. మీకే సత్యము బోధపడుతుంది.

ప్రపంచము నేడు యెంతటి వున్నతస్థితిలోవున్నదో గమనించాము. హిందూమహమ్మదీయులు వ్యర్థకలహములతో ప్రయాసపడుచూ, ప్రపంచవిజ్ఞానానికి దూరులై, పాశ్చాత్త్యుల విజ్ఞానభిక్షకొరకెదురుచూచుట అజ్ఞానులమైననేగదా? ఇకనైనా అజ్ఞానము గుర్తించాలి.

హిందూదేశమున నాది యందు ద్రావిడులను వారు నివశించుండిరి. ఆర్యులు (బ్రాహ్మలు) వుత్తర ధృవమునుండి యిటకే ద్రావిడుల జయించి, బ్రాహ్మణ (ఆస్తిక) మతము ద్రావిడుల రుద్దారు. కొంత కాలమునకు మహమ్మదీయుల రాకవలన బ్రాహ్మణ్యాన్ని సహించలేక కొందరు ద్రావిడులు మహమ్మదీయ మతా స్వీకరించారు. మరి కొందరు బలాత్కారమున స్వీకరింపబ ఇవ్విధమున అనేకులు మహమ్మదీయ మతాన్ని స్వీకరించా బ్రాహ్మణ దాస్యాన్నుండి బయట పడిన యీ ద్రావిడులే య వంతును, నేడు యిండియాలో నివశించు మహమ్మదీయులు మ

దీయ మతాన్ని స్వీకరించిన ద్రావిడ సంతతియె. బ్రాహ్మణులు మినహా హిందువులని పిలువబడేవారు అజ్ఞానులు, అసమర్థులు, దద్దమ్మలునై బ్రాహ్మణ దాస్యాన్నే యనుభవించుచూ, నేటికిని, నాలాగేయున్నందున ద్రావిడ సంతతియై హిందువులన బరగుచుండిరి.

ఉత్తర ధృవమునుండి వచ్చిన బ్రాహ్మణుల మతాన్ని మేము, అరేబియానుంచి వచ్చిన మహమ్మదీయ మతాన్నిమీరు స్వీకరించి మనమే (ద్రావిడులమే) హిందూ మహమ్మదీయులమైతిమి. అట్టి మనము పరస్పర శత్రుత్వము కలిగి బ్రాహ్మణ పక్షముమేము, ముసల్మాను పక్షము మీరు వహించి మనలను మనమే ఖూనీ జేసుకుంటున్నాము. ఇంతకంటె విషాదకరమేమైనా గలదా! వినరాని వార్త! చూడరాని దృశ్యము !! సహింపరాని విషయము ! ! !

బ్రాహ్మణులు సురక్షితముననే యున్నారు. మహమ్మదీయ మతకర్తలు సురక్షితముననే యున్నారు. మధ్య మనము (ద్రావిడులము) సర్వవిధాలా సర్వనాశనము జెందుచున్నాము.

ఇకనైనా కళ్లు తెరవండి. బ్రాహ్మణులతోగాని బ్రాహ్మణ (హిందూ) మతముతోగాని మాకు యేవిధమైన సంబంధము లేదని ప్రమాణము జేస్తున్నాము, ఆలాగే మహమ్మదీయ మతాన్ని స్వీకరించిన ద్రావిడులును మహమ్మదీయ మతానికి రాజీనామాయిచ్చి, పరస్పరము ఒండొరుల కౌగలించుకొని, "మనమంతా ద్రావిడులము సోదరా"! యని మనయజ్ఞానాన్ని పశ్చాత్తాప హృదయులమై తక్షణ కర్తవ్య మూహింపవలయును. మనమిక యేమాత్రము యాలసించినా ప్రపంచ విజ్ఞానానికి దూరులమై ఒకరి దయకొరకు యెదురుచూడాలి. సర్వక్షణకొరకు మరొకరి యండ జేరాలి.

గతచరిత్రను మరొక్కసారి స్మరించండి. మనమంతా ద్రావిడులము. మహంజారో, హరప్ప నాగరికత మనది. బౌద్ధనాగరికత మనది.

పాశ్చాత్యులు అజ్ఞానావస్థలో నుండగనే మనము ప్రథమ విప్లవకారకులమై నాగరికతను ప్రపంచమున ప్రవేశపెట్టితిమి. అట్టి మనము బ్రాహ్మణ జాతివలన సహింపరాని కష్టములకులోనై సంపూర్ణ యజ్ఞానులమై బ్రాహ్మణ దాస్యానికి బలియై పసువులవలె చూడబడుచున్నాము.

హిందూ మహమ్మదీయులు, ద్రావిడ సంతతియె!
హిందూ మహమ్మదీయులు, సోదరులే!!
హిందూ మహమ్మదీయులు, ఏకగర్భజనితులే!!!
హిందూ మహమ్మదీయులు, ఏక్ హాః!
మనదేశము విప్లవదేశము.
మన మతము విప్లవమతము.
మనజాతి విప్లవజాతి.
మన రాజకీయము విప్లవము.
మనము విప్లవసందేశ ప్రచారకులము.

# విప్లవము

## ప్రభుత్వము

ఆదియందు మానవులు గుంపులుగా నివశించెడివారు. ఈ గుంపులో నెవరికైనా విరోధము కలిగి కలహించుకొనుచున్న, బలవంతుడు పెద్దమనిషియైన న్యాయవంతుడు వారి కలహ కారణము నివారించి "యిలా" నడచుకోవాలని చెప్పేవాడు. అలాపదిమంది చేత పెద్దమనిషి యనిపించుకొని గుంపుకునాయకత్వము వహించేవాడు.

ఈగుంపుమరొక గుంపును జయించిన నాగుంపుకూ నితడే నాయకత్వము వహించి పాలించెడివాడు.

దరిమిలా గుంపులు స్థిరనివాస మేర్పరుచుకొని గ్రామములు నిర్మించి వివాహ పద్ధతులచే కుటుంబము లేర్పడి స్వార్థులై కుటుంబ

పరముగా ఆస్థికలిగియుండాలని భావించారు. ఏకుటుంబము యెంత ప్రదేశము (స్థలము)ను వ్యవసాయము జేసుకొనునో అంతప్రదేశము ఆకుటుంబానికి సర్వహక్కులు కలిగియుంటుంది. వ్యవసాయము జేయక వున్న బంజరు భూములు నాయకుని అధికారము క్రిందవుండేవి. ఎవరికైనా యివ్వాలన్నా నాయకుడే అధికారి. ఈవిధంగా కొంత కాలానికి హక్కులు స్థిరపడిన పిదప అధికప్రదేశము (భూమి) కావలసినవారు నాయకునివద్ద కొనుక్కునేవారు.

గ్రామాలు, తాలుకాలు, జిల్లాలు, రాష్ట్రాలు యేర్పడినాయి. వీనికన్నింటికి నాయకుడే అధిపతి. ఇతనినే రాజన్నారు ఇతడు స్వార్థానికి గురియై "రాజు పాలించున దంతయు రాజుహక్కే" అన్నాడు. ఇతని యనంతరము రాజ్యము రాజకుమారులకే జెంద నలసి వచ్చినది. రాజ్యమంతా రాజులదేగాన ప్రజలు పండించుకునే భూమిలో శిస్తుచెల్లించాలి. రాజ్యమంతా రాజుదేగాన ప్రజలునివ శించే గృహములకు పన్నుకట్టాలి.

గతము అజ్ఞాన యుగమగుటచేత ప్రజలు అజ్ఞాన ప్రభావము నకుగురియైన రాయిరప్ప దేవుడని, చెట్టుపుట్ట దేవుడని, తమశక్తికి మించిన శక్తులకన్నిటిని దేవుడేయని ప్రార్థించు చుండిరి.

ఇట్టి సమయమున బుద్ధుడు జన్మించి నాస్తికత్వమును, క్రీస్తు, మహమ్మదు మున్నగువారు యేకేశ్వరోపాసనను బోధించి, కొంత యజ్ఞానమును నశింపజేసి ప్రజలెలా నడచుకోవలసినది బోధించారు. ఇవే మతములైనవి. బౌద్ధమతమును బ్రాహ్మణులు నాశనముజేసి ఆస్తికమతాన్ని పునఃస్థాపించి రాయిరప్ప దేవుడని ప్రచారము జేసి మతకర్తలయ్యారు.

ప్రజలందు చైతన్యము లేకుండా జేయుటకు, విప్లవశక్తిని నశింపజేయుటకు రాజు, మతకర్తలు యైక్యతజెంది తమయధికారా లను సుస్థిరము జేసుకున్నారు. పన్నుల రూపేణ రాజు, ప్రజలనుండి ధనసంగ్రహణ జేయుచుండెను. మతకర్తలు దేవునిపేరిట ప్రజలనుండి

ధన సంగ్రహణ జేయుచుండిరి. ఇలా ప్రజలధన, విజ్ఞాన, చైతన్యముల నశింపజేసి రాజు మతకర్తలు నిరాటంకముగా స్వేచ్ఛగా పరిపాలింప సాగారు.

కాని రాజునకు, మతకర్తలకు అభిప్రాయ భేదములు రాదొడగినవి. పరిపాలనా విధానమున తానుజెప్పునట్లుగా రాజునడచుకోవాలని మతకర్త ఖచ్చితముగా చెప్పాడు. అంతరాజు మతకర్తను నిషేధించి తానే స్వయంగా పరిపాలించుకోసాగాడు.

ఈ మతకర్తలు పుట్టకొక్కులవలె గ్రామానికొకరు వెలశారు. బోధలరూపేణ ప్రజలనుండి ధనసంగ్రహణజేయుచూ సోమరులై అవినీతిపరులై జీవింపసాగారు.

ఇలా కాలప్రవాహము పోతూవుండగా విజ్ఞాన పురుషులు జన్మించి, మతకర్తలు జెప్పు సిద్ధాంతములన్నియు నసత్యములనియు, బూటకములనియు చాటి, మతాన్ని నశింపజేయసాగారు. ప్రజలు విప్లవ సందేశముద్వారా చైతన్యవంతులై సత్యము తెలుసుకో నారంభించారు. భౌతిక పరిశోధకులు ప్రకృతి రహస్యాన్ని తెలుసుకున్నారు. సత్యము ప్రచారము జేశారు. మూఢాభిప్రాయములు, మూఢాచారములు చెప్పకుండా పోయినాయి. కాని మతకర్తలు సహించలేక సత్యము ప్రచారము జేయు అనేక లక్షలమందిని నానాహింసలు పెట్టారు, చిత్రవధలు జేశారు.

ఇట్టి సంఘర్షణచే ప్రజలు సత్యము తెలుసుకున్నారు, రాజకీయముగా కూడా విప్లవబీజీలు కలిగాయి. తద్వారా ప్రజలు సుఖంగా జీవించాలని, మేము మనుజులమేనని, మాకు హక్కులుండాలని విప్లవ పూరితులై, నిరంకుశ ప్రభుత్వాలను నిర్మూలించటానికి ప్రయత్నించారు. స్వార్థపరుడైన రాజు, కోటాను కోట్ల ప్రజలను బలిగొన్నాడు. ఇప్పటికి సత్య, న్యాయ, ధర్మములు నశిస్తవా ?

ధనవంతుల చేతిలో కీలుబొమ్మయినరాజు, ధనవంతుల యాస్తి పాస్తుల రక్షించుటే, పరిపాలనమను తత్వమునుండె. అట్టిరాజుకు సుస్థిరాధికార మొసంగ ధనవంతులు ప్రయత్నించుచుండిరి. ఇవ్విధమున ధనికులే యీ ప్రపంచమును గుత్తకు తీసుకున్నట్లు, ధనహీనులు మనుజులు గారని, తమ సుఖముకొరకు జన్మించిన బానిసలని, ధనమద గర్వాంధులై కన్ను మిన్నుగానక అవినీతి, అన్యాయ, హింసాపరవశులై ప్రవర్తించుచుండిరి.

కార్మికుల యంత్రములవలె భావించుచూ వారియందు మానవత్వాన్ని గుర్తించక ధనమదాంధులై గడ్డిపోచవలె జూచుచుండిరి.

కార్మికులు 20 గంటలు కండలు కరిగించి, చెమటోడ్చి, కష్టపడినను, ధనవంతులు నిర్దయులై వారి యిష్టమువచ్చినంత కూలిచ్చెదరు. తమ కష్ట ఫలితమునకు తమరిచ్చు కూలి చాలుట లేదనియు, పస్తుపరుంటిమనియు, శ్రమజేయుటకు తగినంత యాహారము జాలక నిస్సత్తువజెంది రోగాదులు సంభవించి, అనారోగ్యవంతులై, అనేక కష్టనష్టములకు గురియై మరణించుచున్నామని ప్రార్థించినను కనాయిలైన ధనవంతులు "నీవు మమ్ముల ధిక్కరించి యడిగెదవా"? యని అధికార ధన గర్వములచే బెదరించి అవసరమయిన కాల్చివేశి కార్మికులు కష్టపడగా వచ్చినలాభమంతయు సంగ్రహించెడివారు.

కర్షకులను నిట్లనే భూస్వాములు వారి శ్రమను దోచుకొని ధనవంతులై, ధనహీనుల పశులవలె చూచుచూ పాలించుచుండిరి. ఒక భూస్వామికి వెయ్యి వేయి యకరములున్నదని భావించిన అందువచ్చు రాబడి యతనికే జెందవలెనను రాజాధికారముండుటచే, కర్షకులు నిరంతరము ఎండనక, వాననక, రాయనక, రప్పనక కష్టించి పండించిన ఫలితము భూస్వామిపాదములకడ నుంచవలెను. నిరంతరము కష్టించి పండించిన కర్షకులకు తమ కష్టమునకైనా కూలిగిట్టదు.

ఇవ్విధమున ధనవంతులు, ధనహీనుల పశువులవలె వినియో గించుకొనుచుండిరి. ఇట్టి సమయమున న్యాయముకొరకు ప్రాణము లర్పించు "షహీద్" లుద్భవించి అన్యాయమును పూర్తిగా ప్రతి ఘటించి న్యాయమును స్థాపించిరి.

ఇట్టి షహీదులలో "కారల్ మార్క్స్" వొకడు. ఇతడు గొప్ప రాజకీయవేత్తయై, ప్రపంచానికి వెలుగునిచ్చి, అజ్ఞానాన్ని అన్యాయాన్ని భస్మీపటలమొనరించి, ప్రజల కఖండ సేవజేసిన ప్రజాసేవ కుడు. ఇట్టి మహనీయులద్వారా ప్రజలు విప్లవపూరితులై సత్యము గ్రహించి "కర్మ, విధి"ని కాలదన్ని ప్రజాస్వామిక పాలనకుపునాదులు వేశారు.

ధనవంతులు తేరిపారజూచి విప్లవాన్ని నశింపజేయటానికై కొంత న్యాయమును, కొన్ని హక్కులను నిచ్చారు. దీనితో ప్రజలు విజ్ఞానులై సంపూర్ణ న్యాయముకలగాలని ధనికప్రభుత్వాలను నిర్మూలించ నారంభించారు. రష్యాయందు జరిగిన విప్లవమిట్టిదె. అంత ధనిక ప్రభుత్వము సమూలమున నశించినది. "ప్రజలను పాలించుటకు ప్రజలకే హక్కు" అను నినాదములతో ప్రజాస్వామికమును స్థాపించారు. అభ్యుదయానికై కృషిజేసే రాజకీయవేత్తలను ప్రజలు యెన్నుకొనుచుండిరి.

ఇట్లు ప్రజలచే యెన్నుకొనబడిన నాయకులు నిరంకుశ ప్రముఖస్వామ్యాన్ని సుస్థిరము జేశారు.

ప్రజలు తమ సుఖముకొరకు న్యాయముకొరకు రాజు నధిష్ఠింజేయ స్వార్థపరుడై ప్రజల నధోగతిపాలు జేశాడు. కర్మ, విధియు మతాధిపతులు రాజులు యైక్యమై తమ యధికారాలను సుస్థిరము జేసుకొని పాలింపసాగారు.

పెతకర్తలు నశించి వారిస్థానే ప్రముఖస్వామ్యులు బయలు దేరి, రాజు, వీరు దైక్యమై రాజుకున్న సమస్తహక్కులు ప్రముఖ స్వామ్యులే హస్తగతము జేసుకున్నారు. ఇట్లు రాజస్వామ్యము అంత రించింది. ఇది ప్రపంచమునకు శుభచిహ్నము.

దరిమిలా ప్రముఖస్వామ్యులు ప్రజాస్వామికమను పేర తమ యధికారాలను సుస్థిరము జేసుకొని ప్రజలందు విప్లవశక్తిని నశింప జేసి తమ స్వార్థమే పరమార్థముగా, తమ యధికార గౌరవమే సభ్య తగా భావించి దేశాభ్యుదయాన్ని ఖూనీజేస్తున్నారు.

ఈ ప్రముఖస్వామ్యులు ప్రజలచే యెన్నుకొనబడినను వున్న తాధికారమున ధనసంతులు కావచ్చు. అవివేకులు కావచ్చు. సనా తన *ఛాందసులు కావచ్చు. అంతమాత్రమున దేశాభ్యుదయము ఖూనీజేయబడవలసిందేనా ? ఇదేనా ప్రజాస్వామికము!!!

ప్రపంచ ప్రభుత్వములన్నిటియందు రష్యాప్రభుత్వము అగ్ర స్థానాన్ని వహించినది గాన, తదితర ప్రభుత్వములన్నియు యేనాటి కైనా నశించి రష్యాప్రభుత్వమందు లీనమవునవియే గాన, వీనితో మనకు సంబంధములేదు. రష్యాప్రభుత్వము యెంతవరకూ సఫలత జెందినదో విచారింతము.

రష్యా కమ్యూనిజానికి పూర్వము జారుపాలనమందుండెడిది. ఈ జారుపాలనయందు ప్రజలు తినటానికి తిండిలేక, కట్టుబట్టలేక, వుండయిల్లులేక, నానాకష్టములను భరించుచుండిరి.

1. ప్రాచీన ఆచారవ్యవహారములే భవిష్యత్తంతయు నుండవలెనని యభిలషించు వారు సనాతనులు. ఈ సనాతనత్వమును సంస్కరింప వలయుననువారు మితవాదులు.

ప్రస్తుత (వున్న) వ్యవస్థను సంస్కరింపవలెననువారు అతివాదులు.

ప్రస్తుత (వున్న) వ్యవస్థను సంపూర్ణముగా నశింపజేసి నూతన్న వ్యవస్థను కోరు వారు తీవ్రవాదులు.

ఇట్టి సమయమున కమ్యూనిష్టులు విప్లవసిద్ధాంతముల ప్రచారము జేసి, ప్రజలందు చైతన్యశక్తి కలుగజేసి ప్రభుత్వాన్ని యెదుర్కొన్నారు. జారుప్రభుత్వాన్ని కూలద్రోశారు. కమ్యూనిజాన్ని సాధించారు. జారు సండజేసుకొన్న ధనవంతుల కూలద్రోశారు. భారీవ్యవస్థలను ప్రభుత్వమే స్వాధీనపరచుకుంది. పనికాలము తగ్గించి జీతము హెచ్చించి కార్మికులకు అఖండసేవ జేశింది. సమష్టి వ్యవసాయముద్వారా కర్షకులకు సంపూర్ణన్యాయము కలుగజేశారు. వేయేల అందరిని సమానదృష్టితో జూచుచు అందరికి న్యాయము కలుగజేసినదనియే చెప్పవచ్చును.

ఈ విధంగా శరవేగముతో అభ్యుదయము జెందిన కమ్యూనిజం అధికారము సుస్థిరముకాగా, నిరంకుశ ప్రభుత్వమై వ్యక్తి స్వాతంత్ర్యాన్ని నశింపజేసింది. వాక్, సభా, పత్రికా స్వాతంత్ర్య రహితము. ఏవ్యక్తి యయినా వింతకంటె యభ్యుదయ మార్గాన్ని సూచించినను దండనార్హుడే. ఈ నిరంకుశమువలననే కమ్యూనిజం అంటె ప్రపంచానికి యేహ్యాభావము కలిగింది.

"జారుప్రభుత్వ నిరంకుశాధికారము నశించాలని, నూత్న వ్యవస్థకావాలని కమ్యూనిష్టులు జారుప్రభుత్వాన్ని కూలద్రోశారు. ఆ కమ్యూనిష్టులే నేడు నూత్న వ్యవస్థను (అభ్యుదయాన్ని) ఖూనీ జేస్తూ నిరంకుశులై, యీ ప్రపంచముండునంతవరకూ కమ్యూనిజం యధికారమే వుండాలనుకుంటే, వీరు, జారుప్రభుత్వాన్ని కూలద్రోయ నక్కరలేదు. అసలు ఆస్కారమే లేదు. ఈ విషయము కమ్యూనిష్టులు గుర్తించి వ్యక్తిస్వాతంత్ర్యమిచ్చి వాక్, సభా, పత్రికా స్వాతంత్ర్యము లొసంగిన ప్రపంచ ప్రభుత్వములకు మార్గదర్శియై అగ్రస్థానాన్ని పొంది, చారిత్రకంగా కీర్తిపొందుతుంది. రష్యాకు మంచి భవిష్యత్తువుంది.

వ్యక్తిపరమున ఆస్తియుండినందున ననేక యనర్థములు సంభవించు చున్నవి. వ్యక్తిపరమున యాస్తిలేనందున ననేక యనర్థములు

సంభవించుచున్నవి. కాన వ్యక్తిపరమున యాస్తి వుండరాదు. వుండవలెను. ఈ వ్యతిరిక్త వ్యవస్తనుండి రక్షింప బడవలయునన్న యాస్తి యంతయు సంఘపరము జేయవలయును అట్లు జేసిన వ్యక్తిపరమున నాస్తిలేదు. వ్యక్తి యాస్తిలేదని యవినీతికి గురికానవసరము లేదు. కాన యాస్తి సంఘపరముజేసిన యవినీతి సమూలముగ నిర్మూలింపబడుతుంది. ప్రజల నైతిక జీవనానికి యిది రాచబాట.

అట్లు జేసిన ప్రజాస్వామిక ప్రభుత్వమును పాలించుటకు మహాత్ములనర్హులు. అధికారం గౌరవములకు గడ్డితిని నానావస్థలు పడుటకాదు ప్రజాసేవ.

ఏ నూత్న వ్యవస్థను నిర్మించినా విద్యాధికులే. ఏ నూత్నవ్యవస్థను ఆకర్షించినా విద్యావంతులే కాన, ప్రభుత్వము విద్యావంతుల యధీనము కావాలి. గ్రామపంచాయితీనుండి కేంద్రప్రభుత్వ ప్రధాన మంత్రివరకూ వుద్యోగులే యధికారులై వుండాలి. విద్యార్హత వలన వుద్యోగము వుద్యోగార్హతవలన జీతము పుచ్చుకుంటూ ప్రధాన మంత్రివరకూ తమ కర్తవ్యాన్ని నెరవేరుస్తూ సేవకా భావముతో పాలించాలి. ప్రజలకు సేవజేయునది లేకపోయినను "మహాత్మ" బిరుదముల పొంది ప్రజలచేత పూజింపబడుటకాదు ప్రజాసేవ. ప్రజాస్వామికము.

ఈ వుద్యోగస్థులు ప్రభుత్వాన్ని పాలించుచూ, నూత్న వ్యవస్థను నాకర్షించుచూ, అమలు జరుపుచూ, నూత్నవ్యవస్థను సృష్టించుచూ, శరవేగమున నభ్యుదయమార్గాన్ని వెంబడించి, క్షణక్షణము ఆచార వ్యవహారముల మార్పుజేయుచూ ప్రజలకు సంపూర్ణ విజ్ఞాన సుఖముల కలుగ జేయుటే ప్రభుత్వ లక్ష్యము. ఇదే ప్రజాస్వామికము.

ఏ ప్రభుత్వమైనా (సిద్ధాంతమైనా) యీ కాలప్రవాహినిలో స్వల్పకాలము మాత్రమే. అధికకాలాన్ని వినియోగించుకొనుట అభ్యుదయాన్ని ఖూనీజేయుటే.



[illegible] రాజకీయ వేత్తలను అభ్యుదయ వ్యవస్థల నాలోచించుటకై ప్రత్యేకించవలెను. ఈ రాజకీయవేత్తలు సూచించు అభ్యుదయ మార్గముల ప్రభుత్వము (వృద్యోగస్థులు) ఆచరణయందు అమలు పెట్టెదరు. ఇవ్విధమున ప్రభుత్వ వ్యవస్థను మార్పుజేయుచూ ప్రజలందరకు న్యాయము కలుగజేయుచుండవలెను. ఇదే ప్రజాస్వామికము. ఇదే విప్లవలక్ష్యము.

ప్రకృతి పరిశోధకుల ప్రత్యేకించి యనేక నూత్న యంత్రముల సృష్టింపజేసి ప్రకృతి సంబంధమైన కష్టముల నామరూపాదులు లేకుండా నశింపజేసి, ప్రజలను సుఖపెట్టుటే ప్రజాస్వామికము.

వర్తకము:—ఉత్పత్తిదారునకు ప్రజలకు మధ్య సరకునందజేయువాడు, కమీషన్ వ్యాపారస్తుడు. ఇతడు వస్తువుధర యెంతవుండునో? అంతలాభము పొందుచున్నాడు. అందువలన వస్తువు విశేషధర యగుటంజేసి, ప్రజలు వస్తువుల నుపయోగించక పశుజీవితమునే గడపుచున్నారు. ఇందువలన వృత్పత్తి నశించినది. పరిశ్రమలు ఖూనీ జేయబడినవి. కాన సమస్త వ్యాపారము (వర్తకము) ప్రభుత్వమె నడపాలి. వుత్పత్తి ప్రభుత్వాధీనమే. మధ్యవర్తిత్వము ప్రభుత్వమేయైన వస్తువు వుత్పత్తి కిమ్మత్తునకే, ప్రజలకు చేరుతుంది. ప్రజలు విశేషవస్తూపయోగములచే యధిక నాగరీకులు కావచ్చు. అధికోత్పత్తి జరుగుతుంది. పరిశ్రమలు పెంపొందుతాయి. ప్రజాసౌఖ్యానికి ఇది రాచబాట.

ఇట్లు జేసిన వ్యక్తిపరము వ్యాపారమువలె అప్పుకము లేదని దిగులు పడనక్కరలేదు. దివాలాతీసిన మరణించనక్కరలేదు.

సమస్తవర్తకము ప్రభుత్వమె నడపిన వ్యాపారమున గల మోసము, అన్యాయము, అసత్యము, మున్నగు అవినీతియంతయు నశిస్తుంది.

చలనచిత్రాలను (సినిమాలను) అభ్యుదయముకొరకే వినియోగించాలి. ఏదేశచరిత్ర మెట్టిదో, యేదేశ ఆచార్య వ్యవహారము లెట్టివో, యేదేశ రాజకీయ వ్యవస్థయెట్టిదో, ప్రజలకు చలనచిత్రాల ద్వారా జూపిన ప్రజలు తమ యనాగరికతను గుర్తించి నాగరీకులగుటకు ప్రయత్నించెదరు. ఈ విధముగనే సమస్త విజ్ఞానవిషయములు ప్రజలకు బోధించాలి. దేశాల ప్రజలను విద్యావంతులుగను నాగరీకులగను, నీతివంతులుగను మున్నగు అభ్యుదయ వ్యవస్థల చలనచిత్రాలద్వారా కలిగించుట సులభము.

ప్రపంచములో యే క్రొత్త విషయమును కనిపెట్టినా చలన చిత్రాలద్వారా చూపాలి.

యంత్రముల పరిజ్ఞానము, నడిపించు జ్ఞానము చలనచిత్రాల ద్వారా ప్రజలకు బోధించాలి.

క్షణక్షణము పరివర్తన జెందు నాగరికతను ప్రజలకు జూపి అవలంబింపజేయాలి.

రోగాదులు సూక్ష్మజీవులవలన నెట్లు సంక్రమించుచున్నవో? వాటినుండి రక్షింపబడి యారోగ్యవంతులుగా నుండుటెట్లో? మున్నగు సమస్త ఆరోగ్యవిషయములు చలనచిత్రాలద్వారా బోధించాలి.

ఇటువంటి అభ్యుదయ చిత్రాలే యములునందుండాలి.
ఈ చిత్రాలు ప్రజల కుచితమున చూపబడతాయి.
విద్యార్థులకు చలనచిత్రాలద్వారానే విద్యాబోధన గరపాలి.
మారుమూలల గ్రామములకు టూరింగుటాకీస్ నెలకొల్పాలి.
చలనచిత్రాలద్వారానే సర్వాభ్యుదయము పొందాలి

పత్రికలు:—వార, పక్ష, మాసపత్రికలు నిషేధింపబడాలి. వలన, ఇందులో చదువదగ్గవ్యాసమొకటివున్నా, అందునిమిత్తమై విశేషధనాన్ని వెచ్చించవలసివస్తుంది. ఈ పత్రికలలో వుండే విజ్ఞాన

వ్యాసములు గ్రంథరూపేణ వ్యక్తమయి గ్రంథముచే యభివృద్ధి జెందాలి. వైజ్ఞానిక గ్రంథములు అభ్యుదయ గ్రంథాలు యభివృద్ధి జెందాలి.

దినపత్రికలు భాష కొకటుండినచాలు. ఏలన విశేషముగా నున్నందున నన్నిపత్రికలు చదివిననే వార్తలు తెలియుచున్నవి. కాన భాషకొక పత్రికయుండిన వున్నవార్తలన్నియు నాపత్రికయందే వుంటాయి. చదివేవారికి సులభము అనేక ప్రెస్సులందు అనేకమంది కష్టించనక్కరలేదు.

పండుగలు:—అభ్యుదయ, జయచిహ్నముగా జరుపు వుత్సవములకు పండుగలని పేరు.

హిందువులు జరుపు పండుగలన్నియు హిందువులపజయ చిహ్నములే. బ్రాహ్మణ జయచిహ్నములు కాన హిందువులెవ్వరూ, బ్రాహ్మణ పండుగలు జరుపరాదు.

నరకాసురుడు హిందువు. కృష్ణుడు బ్రాహ్మణతొత్తు. నాడు బ్రాహ్మల జయింపవలెనని దండెత్తగా బ్రాహ్మణతొత్తయిన కృష్ణుడు వధించినందున, బ్రాహ్మణులు జయచిహ్నముగ దీపావళి (నరకాసుర వధ) పండుగ జేయుచున్నారు. సంతోషించుచున్నారు. కాన హిందువులిట్టి యవమానకర పండుగలు జేయుట పాడియా? మనల నజ్ఞానుల జేసి వారి పండుగలు మనపై రుద్ది మనచే సంతోషింప జేయుచుండిరి.

కాన యజ్ఞాన వ్యవస్థయందేర్పడిన యన్ని మతస్థుల పండుగలు నిషేధింపబడాలి. స్వాతంత్ర్య దినోత్సవము మున్నగు అభ్యుదయ వ్యవస్థ దినములందే పండుగలు జరుపవలెను.

ప్రథమ కుశలము:—నేడు "నమస్తే" యనునది గౌరవార్థముగా భావింపబడి ప్రథమ కుశలార్హతను పొందినది.

అసలు "నమస్తే" పుట్టుకను విచారించెదము.

నాడు బ్రాహ్మణులు పూజ్యులుగా గౌరవనీయులుగా భావింపబడుచుండిరి. తదితరుల నీచముగ జూచుచుండిరి. అందువలన బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులకు నమస్కరింపవలయును గదా? అందు నిమిత్తమై బ్రాహ్మణులు సంస్కృతపదమైన "నమస్తే"ను తమకు నమస్కరించునపుడు అనవలయుననిరి. అట్లు అనుట ఉభయులకు యెంతో గౌరవప్రదమనిరి. అందువలన బ్రాహ్మణేతరులు నాడు బ్రాహ్మణుల నమస్కరించవలెనన్న; మోకాలు తొండవేసి మోచేతులపైనాని బ్రాహ్మణుని కాళ్ళపై రెండుచేతులు జోడించి "నమస్తే" యనువారు.

మహమ్మదీయు, ఆంగ్లేయుల రాకవలన నటువంటి అసభ్యత నిషేధింపబడి, నేడు నిలబడియె. బ్రాహ్మణులకు రెండు చేతులెత్తి జోడించి "నమస్తే" యనుచున్నారు బ్రాహ్మణేతరులు. కాని బ్రాహ్మణులు పూజ్యులైనందున బ్రాహ్మణేతరులచే నమస్కరింపబడేవారే గాని, బ్రాహ్మణులెవరికి "నమస్తే" యనవలసిన యవసరము లేదు. అందువలన బ్రాహ్మణులు "నమస్తే" యెందుకు యనవలయుననిరో విచారింతము.

మస్తే = మస్తిష్కమునందు, మస్థి = తలయందు, అస్థి = వుండునది. తలయందుండునది యేది? మనస్సు (బుద్ధి) అటువంటిది మస్తే = తలయందు "న" లేదు. అంటే తలయందు బుద్ధిలేదు. అన "బుద్ధిహీనుడను." (నమస్తే)

చూశారా? బ్రాహ్మణులు సంస్కృతమున నిట్టిపదముల కల్పించి సంస్కృతపరిజ్ఞానము లేకుండాజేసి, మనకు తెలియకుండా ఇట్లు మంత్రములనుపేర యెన్నియో తిట్లు తిట్టుచుండిరి. మనము (బ్రాహ్మణేతరులము) మంత్రములద్వారా సద్గతి కలుగజేయుచున్నారని భావించుచున్నాము. ఇకనైనా బ్రాహ్మణ కుతంత్రాన్ని తెలుసుకొండి. వారు కలుగజేయు సద్గతిలేదు. మనముపొందు దుర్గతిలేదు. మనలనుండి ధనసంగ్రహణజేసి బ్రాహ్మలే సద్గతిపొందుచున్నారు.

ధనముపోగొట్టుకొని బ్రాహ్మలచే తిట్టించుకొని చేయరాని యసభ్య కృత్యములచే, బ్రాహ్మణుల గౌరవించి దుర్గతిపాలగుచున్నాము. కాన సద్గతికావాలంటే తక్షణమే బ్రాహ్మణులను, బ్రాహ్మణ సిద్ధాంతముల విశ్వసింపకుండుట చాలు.

ఈ నమస్తేయనునది నీచులుగా పరిగణింపబడుచున్న బ్రాహ్మణేతరులచే బ్రాహ్మణులనిపించుకొనుచుండిరి. కాన అటువంటి నీచార్థములనే మనకు తెలియకుండా సంస్కృతమున కల్పించి మనల నిట్లు మోసము జేయుచుండిరి. ఇంకెన్నినాళ్లీ మోసము?

నేడు "నమస్తే" యనునది సభ్యతగా పరిగణింపబడి పరిచయస్థులు గౌరవనీయులు యెదురుపడిన, లేక వెళ్ళి సందర్శించిన, నా సమయమున ప్రథమ కుశలముగ "నమస్తే" యనుచున్నారు.

"నమస్తే" యొక్క యదార్థము తెలుసుకున్నారు. గాన ఇకనుండైనా "నమస్తే"ను నశింపజేయండి. కొందరు "జై హింద్" యనుచున్నారు. ఇదియు సముచితముగ లేదు. ఏలన, హిందూమహమ్మదీయ మతములు నిషేధింపబడుతాయిగాన, ప్రత్యేకించి హిందువులకు శుభముకోరే "జై హింద్" నిషేధింప బడాలి.

దేనివలన సౌఖ్యము పొందగలమో, దేనివలన నభ్యుదయము పొందగలమో, నట్టిదానికే శుభము కలగాలని, జయము కలగాలని దీవించెదము. "విప్లవము వర్ధిల్లాలి." ప్రథమ కుశలము "విప్లవము వర్ధిల్లాలి." అంతిమకుశలము 'విప్లవము వర్ధిల్లాలి.' ఇదే ప్రపంచమునకు ప్రథమ అంతిమ కుశలములుగా వుపయోగించుట అవసరము! శ్రేయస్కరము !! శుభము !!

## విప్లవము (II)

నామము పేరు:—క్షణక్షణము నాగరికత యభివృద్ధిజెందుటంజేసి తదనుగుణ్యాముగా యాచార వ్యవహారములును మార్పు జెంద

నలెను. కాన వ్యక్తుల నామములను నాగరికతకు గురికావలసియున్నది. నామాంతమున అమ్మ, అయ్య మున్నగు అనాగరిక చిహ్నములు నశించాలి. నవ్యనామములు ధరించవలెను

నామాంతరమున "కుల" చిహ్నము ననేమియు కూడదు. ఆంధ్రులకు ఒక్క "రావు" యనునది నామాంతమున నుండవలెను. లేకున్నను ఫర్వాలేదు. ఇట్లే ఈ యా భాషలయందు గౌరవార్థమున ప్రయోగించునదే యందరును ప్రయోగించవలెను.

భాష:— ఏతత్పూర్వకాలమంతయు అజ్ఞానావస్థయందుండుటం చేసి యంత్రములు లేనందున, రాకపోకలు సౌకర్య రహితములగుటచే, యెచ్చట జనులు అచ్చటనే భాషను నిర్మించుకొనవలసివచ్చినది. అందువలన ప్రపంచమందు 2796 భాషలు జన్మించినవి. ఒక్క ఇండియాయందు 225 భాషలు కలవు.

నేడు మన విజ్ఞానముచే అనేక యంత్రములనిర్మించి ప్రపంచ మంతయు యేకదేశముగా భావించబడుచున్న యీ రోజున, యిన్ని భాష లనవసరముకాదా? నేడు విజ్ఞానయుగముగాన, అజ్ఞానజన్య భాషలుండుట విజ్ఞానమున కవమానముకాదా?

ప్రపంచమున కంతకు ఒకే భాషయుండుట యవసరము. వుండి తీరాలి. నేమన్న అజ్ఞానజన్యభాషల్లో యేదన్నను ప్రయోజనము లేదు. ఈ అజ్ఞానజన్యభాషల నభ్యసించుట విశేష కష్టముగా నున్నందున వీటన్నిటిని నిషేధించాలసిందే. ఈ అజ్ఞానజన్యభాషలన్నియు అజ్ఞానముతోపాటు అజ్ఞానమందే లీనమవుట శ్రేయస్కరము.

మనము విజ్ఞానయుగమందు వుంటిమిగాన, మనవిజ్ఞానముచే సులభాతి సులభమున నభ్యశించునట్లు నూత్నభాషను సృష్టించాలి. ప్రపంచభాషా పండితోత్తములు సమావేశమై నూత్నభాషను సృష్టిం

చాలి. సుందరమైనదిగా విజ్ఞానయుగమున కనువైనదిగా నుండు నట్లు వాకభాషను సృష్టించవలయును. అద్దానిని ప్రపంచమంతయు స్వీకరించవలెను! అమలునందుంచవలెను !! అభ్యసించవలెను !!!

ప్రథమముగా తల్లినుండియె, భాషనేర్చుకొనవలయును. గాన ప్రతిస్త్రీకిని భాషాబోధనా వ్యాపారము (ట్రయినింగ్) శిక్షణ యివ్వాలి.

లిపి:— ప్రపంచమందుగల లిపులన్నియు అజ్ఞానావస్థయందే నిర్మింపబడినవి గాన, వీని నభ్యసించుట విశేష కష్టముగా నున్నందున, విశేషకాలము వెచ్చింపబడుటచేత, అనేక కష్టనష్టములు సంభవించుటచేత ప్రస్తుతమున్న లిపులన్నిటిని నిషేధించాలి.

నూత్నలిపిని సృష్టించవలెను. టైపు మున్నగువానికి సౌకర్యముగా నుండునట్లు ఇంగ్లీషు లిపివలె విడియక్షరములే సంయుక్తాక్షరములుగా నుండవలెను. ఇట్లు క్రొత్తలిపిని నిర్మించిన విశేష కష్టముండదు. కాన సులభమున లిపిని నేర్చుకొనవచ్చును.

విద్య:—స్వల్పకాలముననే నమిత విద్యావంతులగుట కిదియే మార్గము ప్రపంచమున జన్మించిన ప్రతిబాలుడు 18 వత్సరముల వరకూ విద్యనభ్యసించి తీరాలి. నూత్న లిపి, నూత్న భాషద్వారా 14 వత్సరములు సమస్త విజ్ఞాన మభ్యసించి పట్టభద్రులు కావచ్చును. ట్రయినింగ్ కోర్సులుకూడా పూర్తిజేయవలెను.

ప్రపంచమునకు వొకేభాష, వొకేలిపి యెట్లవసరమో నట్లే ఒకే నాణములు, విలువలు, తూకము లవసరమయ్యెడిని. తపాలా బిళ్ళలు కరెన్సీ మున్నగువానిపై యేదేశానికి జెందినదైన, నా దేశ స్వరూపముండవలెను.

జాతీయ జెండాల పైనను నట్లనే యుండవలెను.

ఆచారము పాశ్చాత్యుల ననుసరింపవలసినదే.

## ఉపసంహారము

జన్మతః అందరిమానసిక ప్రవృత్తులు నొకటె. కానీ పరిసరపరిస్థితులు వ్యక్తుల కొందరిని నీచులుగా జేయుచున్నవి. ఇందువలన ధనవంతులు, ధనహీనులు, సద్గుణవంతులు, దుర్గుణవంతులు, అధికులు-అల్పులు; అధికారులు, అనధికారులు; దొర, దొంగ, గౌరవంతుడు, గౌరవహీనుడు; నీతివంతులు, అవినీతివంతులు మున్నగు పరస్పర విరుద్ధగుణములుగల వ్యక్తులకు పరిసరపరిస్థితులే కారణము.

ప్రపంచమున ప్రతివ్యక్తి నీతిగా, నిజాయితీగా, గౌరవముగా జీవింపవలయు ననియే వాంఛించుచుండిరి. పరిసర పరిస్థితులు కొందర నవ్విధమునే యట్టిపెట్టును. మరికొందర నధోగతిపాలుజేయును. కాన యీ దోషము వ్యక్తులకు సంబంధించినది గాదు.

ప్రతివ్యక్తి నీతిగా, నిజాయితీగా, గౌరవముగా జీవింపవలయునన్న, వీనికి సరిపడు పరిస్థితుల కలుగజేయవలెను.

తద్భిన్నమున, నీచులు, దొంగలు, అజ్ఞానులని; గౌరవనీయులు, దొరలు, విజ్ఞానులు అసహ్యపడిన నేమియు ప్రయోజనములేదు.

ఈ విధమున వీరు అసహ్యపడుచున్నందున, వారు అట్టి నీచత్వమునే జీర్ణింపజేసుకొని, అదే తమ స్థానమునకు గౌరవమనిభావించి, యందుండి తప్పించుకోవటానికి ప్రయత్నింపకపోగా, అదే తమ నాగరికతగా భావించుకొందురు.

ధనవంతుడైన వ్యక్తి గౌరవముగా జీవించును. ఈ వ్యక్తియే ధనహీనుడైన నగౌరవమున జీవింపవలయునుగదా? అట్లే ధనహీనుడు అగౌరవమున జీవించుచున్నను, ధనవంతుడైన ధనమదాంధుడై, ధనహీనుల నగౌరవమున చూచును.

కాన వ్యక్తులందరు వున్నతిని గోరువారే. కాని పరిసరపరిస్థితులు వ్యక్తియున్నతమును నశింపజేయుచున్నవి. కాన ప్రతివ్యక్తి నీతిగా, నిజాయితీగా జీవింపవలయునన్న నతని యధోగతిపాలుజేయు పరిసర పరిస్థితుల ముందుగా చక్కబెట్టాలి. అనంతరము వున్నతస్థితి జెందటానికి అస్కారము వుంటుంది.

అనుకూల పరిస్థితులవలన వ్యక్తివున్నతమును పొందువాడుగను, అననుకూల పరిస్థితులవలన అధోగతిజెందువాడుగను నున్నందున, అననుకూలపరి ల అనుకూల పరిస్థితులుగా మార్పుజేయవలెను.

ఏ వ్యక్తియైనా పరిసరపరిస్థితులవలననే గౌరవనీయుడుగానో అగౌరవనీయుడుగానో జెందక తప్పదుగాన దుర్గుణములు - సద్గుణములు పరిసరపరిస్థితులే ప్రసాదించినవి కాన, మంచి, చెడ్డ వ్యక్తుల దోషము కాదనియు పరిసరపరిస్థితుల దోషమనియు నిర్ధారణమైనది.

ఏ వ్యక్తియైనా గౌరవించుకోలది గౌరవనీయుడగుటకు ప్రయత్నించును. హీనమున, నేహ్యాభావమునజూచిన నతడు "హీనుడను గాబోలు"నని హీనత్వమందే యుండును. కాన హీనముగ నే వ్యక్తిని జూడరాదు. అసలు గౌరవనీయులనునకునే పెద్దమనుష్యులు యితరుల హీనముగాజూచినందువనే నారు హీనులై హీనత్వమున నున్నారు. అట్లు తామే జన్మించిన జేయునదేమి? కాన ప్రతివ్యక్తిని గౌరవించుట గౌరవనీయుని లక్షణమని భావించాలి.

దుర్గుణవంతుల, దుర్గుణవంతులని వారి నెదుట యనకుండుట వారి యభ్యుదయనూచికము. అనినవారు సద్గుణవంతులు కావాలనుకోర్కె నశించి, దానినే తమ సభ్యతగా భావించి, వారి జీవితములో సద్గుణవంతులు కావటానికి ప్రయత్నింపరు. ప్రయత్నింపవలసిన యవసరమే లేదు.

పాపము, నరకము, దేవుడు మున్నగువానివలన భయపెట్టి వ్యక్తుల సన్మార్గుల జేయ ప్రయత్నించారు ఆస్తికులు. ఇందువలన యేమియు ప్రయోజనము కన్పట్టదు. వానియందు విశ్వాసములేనివారు దుర్మార్గులగుట కిది రాచబాట. కాన వ్యక్తి స్వతహాగా సన్మార్గుడగుటకు ప్రయత్నించుట, యెన్నటికిని దుర్మార్గుడగుటకు వలు లేని మార్గము.

మిగిలినవారు అటు పాపము, నరకము, దేవుడు, ఇటు పరిసరపరిస్థితుల మధ్య నలిగి విశేషదుఃఖాన్ని పొంది, మరణించుటము మినహా కలిగే ప్రయోజనము కన్పట్టదు.

వ్యక్తులు దుర్మార్గులగుటకు గల పరిస్థితులు మార్పుజేసిననే వారు సన్మార్గులయ్యెదరు; తద్భిన్నముగ పరిసరపరిస్థితుల నలాగేవుంచి పాపము, నరకము, దేవుడు యన్నంతమాత్రమున యవినీతి యేనాటికిని నశించదు. నశింపకపోగా దేవుని పేరట విశేషయవినీతి యభివృద్ధియగుచున్నది.

ప్రతి వ్యక్తి సన్మార్గుడగుటకే ప్రయత్నిస్తున్నాడు. కాని అననుకూల పరిసరప తులవలన దురా ర్గుడగుచున్నాడు. ఇందువలన ప్రతివ్యక్తి సన్మార్గుడు కావలయునన్న, ప్రతికూలప తుల నశింపజేసి అనుకూలపరిస్థితుల కలుగజేయుట మార్గము. ఇంతకు మినహా వేరే మార్గములేదు. ఇదే విప్లవసారము.

ప్రపంచములోనున్న గొప్పవారందరు యట్టి యనుకూల పరిస్థితులవలన నేర్పడిన వారే. కాన ఆ యనుకూల పరిస్థితులే నందరకున్న పక్షమున నంతకంటెను గొప్పవారు కావచ్చును.

కాన "విజ్ఞానులము, గౌరవనీయులము" యనుకొను పెద్దమనుష్యులు, తిండరకు నట్టి పరిస్థితులు కల్పింపక అజ్ఞానులు, అగౌరవనీయులనుచున్నారు.

ప్రకృతి క్షణక్షణము మార్పు జెందుతూనేయున్నది. దానితోపాటు పరిస్థితులు మార్పు జెందుతున్నాయి. అట్టి పరిస్థితుల వ్యక్తి వినియోగించుకోవాలి. సన్మార్గుడు, సుఖవంతుడు కావటానికి ప్రయత్నించాలి. అట్టి పరిస్థితుల వినియోగించుకొను సమర్థత లేనియెడల, సమర్థులైనవారెవరైనానుండిన నట్టిపరిస్థితులనందరికి నమర్పెట్టి సన్మార్గుల సుఖవంతుల జేయటానికి ప్రయత్నించాలి.

క్షణ క్షణము పరిస్థితులు మార్పుజెందనియెడల మానవాభ్యుదయమేలేదు. క్షణ క్షణము పదార్థము (ప్రకృతి) మార్పుజెందనియెడల పదార్థమునకు (ప్రకృతికి) అస్థిత్వమే లేదు.

మార్పుజెందుట ప్రకృతిధర్మము. అవ్విధమున నే మానవుల పరిస్థితులు మార్పు జెందుచున్నప్పటికి స్వార్థపరులైన యాస్తికుల, ధనవంతులవలన అభ్యుదయము, సుఖము పొందలేకున్నారు. కాన మానవులందరు యభ్యుదయమును, సుఖమును పొందవలెనన్న యాస్తికత్వము, ధనికత్వము నశింపజేయవలయును, దరిమిలా విప్లవము నిరాఘాటముగా శరవేగమున అభ్యుదయ (విజ్ఞా) మార్గమును వెంబడించును. ఇదే విప్లవలక్ష్యము.

క్షణ క్షణము ప్రకృతి మార్పుచెందుచున్నట్లే మానవుని భావములు క్షణక్షణము మార్పుజెందుచుండవలెను. ప్రకృతి, భావములు యవినాభావసంబంధముకలిగి, ప్రకృతితోపాటు భావములు, భావములతోపాటు ప్రకృతిని తన కనుకూలమగునట్లు మార్పుజేసుకొనుచూ మానవుడు విజ్ఞానియై సుఖమున జీవించుటే యభ్యుదయము.

ప్రకృతితోపాటు భావములు, భావములతోపాటు ఆచార, వ్యవహారములు క్షణక్షణము మార్పుజెందితీరవలయును. అట్లు మార్పుజేసుకొనుటే మానవకర్తవ్యము, మానవత్వము. ఇందులకు వ్యతిరిక్తమున సనాతనాచార, వ్యవహారములే యెల్లకాలము సరిపోవునని తలంచుట పశులక్షణము, ప్రకృతికి విరుద్ధము.

ఇటువంటి సనాతనాభావ జీరహ్రృదయఛాందసుల తక్షణమే వెలివేయవలయును. లేకున్న సంఘాభ్యుదయమం యు ఖూనీజేయబడును. సంఘవినాశనంకన్న ఒక వ్యక్తి వినాశనం ఉత్తమం కాదా?

ఇట్లు క్షణక్షణము సనాతనత్వమును నశింపజేయుచూ ఆధునికత్వమును యాచరింపవలయును. ఇట్లు ఆచరించువే వ్యక్తిత్వమనబడును! విజ్ఞానమనబడును!! పురుషత్వమనబడును!!!

ఇట్లు విప్లవాలంబకులై ప్రకృతిని జయించుచుండవలెను. ప్రకృతిశక్తుల తన యధీనము జేసికొనవలయును. తన కష్టముల నిర్మూలింపవలయును. జీవితమును సుఖవంతము జేసుకొనవలయును. ఇట్లు విప్లవాలంబకులై ప్రకృతిని స్వాధీనపరచుకొని తద్వారా సుఖంగా జీవించటమే మానవత్వమనబడును! విజ్ఞానమనబడును!! నాగరికత యనబడును!!!

ఇట్లు విప్లవముచే (మార్పుచే) పొందిన నేటి నాగరికతను "ఇదే నాగరికత" యన్న నాగరికతయనుటకే యాస్కారము లభింపదు.

గతమును "యనాగరికత" యని మనము యెట్లు భావించుచుంటిమో అట్లే వేలం వత్సరముల దరిమిలా వారు, మనను అనాగరికులుగా భావించుకొందురు. కాన నేటి నాగరికత నాగరికత కాదు. నాగరికతయందు స్వల్పముమాత్రమే. మనము దీనినే నాగరికతయనుకున్న ఇక ప్రయత్నింపవలసిన యవసరములేదు. కాన భవిష్యత్తు ఖూనీ జేయబడుచున్నది. అట్లు ఖూనీజేయబట్టే నేడు మనము యింతటి యనాగరీకులముగా వున్నాము. లేనియెడల మన మీకాలమునకే యెంతో నాగరికత యనుభవించెడివారము.

కాన నేడున్న నాగరికత స్వల్పముమాత్రమే. ఆ స్వల్పనాగరికతయైనా ఒక్క ధనికులకే యందుబాటులో వుంది. కాన నాగరికత యభివృద్ధి జెందాలన్న; అట్లు అభివృద్ధిజెందిన నాగరికత ప్రతివ్యక్తి అందుబాటులో వుండాలన్న, విప్లవానికి నూటికి నూరుపాళ్ళు ఆస్కారముంది! అగత్యముంది!! అవసరముంది!!!

ఇదే

# విప్లవ సందేశము.



# మరి మూడు మాటలు

## 1

నేను డార్విన్ పరిణామ సిద్ధాంతాన్ని అంగీకరించనివారు మానవులన బరగరు. మర్కటము లనబరగు. ఈ పరిణామసిద్ధాంతరీత్యా యీ భూస్థలిపై 10 వేల సంవత్సరములనుండి మాత్రమే మానవజాతి యున్నట్లగపడుచున్నది. ఇంతకు పూర్వము కోతులే సర్వావయవములు గలిగిన రాజాధిరాజులు. ఇట్లు, కాలాతీతమగు కొంది దేహపరివర్తన జెందుచూ ప్రకృతిజ్ఞాన సముపార్జనాధిక్యత కల్గి కోతులే మానవులయినాయి. కాన బ్రాహ్మలుచెప్పే నాల్గుయుగాలకు ఆస్కారమే లేదు. కాన ఆయా యుగాల చరిత్ర (భాగవత–భారత–రామాయణము) లను మనము ప్రత్యేకించి వ్రాసికొను నక్కర లేదు. పై గ్రంథములందు ఆటవిక యనాగరికత స్పష్టముగా కన్పట్టు చున్నందున ఆర్య, ద్రావిడ యుద్ధమే భారతముగానూ, దక్షిణా శేషించిన ద్రావిడుల జయించిన విధము రామాయణ గాథగానూ కన్పట్టుచున్నవి. కాని ఆ యా ఇతిహాసాల్లోవున్న చరిత్ర ఇటీవలి ఆర్య, ద్రావిడ చరిత్రయని ప్రత్యేకించి చెప్పనవసరము లేదు. హిందూదేశ చరిత్ర; పాఠకులకు తెలియగలందులకుగాను ఆఇతిహాసాల్లోవున్న వ్యక్తుల పేర్లనే నేను ప్రయోగించితిని. అంతియే కాని ఆనాడు ఆయా నాయకులుకల వ్యక్తు లుండిరని నా యభిప్రాయము కాదు. ఐన ఆర్యులు హిందూదేశముపై దండయాత్ర జేసినది క్రీ. పూ. 14 వ శతాబ్దమందు. ఆర్య-ద్రావిడ (భారత) యుద్ధము క్రీ. పూ 10 వ శతాబ్ద మందు. ఆర్య ద్రావిడ (రామాయణ) యుద్ధము క్రీ. పూ 8వ శతాబ్దమందు. చార్వాకుడు క్రీ. పూ. 7 వ శతాబ్దమందు. బౌద్ధవిప్లవము క్రీ. పూ 5 వ శతాబ్దమందు కుమారిల–శంకరులు క్రీ. శ 8 వ శతాబ్దమందు కలరు. ఇదియే ప్రాచీన హిందూదేశ చరిత్ర.

## 2

మానవునకు గౌరవాదులు జన్మతః సంక్రమించునవి కావు. బ్రహ్మణవర్ణము జన్మతః తమకు గౌరవము సంక్రమింప జేసుకొని, బ్రాహ్మణేతరులకు అగౌరవము అంటగట్టారు. ఇందుకు దృష్టాంతమే మన, 5 వత్సర బ్రాహ్మణ బాలుడు, నూరు వత్సరములు గల్గిన బ్రాహ్మణేతర వయోవృద్ధుని 'అరే, ఒరే' మన్నను నీచార్థ

సంభోదాదులచే సంభోదించుట ప్రత్యక్షముగా చూచుచున్నాము. ఈ బ్రాహ్మణ బాలుడు బ్రాహ్మణేతర వయోవృద్ధుల నైనను లెక్కచేయక యింతటి అగౌరవముగా, నీచముగా చూచుటకు కారనమేమి? ఏమన, బ్రహ్మణ బాలురకు "మనము గౌరవ నీయులము, గొప్పవారము, అగ్రవర్ణులము; బ్రాహ్మణేతరులు నీచులు, అగౌరవనీయులు" అని బాల్యమునుండియే బ్రాహ్మణులు గౌరవము సంక్రమింప జేసికొనుచూ బ్రాహ్మణేతరులకు అగౌరవము అంటగట్టుచున్నారు. లేనియెడల బ్రాహ్మణ బాలుడు బ్రాహ్మణేతర వయోవృద్ధుని నీచంగా చూచుటలో అర్థము లేదు. కాన బ్రాహ్మలపై చర్య తీసుకొనుటకు బ్రాహ్మణేతరులకు సంపూర్ణాధికారము కలదు

దరిమిలా, మానవునకు గౌరవా గౌరవాములెట్లు సంక్రమించును? జన్మతః మానవజాతి గౌరవమంతయు నొకటే దరిమిలా ప్రవర్తనను బట్టి గౌరవా గౌరవాదులు వ్యక్తి సంక్రమింప జేసుకుంటారు. అంతియేకాని బ్రాహ్మణునకు జన్మించినంత మాత్రమున గౌరవనీయుడు. బ్రాహ్మణేతరులకు జన్మించినంత మాత్రమున అగౌరవనీయులు కారు కాన జన్మతః మానవులందరకు ఒకే గౌరవమిచ్చి, సత్ప్రవర్తనచే నద్దాని సంరక్షించుకొన్న యావ్యక్తి గౌరవనీయుడనబడును. మరియు వయస్సును బట్టి గౌరవా గౌరవములు నిర్ణయింప బడతాయి. అన, జన్మితః మానవులందరకు నొకే గౌరవమిచ్చితిమి గాన, వయోవృద్ధులు పిన్నవయస్కుల మాధ్యమిక గౌరవముతో చూచివచాలు. పిన్న వయస్కులు వయోవృద్ధుల నధిక గౌరవముతో చూడవలెను. అవ బ్రాహ్మణ బాలుడు బ్రాహ్మణేతర వృద్ధుని నమస్కరించి, కడు గౌరవముతో సత్కరింప వలెను. అలాగే బ్రాహ్మణేతర వయోవృద్ధులు బ్రాహ్మణేతర పిన్న వయస్కుల నెట్లు మాధ్యమిక గౌరవముతో చూచెదరో? నట్లనే బ్రాహ్మణ పిన్నవయస్కులను చూడవలెను. అలాగే బ్రాహ్మణ పిన్నవయస్కులు తమ పెద్దలు నెట్లు గౌరవించెదరో? నట్లనే బ్రహ్మణేతర నధిక వయస్కుల గౌరవింపవలయును. ఇందుకు భిన్నముగా ప్రవర్తించిన తక్షణమా బ్రాహ్మణ బాలునకు నాలుగు లెంపకాయలిచ్చి బుద్ధిచెప్పండి.

ధనవంతులకునూ యిదే వర్తిస్తుందా? వర్తిస్తుంది. ధనవంతులు, ధనవంతులెలా అయారూ? శ్రామికుల శ్రమచే అయ్యేవత్పత్తిలో స్వల్పభాగము శ్రామికుల అధిక భాగము దోచుకున్నందున ధనవంతు లగుచున్నారు. అదియునుం గాక వారలు ఉత్పత్తి వినాశకులుగాను, అభివృద్ధి నిరోధకులు గాను వున్నందున వీరికి ఏక గౌరవము యివ్వవలసిన అవసరములేదు.

విద్యావంతులకునూ యిదేవర్తిస్తుందా? వర్తిస్తుంది.

ఎవరికి ధనముచుంటే వారేతింటారు. ఎవరికి విద్యవుంటే వారేనాలుగు రాళ్ళు సంపాదించు కుంటారు. అంతమాత్రమున వీరికిన్నీ అత్యధిక గౌరవము యివ్వవలసిన అవసరములేదు. విద్యను దేశసేవకై వినియోగించినప్పు డట్టివారికి మాత్రము అత్యధిక గౌరవాన్ని యివ్వండి. నాలుగురాళ్ళు సంపాదించు చున్నపటికి ఫర్వాలేదు.

## 3

ఆధునిక బ్రాహ్మణ యువకులు చాలా బుద్ధిమంతులని బ్రాహ్మణేతరు లభిప్రాయ పడుచున్నారు ఇలాంటి యభిప్రాయము కలవారు బుద్ధిహీనులని నేను యభిప్రాయ పడుచున్నాను.

బ్రాహ్మణేతరుల నుద్ధరించుటకు కంకణము కట్టుకున్న బౌద్ధమతమును బ్రాహ్మణు నాశనము జేశారు. మనుస్మృతి ధర్మాలు అమలునం దుంచారు. ఆ ధర్మాలే భవిష్యత్తులోను చలామణియం దుంచుటకు విశ్వప్రయత్నాలు జేశారు. వానిలో సముద్రయానము నిషేధించుట గమనింపదగిన ముఖ్యవిషయము. లేనియెడల విదేశీయు లెవరైనా హిందూదేశము ప్రవేశించిన తమ యన్యాయ, యధర్మ, యవినీతులు స్వేచ్ఛగా చలామణి యవునని విశ్వాసమేముంది? అందుకని సముద్రయానము నిషేధిస్తూ, అది మహా పాపకార్యముగా ధర్మనిర్ణయము చేశారు. క్రీ. శ. 8 వ శతాబ్దమునుండి నేటి వరకూ ఆమనుస్మృతి ధర్మాలే అమలునందున్నవని చెప్పుటకు సాహసించ నక్కరలేదు.

దాదాపు నేటివరకూ చలామణి యవుచున్న ఆ మనుస్మృతి ధర్మాలు నేడెందులకు చలామణి యగుటలేదు? బ్రాహ్మణేతరులు ముఖ్యంగా యీ విషయమై దర్యాప్తు చేయవలసి యున్నది. క్రీ. శ. 8 వ శతాబ్దమునుండి నేటివరకు జరిగిన మార్పులేయని చరిత్రకథనము. అట్టిమార్పులేవి? క్రీ. శ. 10 వ శతాబ్దములో మహమ్మదీయుల ప్రవేశము. దరిమిలా ఆంగ్లేయుల రాక. ఈ రెంటివలన మనుస్మృతి ధర్మాల చలామణి నశించినది. మహమ్మదీయులు, ఆంగ్లేయులు హిందూదేశమున ప్రవేశించిన యెడల మనుస్మృతి ధర్మాలు నిరాఘాటంగా చలామణి యగునని ప్రత్యేకించి చెప్ప నవసరములేదు. కాన నేటికిని ఆ మనుస్మృతి ధర్మాలే చలామణియం దుండునన్న విషయము మరచిపోకుడు. అట్టి ఘోర దుర్దశను మహమ్మదీయులు, ఆంగ్లేయులు నివారించారు. బ్రాహ్మణేతరుల తరఫున వారికి నా ధన్యవాదములు. కాన మహమ్మదీయులు, ఆంగ్లేయులు హిందూదేశము ప్రవేశించని యెడల ఆధునిక బ్రాహ్మణ యువకులున్నూ ఆ ధర్మాలనే చలామణి జేసేవారు. మహమ్మదీయులు, ఆంగ్లేయులు రాకపూర్వమున్న బ్రాహ్మణ యువకులు మనుస్మృతిధర్మాలను చలామణి చేయలేదా?

